


మాటలు పలుకవలెనా వర్ణించ.....నయనాలు చాలునే





ఐటెక్స్
కాజల్ సుప్రీం
కవిపాడూ కాటుక కండ్లూ...
మనసును దోచూ క్రీగంటి
చూపూ.... దీని పరమ రహస్యాన్ని
తెలుసుకోండీ - యిప్పుడూ!





EYETEX
KAJAL SUPREME
FREE!
EYETEX Pallavi
ఉచితం!
ఒక్కో ఐటెక్స్ సుప్రీంతోనూ
పల్లవి స్టిక్కర్ బొట్టుల
ఒక అట్ట ఉచితం.
సరుకు వున్నంతవరకే
యీ సదుపాయం





ఐటెక్స్
బంగారు తేజస్సు

# చమత్కార కథలు

## శలవు

"మేడమ్! మిమ్మల్ని ఆఫీసర్‌గారు రమ్మంటున్నారు" చెప్పాడు అటెండర్. అర్జంట్ ఫైలేదో టైప్ చేస్తూ తలపైకెత్తి "ఏంటి సంగతి" అడిగింది జ్యోతిర్మయి.

"ఏమో... నాకూ తెలియదు. మీ లీవ్‌లెటర్ టైప్‌మిషన్ ముందునుండి లేచి పక్కనే ఉన్న ఆఫీసర్ రూమ్‌లోకి వెళ్లి "పిల్చారా సార్" అడిగింది.

"అవునమ్మా... ఒకేసారి ముప్ఫయ్ రోజులు లీవ్ అప్లయ్ చేస్తేనూ..." మధ్యలో ఆగాడు ఆఫీసర్.



ఎదురుగా పెట్టుక్కూర్చున్నారు"

"ఓహో! అదా... ఏమిటో నేనెప్పుడు లీవ్ అప్లయ్ చేసినా ఏదో ఒక బ్రేక్" అంది ఎదురుగా ఉన్న కొలీగ్ సుందరితో.

"త్వరగా వెళ్లండి. ఆలస్యమయితే ఉపన్యానం పొడుగు పెరుగుతుంది" పక్క సీట్ అకౌంటెంట్ రెడ్డి సలహా ఇచ్చాడు తన గతానుభవాల్ని గుర్తుచేసుకుంటూ.

ఇదంతా ఎప్పుడూ ఉండేదే అనుకుంటూ

"మా ఆడపడుచు పెళ్లి ఉందిసార్. కాస్త ముందుగానే వెళ్లాలి సార్. అందుకని..." నసిగింది, జ్యోతిర్మయి.

"చూడమ్మా, సంవత్సరానికి ఎన్ని రోజులు?" తన స్వంతధోరణిలో అడిగాడు.

"365 రోజులండి!"

"వెరీగుడ్! మనం రోజుకు ఎన్నిగంటలు పనిచేస్తాం?"

"ఆరుగంటలు సార్"

కవర్‌పేజీ ఫొటోగ్రాఫర్: శివసత్యమూర్తి

"అంటే రోజులో నాలుగవవంతు, సంవత్స రంలో నాలుగోవంతు... అనగా తొంభైఒక్క రోజులు. అందులోంచి యాభైరెండు ఆదివారాలు తీసేస్తే ఎంత మిగుల్తుంది?"

"ముప్పయి తొమ్మిది రోజులు" కోపం దిగమింగుకుని చెప్పింది.

"ఎగ్జాట్లీ! ఇందులోనుంచి మళ్లీ పబ్లిక్ హాలీడేస్... మినిమమ్ ఫిఫ్టీన్ డేస్ పోతే మిగిలేవి ఇరవైనాలుగు రోజులు. అంటే మనం సంవత్సరంలో ఇరవైనాలుగు రోజులుమాత్రమే పనిచేస్తామన్నమాట. మరి నువ్వు ఒక్కసారిగా ముప్పయి రోజులు సెలవు కావాలంటే నేనెవరికి చెప్పుకునేది? ఎలా శాంక్షన్ చేసేది?" సుదీర్ఘమైన ఉపన్యాసాన్ని ముగించాడు.

కోపంతో ఎర్రబడిన ముఖానికి పట్టిన చెమటను కర్చీఫ్‌తో అద్దుకుంటూ "నిజానికి నేను అడిగిన లీవ్ చాలా తక్కువ సార్!" అంది, జ్యోతిర్మయి.

"తక్కువా? ఎలా అమ్మా?" ఆశ్చర్యంగా అడిగాడు.

"చూడండి... నెలకు ముప్పయి రోజులు... రోజుకు మేం పనిచేసేది ఆరు గంటలు. అంటే రోజులో నాలుగోవంతు... నెలలో నాలుగోవంతు అంటే వారంరోజులు. అందులోనుండి నాలుగు ఆదివారాలు తీసేస్తే ఎంత మిగుల్తుంది... మూడు రోజులు. మూడు రోజులు లీవ్ శాంక్షన్ చెయ్యడానికి మీకు అభ్యంతరం ఏమిటో నాకర్థంకావడంలేదు"

జ్యోతిర్మయి లెక్కలకు ఆఫీసర్ నోటమాట రాలేదు. వెంటనే ఆ 30 రోజుల లీవ్ శాంక్షన్ చేసేశాడాయన

**– బొబ్బిలి శ్రీనివాసరావు**

## పుణ్యం!

రిజర్వేషన్ కౌంటర్ తెరవడానికి అరగంట ముందరే స్టేషన్‌కి చేరుకుని క్యూలో నుంచున్నాను. అప్పటికే పదిమంది పైగా క్యూలో వున్నారు. కంప్యూటర్ రిజర్వేషన్ ధర్మమా అని ఏ క్యూలోనయినా నుంచుని టికెట్ రిజర్వ్ చేయించుకోవచ్చు. నాది నాలుగో నంబర్ కౌంటర్.

రిజర్వేషన్ క్లర్క్ వచ్చి, పది నిమిషాలలో సెటిల్ అయి, అన్నీ సరిగ్గా వున్నాయని నిర్ధారణ చేసుకుని టికెట్లు ఇవ్వడం ప్రారంభించాడు. ఇరవయి నిమిషాలలో నావంతు వచ్చింది. పూర్తిచేసివుంచుకున్న అప్లికేషన్ యిచ్చాను.

ఒక నిమిషంలో 'స్క్రీన్‌మీద ఊటీకి ఆర్.ఎ.సి.లో ఇద్దరికి వున్నాయని వచ్చింది. ప్రాణం లేచివచ్చి ఊపిరి పీల్చుకున్నాను. ఇద్దరికి 146 రూపాయలని కంప్యూటర్ టికెట్ కట్‌చేసి 'ఒక రూపాయి యివ్వండి. ఐదురూపాయలు ఇస్తాను' అన్నాడు రిజర్వేషన్ క్లర్క్. నాదగ్గర చిల్లరలేదు. ఆ విషయమే చెప్పాను.

నా వెనకాల నుంచున్నవారి అసహనం పెరిగిపోతోంది. ఇంతలో వెనక నుంచున్న ఒకరు రూపాయి యిచ్చి 'మార్చి యివ్వండి' అన్నారు. ఆ రూపాయి తీసుకుని రిజర్వేషన్ క్లర్క్‌కి యిచ్చి టికెట్, ఐదురూపాయల నోటు తీసుకున్నాను.

"మీరు యిక్కడే వుండండి - చిల్లర మార్చుకుని వస్తాను" అని రూపాయి యిచ్చిన ఆయనకు చెప్పి బయటకు వచ్చాను. ఎదురుగా కనిపిస్తున్న 'ఎస్‌ప్రెస్సో కాఫీ స్టాల్'కి వెళ్లి కాఫీతాగి ఐదు రూపాయలు యిచ్చాను. రెండు రూపాయల నోటు, రూపాయి నాణెం తిరిగి యిచ్చాడు.

అవి తీసుకుని రిజర్వేషన్ హాల్‌లోకి హుటాహుటిన వెళ్లాను. ఎంత వెతికినా ఆ రూపాయి యిచ్చిన ఆయన కనిపించలేదు.

నేను ఎవరికోసమో వెతుకుతున్నానని, 'ఏమిటి ఎవరు కావాలి' అని నన్ను తెలిసిన ఒకాయన అడిగాడు. చెప్పాను. 'టికెట్ దొరికిన ఆనందంలో తన రూపాయి గురించి మరచిపోయి వెళ్లిపోయివుంటాడు. పేరు తెలియని పుణ్యాత్ముడి ధర్మం అని చెప్పి ఏ గుడిలోనో రూపాయి వెయ్యండి' అని ఆయన సలహా యిచ్చాడు.



సలహా బావుందని బయటకు వచ్చాను. అక్కడేవున్న చిన్న వినాయకుడి గుడిలోకి వెళ్లి దణ్ణం పెట్టుకుని, పేరు తెలియని వ్యక్తికి యివ్వవలసిన రూపాయికి, నా రూపాయి ఒకటి చేర్చి రెండు రూపాయల నోటు గుడి హుండీలో వేశాను. గుడిలోంచి రోడ్డుమీదకి వచ్చి మరొకసారి ఊపిరి పీల్చుకున్నానోలేదో-

''సార్ రూపాయి యివ్వలేదు. మీకోసమే చూస్తున్నాను'' అని నాకు రూపాయి యిచ్చిన ఆయన నా ముందు ప్రత్యక్షమయ్యాడు.

**— తాజీప్రసాద్**

## ఫోనులో బాంబు

సచివాలయంలో నేను పన్చేసే డిపార్ట్‌మెంట్ సముద్రమంత పెద్దది. అన్నీ కీలకమయిన శాఖలే కావడంతో స్టాఫందరికీ ఎప్పుడూ ఏదో ఒక హడావుడి. ఊపిరి సలపని పని.

అవి చాలక మా ప్రాణానికి 'సహకార సంఘాల' ఎన్నికలనే కొత్త బెడద వచ్చిపడింది. ఈ దెబ్బకి మేం పబ్లిక్ **హాలీడేస్**ని మర్చిపోవలసివచ్చింది.

గుడ్డిలో మెల్లలా- మా సహోద్యోగులంతా కుర్రకారు కావడంతో సరస సంభాషణలతో హుషారుగా పనిచేసుకుపోయేవాళ్లం. అందులోనూ మా సెక్రటరీగారి పి.ఎ.లు మూర్తి, శర్మ భలే సరదా మనుషులు. కొండంత పనిని సైతం ఇట్టే క్షణాల్లో ఊదిపారేసి ఒకర్నొకరు తమాషాగా ఆటపట్టించుకుంటూ కాలక్షేపం చేస్తుంటారు.

ఆరోజు ఆదివారం. పైగా దీపావళి పండగ. అయినా మేం పదిన్నరకల్లా యధాప్రకారం ఆఫీసుకి చేరుకున్నాం. మధ్యాహ్నం ఒంటిగంటదాకా మాకు వాచీ చూసుకునే తీరిక కూడా దొరకలేదు.

నేను లంచ్‌కి లేద్దామనుకుంటుండగా మూర్తి నా టేబిల్ దగ్గరకొచ్చాడు.

''గురూ! ఓ ఫోన్ చెయ్యాలి...'' అంటూ ఓ నెంబర్ డయల్ చేశాడు.

నాకాశ్చర్యం కలిగింది. అది వాళ్ల పేషీ నెంబరే. ఇప్పుడే అక్కణ్ణుంచి వస్తూ, మళ్లీ అక్కడికే... అదీకాక ఆ రూం కూడా ఎంతో దూరం లేదు.

''హు ఈజ్ స్పీకింగ్...?'' గొంతులో ధ్వనించిన ఆ అధికారానికి నేను తెల్లబోయాను.

''నేను శర్మని సార్...'' అవతలివైపునుండి వినయంగా ధ్వనించిన గొంతు నాక్కూడా వినబడింది.

మూర్తి రిసీవర్‌కి చేతినడ్డుపెట్టి, నాతో



మెల్లిగా అన్నాడు- "చిన్న డ్రామా! మనవాణ్ణి ఎలా అదరగొడతానో చూడు..." అని చెప్పి మొదలుపెట్టాడు ఫోనులో.

"సీ... మిస్టర్ శర్మా. ఐయాం విష్ణుశర్మ, ఐ.ఏ.ఎస్..." హుందాగా, గంభీరంగా అన్నాడు.

"నమస్కారం సార్... వాట్ కెనైడు ఫర్యు సార్..." మహావినయంగా విన్పించింది శర్మ గొంతు, అవతల్నుంచి.

"మిస్టర్ శర్మా... ముందు మీ ఆఫీసర్కి కనెక్షనివ్వు- నీమీద కంప్లయింట్ ఇవ్వాలి. మీకు ఎన్నిసార్లు ఫోన్ చేసినా- సరైన రెస్పాన్సే ఉండదు"

"... ... ..."

"ఏం! మాట్లాడవూ? ప్రభుత్వం మిమ్మల్ని ఊరికే పోషిస్తోందటయ్యా. సిన్సియారిటీ అండ్ రెస్పాన్సిబిలిటీ తెలీనివాళ్లని షూట్చేసి పారెయ్యాలి. **వాడ్డూయూ సే?**"

అమోఘంగా చెరిగిపారేస్తున్నాడు మూర్తి- "నీ ఏక్షన్ అద్భుతం..." అన్నట్లు సంజ్ఞచేసి చెప్పాన్నేను.

"ఓ.కే. శర్మా... నేను మళ్లీ ఫోన్ చేస్తాను. ఈ విషయం ఇంతటితో వదిలిపెట్టను. మీ బాస్కి చెప్పి, నీకు రివర్షనిప్పించడం ఖాయం..." ఫోన్ పెట్టేశాడు మూర్తి.

"వండర్ఫుల్. శర్మని భలేగా అదరగొట్టేశావు. మీవాడి ముఖం ఇప్పుడు ఎలా ఉంటుందో చూడాలనుంది" అన్నాను నేను.

"మా శర్మ గొప్ప డిప్లమాట్ గురూ. ఒకవేళ నా గేమ్ని పసిగట్టినా బయటపడడు. మరోసారి అదే రైప్రులో నన్ను అటాక్ చేస్తాడు. అయితే మన్దగ్గర ఆ పప్పులేం ఉడకవనుకో..." అన్నాడు.

ఆ సాయంత్రం మాకు పెందరాళే ఇళ్లకు చేరే అదృష్టం కలిగినందుకు సంతోషపడుతూ, త్వరత్వరగా తయారవసాగేం వెళ్లిపోయేందుకు.

నేను మూర్తికోసం వాళ్ల పేషీకి వెళ్లాను. అక్కడతను సిద్ధంగానే ఉన్నాడు.

కాని శర్మ ఏదో కొంపలు మునిగిపోతున్నట్లు- "గురూ... ఇప్పుడే ఓ అయిదునిమిషాల్లో వచ్చేస్తాను. ప్లీజ్ వెయిట్. ముగ్గురం కలిసి వెళ్దాం. సరోవర్లో టిఫిన్ ఖర్చు నాదేలే! అన్నట్లు ఫోన్కాల్స్ వస్తాయేమో. కాస్త అలర్ట్గా ఉండు..." అని మూర్తికి పురమాయించి వెళ్లాడు.

"ఏమిటో వెధవ్వుద్యోగం. వినుగు పుడు తోంది. ప్రతి క్షణమూ టెన్షనే. పిచ్చెక్కిపో తోంది..." సిగరెట్ ముట్టించి, రిలాక్సవుతూ అన్నాడు మూర్తి.

నిజమే... ఆ స్థానంలో నేను ఇమడలేకనే, ఆ వత్తిళ్లు, తలనొప్పులు భరించలేకనే దిగువస్థాయికి సీటు మారి అక్కడ అతన్ని ఇరికించేను. ఆ పోస్టుకి అతను బాగానే సరిపోయాడు.

ఇంతలో ఫోన్ మోగితే నేను ఆ రిసీవరందుకొని- "హలో..." అన్నాను.

"విష్ణుశర్మ హియర్" అవతలివైపునుండి వచ్చిన జవాబుకి నేను కంగారుపడి ఆ విషయం మూర్తికి చెప్పాను.

వెంటనే అతను- "గాడిదగుడ్డు కాదూ..." అన్నాడు.

"మన సెక్రటరీగారీపాటికి ఢిల్లీ ఫ్లైట్‌లో ప్రయాణిస్తూ ఉంటారు. ఇవ్వాళ ఇంత ముఖ్యమైన పండగరోజున అదీ ఈ టైంలో అంత పెద్దాఫీసరు ఎందుకు ఫోన్ చేస్తాడు? మనం నమ్ముతామా? సో, వీడు డూప్లికేట్ విష్ణుశర్మ అన్నమాట. అంటే- మన శర్మ అలా నటిస్తున్నాడన్నమాట. చూశావా ఫ్రెండ్. నా అస్త్రాన్ని తిరిగి నా మీదకే ప్రయోగించాలని మన మిత్రుడికి ఎంత ఆత్రంగా ఉందో? పైపెచ్చు వెళ్తూ వెళ్తూ ఫోన్ గురించి ప్రత్యేకంగా ప్రస్తావించి మరీ వెళ్లాడు. ఎత్తుకి పైఎత్తు వేశానని మురిసిపోతున్నాడు కాబోలు. పూర్‌ఫెలో. ఆ ఫోనిటివ్వు. ఇప్పుడు పైచేయి నాదేనని నిరూపిస్తా..." అంటూ రిసీవరందుకున్నాడు

"ఊఁ... ఎవరయ్యా నువ్వు! విష్ణుశర్మవా? అయితే ఏంటి నీ గొప్ప? పేరు పక్కన ఐ.ఏ.ఎస్. అనే మూడక్షరాలు తగిలించుకుని భలేగా మిడిసిపడుతున్నావే.

నీలాంటి ఆఫీసర్ పక్షుల్ని మేం నవాలక్ష మందిని చూశాం. నీ డాబు, దర్పం నీ ఇంటి దగ్గర, నీ పెళ్లాం ముందు ప్రదర్శించుకోవోయ్ కుంకా" అంటూ అనర్గళంగా దంచిపారేస్తున్నాడు.

పాపం... రెండుసార్లూ బోల్తాపడినందుకు నాకు అవతలున్న శర్మమీద జాలేసింది. మూర్తిని మరీ తక్కువ అంచనావేసి దెబ్బతిన్నాడు.

మూర్తి అంతట్తో ఆపకుండా, మహోత్సాహంతో రెచ్చిపోతూ- "ఓయ్ పంతులూ... నువ్వు రేపో మాపో రిటైరవుతావుకదా! అప్పుడు చక్కగా పిలకపెట్టి, పంచకట్టి, ఎంచక్కా తద్దినాల గిరాకీలు వెదుక్కోవచ్చు. వాళ్లు పెట్టే పిండాకూడు కడుపునిండా తినొచ్చు.

" అసలు నువ్వెప్పుడన్నా అద్దం చూసుకున్నావా? పుచ్చుకాయలాంటి నీ మొహానికి కార్లు, ఏ.సి. రూములు దేనికిరా ఏబ్రాసి ముఖమా? ఎ.బి.సి.డి.లు రాని నీకు ఇద్దరు స్టెనోలా?" అంటూ హద్దు, పద్దులేకుండా చెలరేగిపోతున్నాడు మూర్తి.

సరిగ్గా ఆ క్షణంలోనే శర్మ మా ముందు ప్రత్యక్షమై- "ఎవర్ని మిత్రమా వాయించిపారేస్తున్నావు?" అనడిగేడు మూర్తిని.

మరి అవతలివైపు ఫోన్లో ఉన్నది...?? పాపం మూర్తికి గొంతులో పచ్చివెలక్కాయ పడినట్లనిపించింది. శర్మని కళ్లెదురుగా చూస్తూనే- దెయ్యం పట్టినవాడిలా, హైవోల్టేజి కరెంటు షాక్ కొట్టినవాడిలా అయిపోయాడు. అప్రయత్నంగా చేతిలోంచి రిసీవర్ జారిపోయింది.

పాపం, సంగతెల్తెలిని శర్మ దాన్నందుకుని- "ఎవరండీ మీరు? ఏంకావాలి?" అన్నాడు అత్యంత విధేయతతో.

అవతలినుండి పిడుగులు పడుతున్నట్లు, వందపులులు గాండ్రిస్తున్నట్లు విన్పించింది- "విష్ణుశర్మ ఐ.ఏ.ఎస్. స్పెషల్ సెక్రటరీ టు..." అంటూ! బయట దీపావళి తాలూకు బాణాసంచా... పేలటం మొదలైంది.

**– అవధానుల సుధాకరరావు**

## జూనియర్

**మా**కాలనీ క్రికెట్ టీమ్‌కి నగరంలో మంచి పేరుంది. నగరంలోని ఇతర టీమ్స్‌తోటేకాక పొరుగూళ్ల టీమ్స్‌తో కూడా మ్యాచెస్ ఆడి గెలుస్తూంటుంది మా టీమ్. ఆ టీమ్‌లో చేరాలని వువ్విళ్లూరుతూంటారంతా.

నేను ఆ టీమ్‌లో చేరి ఆర్నెల్లయింది. పేరున్న టీమ్‌లో మెంబరయినందుకు సంతోషంగా వున్నా ఒక్క విషయంమాత్రం తరచు బాధించేది నన్ను. అదేమిటంటే ఆ టీమ్‌లో







నేను జూనియర్ మెంబర్ని కావడంతో మిగతా టీమ్‌మేట్సు అంతా బిగ్‌బ్రదర్స్‌లా ప్రవర్తించసాగారు నాపట్ల. నా పలుకుల్ని వ్యూహాలను నిర్లక్ష్యంచెయడమేకాక నాచేత అడ్డమైన పనులూ చేయించుకునేవారు. ప్రతి చిన్న విషయానికీ నాపైన కసురుకుంటూండేవారు. ఆ టీమ్‌లో ఎందుకు చేరానా అనిపిస్తూండేది నాకు ఒక్కోసారి. కాని, పేరున్న ఆ టీమ్‌ని విడిచి మరో టీమ్‌లో చేరడానికి మనస్కరించేది కాదు.

ఇక ఆపుకోలేక దాచకుండా నా గోడంతా ఓ ఆప్తమిత్రుడివద్ద వెళ్లబోసుకున్నాను ఓ రోజున. అంతా ఆలకించి తేలికగా నవ్వేశాడు వాడు.

"మీ టీమేకాదు, ఏ సంస్థలోనయినా ఇది సర్వసామాన్యమేరా బాబూ! జూనియర్ మెంబరంటే సీనియర్లకి లోకువే. అసలు ప్రారంభంలో అందరూ ఆ స్థితిని అనుభవించినవాళ్లే. ఉదాహరణకు కాలేజ్ లైఫే తీసుకో. సీనియర్సు జూనియర్స్‌ని ఏడిపించడం కొత్తేమీ కాదుగా? కనుక నువ్వు అనవసరంగా దాన్ని కొండంతలు చేసుకుని బాధపడిపోకు" అన్నాడు.

ఆ విషయాన్ని వాడంత తేలికగా కొట్టిపారేయడం నచ్చలేదు నాకు. "అందుకు రెమెడీ ఏమీ లేదా?" అనడిగాను.

"ఎందుకు లేదూ? పెద్ద గీత, చిన్నగీతల సూత్రం తెలిసిందేగా" అన్నాడు. "అంటే?" అన్నాను అర్థంకాక.

"చెబుతాను విను... ఇలా చేశావంటే నీ సమస్య తీరిపోతుంది" అంటూ ఏం చేయాలో చెప్పాడు వాడు.

వాడి సలహాను అమలులో పెట్టేశాను వారం తిరక్కుండానే.

అంతే! ఇప్పుడు నా సమస్య పరిష్కారమయిపోయింది.

నేనిప్పుడు సీనియర్నయిపోయాను టీమ్‌లో!

అంతవరకూ నేను చేస్తూన్న అరవ చాకిరీ అంతా ఇప్పుడు నేను చేయనవసరంలేదు.

ఇంతవరకూ నేను అనుభవిస్తూ వస్తూన్న హ్యుమిలియేషన్ ఇప్పుడు నన్ను వదలిపోయింది.

చిన్నగీతగావుండే నేను ఓవర్‌నైట్ పెద్దగీతగా మారిపోయాను.

అన్నట్టు ఇంతకూ నేనేం చేశానో చెప్పనేలేదుకదూ?

మా టీమ్ కాప్టెన్‌తో చెప్పి నా మిత్రుడొకణ్ణి మా టీమ్‌లో మెంబర్‌గా అదనంగా చేర్పించాను... దట్సాల్!

– విశ్వమోహిని



చతుర ... 9



# 'జీవనపోరాటం'పై చతుర సమీక్షలు

సెప్టెంబర్ నెల 'చతుర'లో ప్రచురితమైన కాశీవిశ్వనాథ్ నవల 'జీవనపోరాటం'పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

## జీవఫలం - చేదువిషం

(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)

**కా**శీవిశ్వనాథ్ నవల 'జీవనపోరాటం' సునిశిత హాస్యాన్ని రంగరించుకుని, ''మధ్యతరగతి మందహాసాన్ని''(దాన్నే ముద్దుగా 'ఏడ్వలేక నవ్వడం' అనొచ్చు) చిందింపచేయటంలో విజయం సాధించింది. ఎన్నో అర్హతలు, తెలివితేటలు ఉన్నవాడికన్నా గోరంత అదృష్టం ఉన్నవాడు గొప్పవాడనే సత్యాన్ని నిజంచేస్తూ, ప్రమోషన్‌కోసం చిలకలదాసు చేసిన అవిశ్రాంత పోరాటం, అతడి దురదృష్టాన్నే ప్రతిబింబించింది. అతని వీగిపోని ఆత్మవిశ్వాసం, ఓటమినొప్పుకోని మనస్తత్వం, రేపు మనదనే ఆశాభావం అడుగడుగునా గోచరించింది. అతడు ప్రదర్శించిన 'లౌక్యం' అతడికే బెడిసికొట్టగా, చిలకలదాసు అందరి సానుభూతిని పొందగలిగేడు. ముఖ్యంగా సన్యసించి, తపస్సు చేసుకోవాలన్నా అడవులలో నేడు వీలవదన్న ఆధునిక సత్యాన్ని చక్కగా చెప్పారు రచయిత. ఏమీ అక్కర్లేదనుకుని ఏకాంతంగా బ్రతకడం కూడా దుర్లభమేనని మోదుపల్లి స్మగ్లింగు సంఘటన నిరూపించింది.

చిలకలదాసు అడుగడుగునా ప్రమోషన్ కోసం పడినపాట్లు, చేసిన పనులు, ఇరుక్కున్న ఇబ్బందులు హాస్యపు తెరవెనుక నిజజీవిత పోరాటానికి అద్దంపట్టాయి. వాస్తవంగా కూడా ఏ ప్రమోషన్ రాకుండానే రిటైరయిపోయే ఎందరో దాసుల సాధక, బాధకాలను, ఆఫీసు తతంగాన్ని యథాతథంగా కళ్లముందుంచారు రచయిత.

హాస్యపు మైపూతే గనుక లేకుంటే పరితలతల వేడెక్కి, ఒళ్లు మండిపోయేంత సీరియస్‌నెస్ ఉందీ రచనలో. మనిషి తన ప్రమేయం లేకుండా జరిగే సంఘటనలకి తనపరంగా భాష్యం చెప్పుకుని, తృప్తిపడే మనస్తత్వం తనకేకాదు, లోకుల్నీ ఒప్పిస్తుందనే విషయం స్వామీజీ, వరలక్ష్మిలద్వారా చెప్పించిన తీరు బాగుంది. ముఖ్యంగా ముగింపు అద్భుతంగా వుంది. వాస్తవానికి అద్దంపట్టి, ఆలోచనలను రేకెత్తించేదిగా ఉంది.

జీవితంతో అతి సామాన్య మానవుడి పోరాటం అత్యల్ప విషయాలకోసం అనవరతం సాగవలసిందేనని, 'జీవఫలం చేదు విషం' అయినా మ్రింగక తప్పదనీ, ఒకరి పోరాటం మరొకరికి విజయసోపానం కావడం పడుగు-పేకయేనని మరోవైపునుంచి కొత్తదారిలో, సరసంగా నరుక్కొచ్చిన రచయిత అభినందనీయులు.

—పి.యల్. చూడామణి,
హనుమకొండ.





## అమాయకుని ఆత్మకథ

*(ద్వితీయ బహుమతి రు: 75/- పొందిన సమీక్ష)*

హాస్యం కేవలం నవ్వుకోడానికిమాత్రమే కాదని గతంలో అనేక రచనలూ, చాప్లిన్ సినిమాలు నిరూపించాయి. హాస్యప్రధానమైన వ్యంగ్య రచనగా స్థూలంగా పైకి కనిపించే 'జీవనపోరాటం' అనేక విషయాల్ని చర్చిస్తూ, పాఠకుడిలో ఆలోచనలను రేకెత్తిస్తూ సమాజంలో ఓ వ్యక్తి జీవితంలో వివిధ సందర్భాలలో తలెత్తే వైరుధ్యాలలోని సూక్ష్మాంశాలపట్ల నిశితమైన అవగాహననిస్తుంది.

'మనీషి'లాంటి ఉపన్యాసాలతో, తాత్త్విక చర్చలతో సాగిన సీరియస్ నవల తరువాత కాశీవిశ్వనాథ్‌గారి జీవనపోరాటం చతుర పాఠకులకు మంచి రిలీఫ్‌నిచ్చింది. వ్యంగ్యంమాటున, హాస్యం చాటునా విషయం అప్రధానమైపోవడమనే లోపం లేకపోవడంవలన ఈ రచన తన ప్రయోజనానికి దూరంకాలేదని చెప్పవచ్చు.

చిలకలదాసుని అసమర్థుడిగానో, ఓ ఫూల్‌గానో, ఓ బఫూన్‌గానో కాక ఒక దురదృష్టవంతుడిగా, అమాయకుడిగా నిరూపించి అతనిపై సానుభూతిని కలిగించిందీ నవల. అదేసందర్భంలో - ఆత్మాభిమానం గురించి మాట్లాడే వ్యక్తీ, తన నిరంతర అభివృద్ధిని కాంక్షించే వ్యక్తీ స్వశక్తిమీద ఆధారపడటం మంచిదనీ సుబ్బయ్యనాయుడువంటి పబ్బంగడుపుకునే పెద్దమనుషుల సలహాలను తీసుకోవడం చేటు చేస్తుందనీ నిరూపించింది.

తనకుమాలిన ధర్మమూ, దర్పాలూ, అలవాటులేని అబద్ధాలూ ఒక మనిషి చేతకానితనాన్ని చాటుతాయేతప్ప ఎందుకూ కొరగావనీ ఈ నవల స్పష్టంచేసింది. తనకున్నంతలో ఇంటిని సంబాళించుకొంటేనూ, భార్యాపిల్లలతో సఖ్యంగా ఉంటేనూ దాసుకు ఇన్ని కష్టాలు వచ్చేవి కావు. నేలవిడిచి సాముచేసే 'దాసు'లకు తగిన గుణపాఠం చెబుతుందీ నవల.

రామాయణ, భారత, భగవద్గీతాది గ్రంథాలనుండి ధర్మసూక్ష్మాలను వివరించడంద్వారా మధ్యతరగతి పాఠకుల మనస్సులకు తాకేట్టు చెప్పగలిగారు ఈ నవలలో రచయిత. పిట్టకథలతోనూ, సహజ హాస్య సన్నివేశాలతోనూ సాగిన ఈ నవల పాఠకుడి భారాన్ని తగ్గించి, సునాయాసంగా చదూకునే వీలు కల్పించింది.

—సి. హెచ్. పద్మజ,
హైదరాబాదు.

## సినిమా హాస్యం

*(తృతీయ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

మధ్యతరగతి మానవుని కష్టసుఖాల్ని, సమస్యల్ని, బలహీనతల్ని సజీవంగా చిత్రిస్తూ, సునిశితమైన హాస్యాన్ని జోడించి, నవ్వులు పండించటానికి ప్రయత్నించిన కాశీవిశ్వనాథ్ ''జీవనపోరాటం'' నవల హాస్యాన్ని అందించినా, అస్తవ్యస్త సంఘటనలతో, అర్థంపర్థంలేని కాకాయిజం టెక్నిక్కులతో నిండివుంది. దాసు పడిన అవస్థలు చదివి నవ్వుకున్నా, అతనిపట్ల జాలిమాత్రం కలుగదు. దాసు తన ఉద్యోగపర్వంలో మేనేజరు కావాలన్న ఆశయంతో అడ్డమైన సలహాలు పాటించి, కాకా పట్టాలని లోపాయికారి లొసుగు పనులు చేసి అభాసుపాలవుతాడు. తన ఆశ నెరవేరక చివరికి సన్యాసం పుచ్చుకుంటే దాన్ని రచయిత ఒక ఆరాటంగా, పోరాటంగా అభివర్ణించటం సమంజసంగా లేదు.

ఉద్యోగుల ప్రమోషన్‌ల ప్రహసనం రచయిత హాస్యధోరణిలో బాగా వ్యక్తంచేశారు. ప్రస్తుత బ్యూరోక్రసీలో పాతుకుపోయిన కాకాయిజంలోని ఎలిమెంట్స్ అన్నింటినీ ఈ నవలలో హాస్యధోరణిలో జొప్పించడం జరిగింది. నిజానికి దాసు వాటిని సక్రమరీతిలో, లౌక్యంతో పాటించిఉన్నట్టయితే అతని జీవితాశయం నెరవేరి ఉండేదే. ఉచితసలహాకోసం సుబ్బనాయుడికి ప్రతిసారీ మందుకొట్టించి, కాకాయిజంలోని చీప్ పాయింట్స్‌ని తెల్సుకొని, వాటి అనుకరణలో ఘోరంగా దెబ్బతిన్న దాసు అవస్థ చూసి పాఠకులు నవ్వుకుంటారేతప్ప ఇదేదో గొప్ప సమస్యగా భావించరు. ప్రస్తుత సమా



జంలో బ్రతుకనేర్చినవాడికి కోటి విద్యలున్నాయి- తను అనుకున్నస్థాయికి చేరటానికి. దానులా భంగపడిన వ్యక్తులు తక్కువే. దాను అనుసరించిన కాకాయిజంలోని లొసుగు ప్రతి సంఘటన వెనుక పాఠకుడికి స్ఫురిస్తుంది. దాను ఇలా చేసిఉంటే బాగుండేది అని పాఠకుడికి అనిపించకుండా రచన సాగిఉంటే బాగుండేది.

నవల చక్కని హాస్యాన్ని అందించినా, అది ఫక్తు సినిమా ఫక్కీలో ఉంది.

—సి.జనార్ధన,
ఖమ్మం.

## నవ్వుల పారాయణం

*(రూ. 25/- బహుమతిపొందిన సమీక్ష)*

రచయిత తన సహజ హాస్యధోరణిలో ప్రమోషన్ కోసం ఉద్యోగులు పడేపాట్లను చక్కగా చిత్రీకరించారు 'జీవనపోరాటం'లో.

ప్రమోషన్ పోరాటంలో చిలకలదానుకు తగిలినన్ని ఎదురుదెబ్బలు, కలిగిన చేదు అనుభవాలు బహుశా మరెవరికీ కలగవేమో! ప్రమోషన్ పొందడానికి చిలకలదాను ఎన్ని రకాలుగానో ప్రయత్నించడం, ప్రతీదీ తిరగబడడం పాఠకులకు సానుభూతితో కూడిన నవ్వు తెప్పిస్తుంది. ఇదిచాలదన్నట్లు అతనిని ఇంటి వద్దకూడా భార్య, పిల్లలు లక్ష్యపెట్టక పోవడం, అండగా నిలువకపోవడం జరిగింది. ఎన్నికల్లో తనకు తెలీకుండానే తన భార్య కూడా పోటీచేస్తోందని తెలిసి షాకయినా ఇచ్చిన మాటకు కట్టుబడి జి.యమ్. భార్య తరపున ప్రచారం చేశాడు. తీరా ఆమె ఓడిపోవడంతో అతనికి దురదృష్టం మరింత ఎక్కువయింది. జి.యం. అందుకతన్ని ఘోరంగా నిందించడం, సూపర్నెంట్ స్థాయినుండి గుమస్తాగా మార్చడంతో చిలుకలదాను నష్టజాతకం తేటతెల్లమయింది. కనీసం అడవుల్లో ప్రశాంతంగా తపస్సు చేసుకుందామనుకున్నా కుదరక అతని మీద కలప దొంగతనం మోపారు. జి.యమ్. దయతల్చి ప్రమోషన్ ఇద్దామనుకునేసరికి అసలు సర్వీసే లేకుండా పోవడం విషాదకరంగా అనిపిస్తుంది.

సుబ్బయ్యనాయుడు పాత్రను చమత్కారంగా చిత్రించడంలో రచయిత ప్రత్యేక శ్రద్ధ వహించారు. భగవద్గీత, రామాయణ, భారతాలనుండి నేటి రాజకీయాలదాకా పిట్టకథలు, నీతులు, సూక్తులను సందర్భోచితంగా పలికిస్తూ ప్రస్తుత జీవన విధానాలకు అన్వయించటం బాగా అన్పిస్తుంది. కాకాయిజం గురించి చెప్పిన ఫ్లాష్‌బ్యాక్ నవ్వు కలిగిస్తుంది. ప్రమోషన్ కోసం చేసిన గీతోపదేశం చిట్కాలు, అమోఘం! చిలకలదాను కొడుకు పవన్‌కుమార్‌కు ఉన్న సినీ హీరో కావాలనే పిచ్చి, కుమార్తె రత్నం నవలలు, సినిమాల ప్రభావంతో భర్తను గురించి గాలిలో మేడలు కట్టుకోవడం, వారిని అదుపులో పెట్టాల్సింది పోయి వారి గొంతెమ్మ కోర్కెలకు ఆజ్యంపోసే తల్లి నగటు మధ్యతరగతి జీవితాల ప్రతినిధులుగా ప్రతిబింబిస్తారు. వారి కోర్కెల భంగపాటు పాఠకులకు ఓ హెచ్చరిక అవుతుంది.

కథ ఆద్యంతం నవ్వు కలిగించే సన్నివేశాలతోనూ మాటల చమత్కారంతోనూ నడిచింది. కథనాన్ని ఆసక్తికరంగామలచిన రచయితకు అభినందనలు!

—బి.రమేష్,
గోదావరిఖని.

## పాపం! దాను

*(రూ. 25/- బహుమతిపొందిన సమీక్ష)*

సగటు ఉద్యోగి ప్రమోషన్ పోరాటానికి సజీవ దర్పణం కాశీవిశ్వనాథ్‌గారి 'జీవనపోరాటం' నవల. ప్రతి మనిషి పైకి రావాలని, ఉన్నత స్థానానికి చేరుకోవాలని ఉన్నట్టే మన కథానాయకుడు శ్రీ ఎలకలపూడి చిలకలదానుగారు కూడా కోరుకోవడంలో తప్పులేదు. దానికై ఆరాట పడటంలోనూ తప్పులేదు. అయితే ఆ ఆరాటం ఏ నాయుడు సలహానో తీసుకుని దెబ్బతినిపోవటం మాత్రం 'అయ్యో' అనిపింప జేస్తుంది. నాయుడులాంటివారు ఈ సమాజంలో ప్రతిచోటా ఎదురౌతారు. వాళ్ల కత్తికి





రెండు వైపులా పదునుంటుంది. వాళ్లు ఇచ్చిన సలహా పనిచేస్తే వారి గొప్ప! పనిచేయకపోతే అది ఎదుటివారి అసమర్థతే! అలాంటివారు తమ వాక్చాతుర్యంతో ఎదుటివారిని సునాయాసంగా బుట్టలో వేసుకొంటారు. ఈ పాత్ర చిత్రీకరణ మెచ్చుకోతగ్గది.

కాకాయిజం అన్నిచోట్లా పనికిరాదనీ, తన సిన్సియారిటీతోనే అధికార్లను మెప్పించాలి తప్ప, అడ్డదార్లు తొక్కితే ఫలితం ఉండదనీ రచయిత సున్నితమైన హాస్యాన్ని మేళవించి చెప్పారు. అరువు తెలివితేటలు ఒడ్డుకు చేర్చలేవని వార్నింగ్ ఇచ్చారు. దానుగారి సుతిమెత్తని మనస్తత్వం మొదటి నుండీ చివరివరకు నిండుగా తీసుకొచ్చారు. పాత్ర చిత్రీకరణలో రచయిత శ్రద్ధ, శైలి మెచ్చుకోతగ్గవి. సామాన్య పాఠకుడు కూడా అర్థం చేసుకొని, ఆనందించే విధంగా నాటకీయతతో నవలను నడిపించారు.

ముగింపు బాగుందిగానీ తను రిటైరయ్యే రోజు ఆ రోజేనని దానుగారు మర్చిపోవడం కొంత విడ్డూరంగానేవుంది. చివర్లో వైరాగ్యం, తపస్సు, కోర్టు, తీర్పు ఈ హడావిడిలో రిటైర్మెంటు తేదీ మర్చిపోయి వుంటాడని అనుకున్నా ఇది నమ్మలేనిదిగానే అనిపించింది.

ఒక చక్కని నవలను పాఠకులకు అందించిన, రచయితకు, సంపాదకులకు ధన్యవాదాలు!

—చక్రిసంధ్యారాణి,
హైదరాబాదు.

## ఇలాగే నవ్వించాలి

*(రూ. 25/- బహుమతిపొందిన సమీక్ష)*

**హా**స్యరస ఆస్వాదనతో మానసికమైన ఆనందాన్ని అనుభవించే మనిషి ఆరోగ్యంగా ఉంటాడనేది వాస్తవం. ఆనందాన్నిచ్చే టానిక్ హాస్యం. ఎదుటివారిని నవ్వించే విధంగా మాట్లాడ్డం, రచనలుచేయడం చాలా కష్టమైన కళ. అది ఏ కొద్దిమందికో చేతనవును. కాశీవిశ్వనాథ్ కలంనుండి వచ్చిన 'జీవనపోరాటం' చదువుతుంటే ఎలకలపూడి చిలకలదాను మీద జాలికలిగి, అయ్యోపాపం అనిపిస్తూనే ఎంతో నవ్వుకలుగుతుంది. మనుష్యుల్లోని లోపాలను, బలహీనతలను వ్యంగ్యంగా తెలియజెప్పే ఈ నవల చదువుతుంటే ఎంతో హాయిగా ఉంది. ఎలకలపూడి చిలకలదానుకు ప్రమోషన్ రావడమే జీవితధ్యేయం. దానికై అతడు సాగించిన తొలిపోరాటంలో అతని ప్రత్యర్థి రంగారావుదే పైచేయి. ఆ తరువాత సాగించిన ప్రతి పోరాటంలోను దాను విఫలం కావడం, పైగా యం.డి.గార్కి కోపం పెరగడం, దాను అవమానం పొందడం జరుగుతుంది. బామ్మర్ది సుబ్బారాయుడు సలహాలు కూడా పనిచేయక పోవడం, దాను ఓడిపోవడం అతని దురదృష్టం. భారతంలో కర్ణుడిలాగా దాను విజయం సాధించలేకపోవడంవల్ల చివరి యత్నంగా ఎం.డి. భార్యకు ఎలక్షన్లో సపోర్టుచేద్దామనుకుంటే, తన భార్యే ప్రత్యర్థిగావడం, పైగా గెలవడం, దాను ద్రోహిగా నిలబడ్డం జరుగుతుంది. ఆఖర్న ప్రమోషన్ ఇద్దామనుకునేసరికి అతను రిటైర్ కావడం జరిగిపోయింది.

ఈ నేపథ్యంతోనే వరదరాజులు ప్రవృత్తి, పవన్‌కుమార్- సినీవ్యామోహం, రత్నకుమార్ ప్రేమ, చిట్టితల్లి రాజకీయకాపట్యం, ఎలక్షన్ల హడావుడి చక్కగా వర్ణించారు. నవలతీస్తే పూర్తయ్యేవరకు వదలిపెట్టబుద్ధికాదు.

'నేను కృష్ణుణ్ణి, మేడంగారు అర్జునుడు. మాయావిడ హనుమంతు. మా బామ్మర్ది సుగ్రీవుడు' వంటి సంభాషణలు చాలా బావున్నాయి. పౌరాణిక సంఘటనలను సునిశితమైన హాస్యం మేళవించి చెప్పించడం చాలా బావుంది. ప్రమోషన్‌కోసం ఆరాటపడి, జీవన పోరాటం సాగించిన దాను చివరకు సర్వసంగ పరిత్యాగి కావడం, ఐనా అతడు కటకటాలు పాలుగావడం నవ్వు పుట్టిస్తుంది. నాటక రచయితగా, కథా రచయితగా, మంచినవలా రచయితగా పేరున్న కాశీవిశ్వనాథ్ గారు తన కలాన్నిలాగే హాస్యరసంలో ముంచి పాఠకుల్ని నవ్విస్తుండాలని కోరుతూ చతురనీ వారినీ అభినందిస్తున్నాను.

—బి.రాంబాబు,
రంపచోడవరం.

# చతుర

సంపుటి : 14 సంచిక : 10 నవంబర్ 1991

త్యాగానికీ, అనురాగానికీ ప్రతీక అయిన స్త్రీ తల్లిగా, సోదరిగా, ఇల్లాలిగా, కూతురుగా మమతలు పంచుతూ గృహాంగణాన్ని పూదోటగా మారుస్తుంది. ఇంటా బయటా సమర్థవంతంగా తన కర్తవ్యాన్ని నిర్వహిస్తుంది. ఒకరకంగా పురుషుని జీవన హర్మ్యానికి నిర్మాత స్త్రీ మూర్తి. మరి అనాదిగా సమాజం స్త్రీకి ఎలాంటి ప్రతిఫలాన్నిస్తోంది? ఒకప్పుడు కన్యాశుల్కాలు, బాల్యవివాహాలు, సతీసహగమనాలు. ఇప్పుడు వరకట్నాలు, వధూదహనాలు! అత్యాచారాలు, అవమానాలు!! ఒకప్పుడు భర్తమీది అవ్యాజమైన ప్రేమతో, అతడులేని జీవనం నిరర్థకమని భావించిన కొందరు రాజపుత్ర స్త్రీలు శత్రువుకు ప్రాణాలతో చిక్కి అవమానాల పాలవగూడదని సహగమనం చేసేవారు. కాలగమనంలో స్వార్థపరులు ఆ సంగతి చెప్పి కేవలం ఆస్తులకోసం, ఆదాయాల కోసం "సతి" ఆచారాన్ని బలవంతంగా అమలు చేయిస్తూ, అతివల్ని మంటల్లోకి నెట్టడంతో అదొక దురాచారంగా మారింది.

వేదనా సంద్రాన్ని తనలోనే దిగమింగుకొని, ధైర్యంగా నిలదొక్కుకొని బ్రతుక్కో అర్థం కల్పించుకుందామె!! కానీ ఏనాడో ఆరిపోయాయనుకున్న 'సతిమంటలు' భగ్గుమనేసరికి నివ్వెరపోయింది. ఆ జ్వాలలకి కారకులెవరో పసిగట్టి లోకానికి చాటాలన్న ప్రయత్నంలో ఆమెకు ఎలాంటి అనుభవాలు ఎదురయ్యాయి? అయినవాళ్లనుండి ఆమెకు అందిన నిరసనలూ, ప్రోత్సాహాలు ఎటువంటివి?

వనితా హృదయానికి అపూర్వంగా దర్పణం పట్టి, కన్నీళ్లకు అక్షరరూపం కల్పించి, ఉద్వేగభరితంగా, చారిత్రక సత్యంగా హృదయానికి హత్తుకునేలా, మలచిన **సింహప్రసాద్** రచన **'సతిమంటలు'**

ఈ నెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్ర నవల.

# సతిమంటలు

## సింహప్రసాద్

'యత్రనార్యస్తు పూజ్యంతే
రమంతే తత్ర దేవతా!'

ఎక్కడైతే స్త్రీలు పూజింపబడుదురో అక్కడ దేవతలు నివసిస్తారన్నారు పూజ్యులు, అనుభవజ్ఞులైన పెద్దలు.

స్త్రీ!

ఎంత మహత్తరశబ్దం.!

ఎంత మహిమాన్వితరూపం.!

ఎంత అద్భుత ప్రేమమూర్తి.!

స్మరిస్తే చాలు తనువు పులకరిస్తుంది. ఆమె విశ్వరూపాన్ని పరికిస్తే చాలు మనసు ప్రక్షాళితమైపోతుంది. రకరకాల రూపాల్లో దర్శనమిస్తుంది. తల్లిగా, చెల్లిగా, భార్యగా, బిడ్డగా, స్నేహమయిగా, రాగవల్లిగా ప్రత్యక్షమై సృష్టిచక్రగమనానికి తనే కారణమని చెప్పక చెబుతుంది.

స్త్రీ ప్రకృతి మరో రూపం. సర్వజీవరాశి సృష్టి స్థితి లయలకి కారణమైన ప్రకృతి లాంటిది స్త్రీ.

స్త్రీ ఒక శక్తి. అనంతమైన శక్తికీ, యుక్తికీ మూలాధారం ఆమె. పురుషుడు ప్రపంచాన్ని నడిపితే స్త్రీ జీవితాన్ని నడుపుతుంది.

స్త్రీ ఒక కాళి. దుష్టుల పాలిట, అధర్మం పాలిట ఆమె శస్త్రధారిణియైన ఉగ్రకాళి.

స్త్రీ ఒక మాతృక. ప్రాణోత్పత్తికీ ప్రేమతత్వానికీ కేంద్ర బిందువామె.

స్త్రీ అర్ధనారీశ్వరి. స్త్రీ పురుషులిద్దరూ సమానమన్నివారి సమైక్యతే జగతికి శ్రీరామరక్షయని చాటిచెప్పే మహత్తరరూపం.

అలాంటి దివ్య మంగళమూర్తిని ప్రేమించటం, పూజించటం మన ధర్మం. మన బాధ్యత...

'ఇరవై ఒకటవ శతాబ్దిలో మహిళ' అనే అంశం గురించిన గోష్ఠి కార్యక్రమంలో ముఖ్య అతిథిగారి మహోపన్యాసం విరామరహితంగా సాగిపోతోంది.

తరచు సభలోని జనం,వారిలో అత్యధికులు పురుషులే,హర్షధ్వానాలు చేస్తున్నారు. చప్పట్లు చరుస్తున్నారు.





పెన్నూ పుస్తకం తెరచి పట్టుక్కూర్చుందన్నమాటేగాని ఒక్క ముక్కా రాయలేదు దివ్య.

ఆమె 'శుభోదయం' పత్రిక విలేఖరి.

రావటమైతే కార్యక్రమాన్ని కవర్‌చెయ్యడానికే వచ్చింది. గానీ వక్తల ఉపన్యాసాల్లో, శ్రోతల ప్రతిస్పందన చూస్తోంటే ఆమెకేమిటోగా వుంది.

ఏదో నాటకం చూస్తూన్నట్టుంది. పాత్రధారులంతా తమతమ పాత్రల్ని అవధులమేరకు పోషించాలని నిర్ణయించుకుని పోటీపడుతున్నట్టుంది. ఎంతో లోపభూయిష్టంగా జీవపదార్థం లోపించినట్లుగా వుంది. మరెంతో అసహనంగా కూడా వుంది.

స్టేజి ఎక్కి "మీరంతా స్త్రీలని నిజంగా గౌరవిస్తున్నారా?" అని ప్రశ్నిస్తే ముక్తకంఠంతో అవునంటూ జవాబిస్తారంతా.

వాళ్ళ చొక్కా కాలరు పట్టుకుని "నీ భార్యని ఎలా చూస్తున్నావు? నీ సహ ప్రయాణీకురాల్నెలా గౌరవిస్తున్నావు?" అని గద్దించి అడిగితే నీళ్ళు నములుతారు సందేహం లేదు. గుడ్లు మిటకరిస్తూ దిక్కులు చూస్తారు. లేదా వెర్రి నవ్వు నవ్వుతారు!

హిపోక్రసీ!

అంతటా అందర్లోనూ హిపోక్రసీ. చెప్పేదొకటి చేసేదొకటి. మెడలో రుద్రాక్షలు మదిలో మదిరాక్షులు!

ఓ పక్క సీతమ్మనీ, కాళికనీ, కనకదుర్గనీ పూజిస్తున్నాం. మరో పక్క మహిళలకి అగ్నిపరీక్షలూ, కన్యాత్వ పరీక్షలూ పెడుతున్నాం. లెక్కలేనన్ని ఆంక్షలు విధిస్తున్నాం. అడుగడుగునా చిత్రవధ చేస్తున్నాం.

ఎన్నాళ్ళిలా బాధా సర్పద్రష్టులై దారుణ శాపగ్రస్తులై, పడి వుండటం?

ఎప్పుడు మహిళలకి విముక్తి.

ఆడది అర్ధరాత్రి నిర్భయంగా నడిచివెళ్ళగలిగినప్పుడే మనకి నిజమైన స్వాతంత్ర్యం లభించినట్లని ఘోషించిన మహాత్ముడి కల నిజమయ్యేదెప్పుడు?

మహిళా జగతికి నిజంగానే ఈ మంచి కాలం వస్తుందా?

జడలు విప్పిన, నుడులు రెచ్చిన కదలి

నృత్యం శమిస్తుందా? నడుమ తడబడి కడలి మునుగక పడవ తీరం క్రమిస్తుందా?

దివ్య తల ఆలోచనలతో వేడెక్కి పగిలిపో తోంది.

అక్కడి ఆ కృత్రిమ వాతావరణంలో వూపిరాడనట్లనిపించి లేచింది దివ్య.

"వెళ్ళిపోతున్నారా" ఇంకో విలేఖరి అడిగా డు.

"వూ"

"ఏం? స్పీచెస్‌లో సరుకుంది కదా"

"అందుకనే వెళ్ళిపోతున్నాను"

"అదేమిటి?"

"అదంతే"

"చీఫ్‌గెస్ట్ చాలా పలుకుబడిగలవాడు. అతడి స్పీచ్ కవర్ చెయ్యకపోతే మీ ఎడిటర్ ఏమీ అనడూ?"

"అది కవర్ చెయ్యడానికి అతడి ఉప న్యాసం వినక్కర్లేదు. ఏ పాఠ్యపుస్తకం తిరిగే సినా చాలు"

ఆమె రెండడుగులేసిందో లేదో ఒక కార్యక ర్త హడావిడిగా ఆమెని సమీపించాడు.

"మీరు దివ్యగారేనా?"

తలాడించింది.

"మీకు ఫోన్ వచ్చింది"

"ఎక్కడ్నుంచి?"

"పోలీస్‌స్టేషన్నుంచి"

టౌన్‌హాలుకి చెందిన ఆఫీసురూమ్‌లోకెళ్ళి రిసీవర్ అందుకుంది.

"హలో..."

"నేను దివ్యా!ఇన్స్‌పెక్టర్ చైతన్యని..."

"ఎనీ న్యూస్?"

"యస్... చాలా ఘోరం జరిగిపోయింది. ఆన్‌స్పాట్ స్టడీకి నువ్వొస్తే మంచిదని, మీ పత్రికాఫీసుకు ఫోన్‌చేస్తే నువ్వు గోష్టికి వెళ్ళిన ట్టు తెలిసింది"

"అద్సరేగాని అసలేం జరిగింది చైతన్యా? విక్టిమ్ ఎవరు? మహిళేనా?"

"నీ వూహ కరక్టే. మహిళకాదు మహిళలని నాకింతక్రితమే తెలిసింది. ఇప్పుడక్కడికే వెళ్తున్నాను. శ్రీరామ్‌పేటలోని రామాలయం దగ్గరకిరా..."

నీరసంగా రిసీవర్ పెట్టేసింది.

గజానికో గాంధారికొడుకూ, వీధికో రావణాసు రుడు వున్న ఈ దేశంలో అబలకి రక్షణ ఎక్కడుంది?

రాజ్యాంగచట్టపు బొంతు పుస్తకాల్లో!

గబగబా బయటికి నడుస్తోంటే ఆమె అన్న య్య రామారావు ఎదురయ్యాడు.

"నువ్వా అన్నయ్యా... వుపన్యాసాలు వినడా నికే వచ్చావా?" విస్తుబోతూ అడిగింది.

"ఏం? రాకూడదా? వినకూడదా?"

"వినొచ్చు... కాని ఈ చెవితో విని ఆ చెవితో వదిలెయ్యకూడదు"

"చాల్లే చెప్పొచ్చావ్. చిన్నంతరంపెద్దంతరం లేకుండా..."

"వయస్సుకి కాదు మేధస్సుకి విలువిచ్చే కాలం ఇది"

"నీతో నాకు వాదనెందుగ్గాని హడావిడిగా వెళ్తున్నావెక్కడికి?"

"ఇప్పుడే చైతన్య ఫోన్ చేశాడు. శ్రీరామ్‌పేట వెళ్తున్నాను"

చైతన్యపేరు చెవిన బడేసరికి అతడి దవడ కండరం బిగుసుకుంది.

"అయితే లోకులమాట నిజమేనన్నమాట"

"లోకులు కాకులన్నారు"

"నీలాటివాళ్ళు అలాగే అంటారు మరి. కళ్ళు మూసుకుని పాలు తాగుతూ తననెవరూ చూట్టంలేదనుకుంటుందిట పిల్లి. అలా వుంది నీవరస. అతడ్తో తిరుగుళ్ళు మానకపోతే సహించేది లేదు ఏమనుకుంటున్నావో"

"వృత్తిధర్మంగా..."

"వృత్తిధర్మమో శరీరధర్మమో నాకు తెలు ను"

ఆమె ముఖం ఎర్రబడింది. "ఛీ... అస హ్యంగా మాట్లాడకు. నాతోడబుట్టినవాడివి. అలా మాట్లాట్టానికి సిగ్గెయ్యటంలేదూ?"

"సిగ్గుతో చావాల్సింది నువ్వు. ఇదిగో దివ్యా! ఇంట్లోంచి పోయానుకదాని విర్రవీగుతున్నావ్

కాబోలు. నీకే చెప్పేది జాగ్రత్తగా గుర్తుపెట్టుకో. నువ్వెక్కడ ఎలా చచ్చినా మాకనవసరం. కానీ మా పరువు మర్యాదలకి, మా వంశ గౌరవాలకి మచ్చ వచ్చేలా ప్రవర్తించావా సహించేది లేదు. ఏం చేస్తానో చెప్పను. చేసి చూపిస్తాను- జాగ్రత్త''

విసురుగా టౌన్‌హాల్లోకి నడిచాడు రామారావు.

దివ్య మనస్సంతా జుగుప్సతో నిండిపోయింది!

ఆమె శ్రీరామ్‌నగర్‌లోని వెంకటరత్నంగారింటికెళ్ళేసరికి ఆ ప్రాంతమంతా జనంతో నిండిపోయివుంది.

జనాన్ని త్రోసుకుని లోపలికెళ్ళిన దివ్య మ్రాన్పడిపోయింది.

ముక్కుపచ్చలారని ముగ్గురమ్మాయిలశవాలు దూలానికి వేలాడుతున్నాయి!

కెవ్వుమని అరవబోయి నిగ్రహించుకుంది. కళ్ళల్లో కన్నీటి కుండలు భళ్ళున బద్దలయ్యాయి.

ఏమయ్యిందీ చిన్నారులకు?

ఎవరీ ఘాతుకానికి కారకులు?

బేలగా చైతన్యవంక చూసిందామె.

అతడూ పోలీసులూ శవాల్ని కిందికి దింపుతూ బిజీగా వున్నారు.

గబగబా రెండు ఫోటోలు తీసింది.

ఆడపిల్లల తండ్రికోసం చుట్టూ కలయజూసింది. వెంకటరత్నంగారూ ఆయన భార్యా ఓ మూలన సర్వం కోల్పోయినవారిలా కూలబడి గుండెలు పగిలేలా రోదిస్తున్నారు!

వారిని సమీపించింది. అతికష్టంమీద నోరు పెగల్చుకుని అడిగింది ''ఇంత ఘోరం ఎలా జరిగింది''!

వారి దుఃఖం రెట్టింపయ్యింది తప్ప జవాబు రాలేదు.

''నిన్నటిదాకా బాగానే వున్నారుమరి. రాత్రికి రాత్రి ఏమయ్యిందో''

''పాపం ఆణిముత్యాల్లాంటి పిల్లలు. ఎప్పుడెక్కడికెళ్ళినా తల దించుకునే వెళ్ళేవారు''

''అవునొదినా... ఆమధ్య ఆకతాయి కుర్రాళ్ళు వెంటబడి గేలచేస్తే ఏడుస్తూ తలొంచుకు నొచ్చేశారుతప్ప ఎదురుతిరిగి పల్లెత్తుమాటన్లేదుట- మా అమ్మాయి చెప్పింది''

''రాత్రేమైనా సినిమాకి వెళ్ళేరంటారా?''

''సినిమాలూ, షికార్లూ అంటూ ఎగరేసుకు తిరిగేరకం కాదమ్మా ఏమాటకామాటే చెప్పుకోవాలి''

''పెద్దమ్మాయిని చూట్టానికి మొన్నెవరో పెళ్ళివారొచ్చారుకూడానూ. ఇంతలో ఏమయ్యిందో ఏమో. పెళ్ళి బాజాలు మోగాల్సిన ఇంట్లో చావు బాజా మోగుతోంది. అంతా కలికాలమహిమమ్మా. బ్రహ్మంగారు చెప్పనేచెప్పేరు!''

''ఇంతకీ ముగ్గురూ ఒకేసారి వురిబోసుకుని ఎందుకు చనిపోయారంటారు?'' ఎవరో ఆగంతకుడడిగాడు.

''అది తెలిస్తే బాగానేవుండు. ముసలాళ్ళమో ఏడుస్తూ కూర్చున్నారాయె!''

''ఎవరైనా ఏమైనా అఘాయిత్యం చేశారంటారా?''

''ఏమోనమ్మా... నిజమేవిటో ఆ ఏడు కొండల వెంకన్నకే తెలియాలి!''

రకరకాల వ్యాఖ్యానాలకి మతిపోతోంటే చైతన్యని సమీపించింది దివ్య.

ఇంతలో ''సార్ పెద్దమ్మాయి పైటకొంగునే దో ముడివుంది'' అరిచాడు కానిస్టేబులు.

''ఏమైనా రాసిపెట్టారేమో. జాగ్రత్తగా తీసిచూడు''

మరికొన్ని నిమిషాలకి సస్పెన్స్ విడిపోయింది.

ఉత్తరంలోని వివరాలు విని మ్రాన్పడిపోయారంతా. ఒక్కరి మొఖంలోనూ కత్తివేటుకి నెత్తురు చుక్కలేదు.

''ఇలాటి కారణాలు కూడా ఆత్మహత్యకి పురిగొల్పుతాయా?'' అని కొందరాశ్చర్యబోతే, ''వాళ్ళెంత క్షోభననుభవించి ఈ దారి తొక్కారో'' అని జాలిపడ్డారింకొందరు.

వణకుతోన్న చేతుల్తో లెటర్ పట్టుకుని సజలనేత్రాలతో చదివింది దివ్య-



"అందరికీ నమస్కారాలు.

మేం ముగ్గురం అక్కచెల్లెళ్ళం. శాంతమ్మా వెంకటరత్నంల ముద్దు బిడ్డలం. మధ్య తరగతి అభాగ్యులం. ఎగరలేక, సాగిలబడలేక త్రిశంకు స్వర్గం- వంటి నగరంలో వూగిసలాడుతోన్న అభాగినులం. మమ్మల్ని మా మరణాల్నీ చూసి కంటతడిపెట్టకండి. కన్నీళ్ళు అసహాయతకి చిహ్నం. అంతే తప్ప కన్నీటికి పిసరంత విలువ కూడా లేదు. కన్నీటికీ అర్థింపుకీ వేడుకోలుకీ అర్థం విలువావుండి వుంటె మేమీ రోజున ఈ ఉత్తరం రాయాల్సి వచ్చేది కాదు. మేం వురికి పాల్పడవలసి వచ్చేదీకాదు.

అందరి ఆడపిల్లల తల్లిదండ్రుల్లానే మా తల్లిదండ్రులూ మాకోసం, మా పెళ్ళిళ్ళకోసం ఎంతో తపించారు. ఎంతో ఆవేదనతో అన్వేషించారు, మరెంతో మథనతో కుళ్ళిపోయారు.

కాని ఒక్కఅల్లుడ్ని కూడా కొనలేకపోయారు!

పెళ్ళి కొడుకుల విపణిలో దారుణంగా ఓడిపోయారు. రూపాయి ముందు మంచీ, మానవత్వం విలువ- రూపులేకుండా పోయిందని గ్రహించివిలవిల్లాడారుతల వంచుకుని చతికిలబడిపోయారు. కుంపటుల్లాంటి మమ్మల్ని గుండెలమీంచి దించుకోలేక బరువెక్కిన గుండెల్లో కృంగి కృశిస్తున్నారు!

వారి మూగ వేదనని వారి ఆర్థిక అసహాయతని, వారిదైన్యాన్నీ ఆక్రోశాన్నీ చూడలేక కుళ్ళి కుళ్ళి ఏడ్చాం. కుళ్ళిపోయిన ఈ సమాజపు కట్నాల దాహాన్నీ లాంఛనాల లాలసనీ చూసి కోపంతో అసహ్యంతో విలవిల్లాడాం. ఏ దేవుడో కరుణించక పోతాడా అనుకున్నాంగాని ఆ దేవుడూ మగవాడేనన్న వచ్చి నిజంతెలిసి ఈ బలిదానానికి సిద్ధపడ్డాం. కన్నవారికోసం ఆత్మాహుతికి తలపడ్డాం.

మమ్మల్ని క్షమించకండి. మమ్మల్ని క్షమించి తద్వారా మీరు క్షమ పొందకండి. మీరూ, మీలాంటివారూ కలిసి సృష్టించి పెంచి పోషిస్తోన్న వరకట్నపు విషనాగుల్ని తుదముట్టించే వరకూ మీకూ, మాలాంటి వారికీ, మమ్మల్ని కన్నవారికీ కూడానిష్కృతిలేదు.

అందుకే వురికొయ్యనుంచి హెచ్చరిస్తున్నాం.

వరకట్న దురాచారాన్ని సమూలంగా మట్టుబెట్టండి. సభ్యసమాజంలో దానికి సూదిమొనంత స్థానం కూడా లేకుండా తుడిచెయ్యండి. మంగళప్రదమైన కళ్యాణానికి పునాది డబ్బు మాత్రమే కాదని చాటిచెప్పండి.

లేదా-

ప్రతిఇంటా ఇలాగే కప్పుకు వేలాడుతూంటాయి ఆడపిల్లల శవాలు!

ఇట్లు

రజని, బాల, సరోజ"

నిన్నగాక మొన్న కాన్పూర్‌కి చెందిన ముగ్గురక్కచెల్లెళ్ళు ఇదే కారణంవల్ల ఇలాగే వురిబోసుకున్నారు!

ఇవాళ ఈ ముగ్గురూ...!

ఈ నారీ మేధానికి అంతం వుందా? వుంటే ఎప్పుడు? ఎప్పుడు?? లేకపోతే ఎన్నాళ్ళిలా? ఎన్నాళ్ళు? ఎన్నేళ్ళు??

దివ్య మెదళ్ళో విస్ఫోటకాలు బద్దలవుతున్నాయి!

★ ★ ★

ఇంట్లో అడుగుపెడుతూనే మంచంమీద కూలబడి బావురుమంది దివ్య. వుప్పెనలా చుట్టుముట్టేసింది దుఃఖం .

గుండెలోతుల్లో దాగివున్న కన్నీరంతా ఒక్కసారే పెల్లుబికి రాసాగింది. యుగాల్నుంచీ ఆర్తది అణచిపెట్టుకున్న దుఃఖమంతా గోడల్ని ఛేదించుకుని బయటికురికింది.

అడుగడుగునా ఆడదానిమీద జరుగుతోన్న అకృత్యాలని తలచి తలచి హోరున, భోరున ఏడ్వసాగింది.

అలా ఎంతసేపు ఏడ్చిందో ఆమెకే తెలీదు.

ఎప్పటికో తేరుకుంది. పూర్తిగా తేరుకోకుండానే హఠాత్తుగా ఏదో గుర్తురాగా గోడవైపు చూసింది.

గోడకి అంటించి వున్న తెల్లకాగితంమీది ఎర్ర అక్షరాలమీద పడిందామె దృష్టి.

లైఫ్ ఈజ్ ఎ ఛాలెంజ్- మీటిట్!

లైఫ్ ఈజ్ ఎ స్ట్రగుల్- యాక్సెప్ట్ ఇట్!




లైఫ్ ఈజ్ ఎ లవ్- ఎంజాయ్ ఇట్!

లైఫ్ ఈజ్ ఎ ట్రాజెడీ- ఫేస్ ఇట్!

జీవితసత్యం బోధపడినట్లుగా అన్పించింది. కళ్ళు తుడుచుకుంది. ఆమె నరనరంలోని బలమంతా పిడికిలిలోకి వేగంగా ప్రవహించసాగింది.

సుమారు రెండేళ్ళక్రితం తను దుఃఖపు సుడిగుండంలో చిక్కుకుని ఒంటరిగా హాహాకారాలు చేస్తోంటే చేయూతనిచ్చి ఒడ్డు చేర్చాడు చిన్ననాటి నేస్తం చైతన్య.

జీవితానికి కామాలేగాని, ఫుల్‌స్టాపు లేదని చెప్పి కొత్తజీవిత దృక్పథం బోధపరిచి ఈనాటి తన ఈ స్థితికి కారకుడయ్యాడు.

అప్పట్లో అతడు లైఫ్ గురించి ఆ నాలుగు లైన్లు రాసి గోడకి అంటించి రోజూ రాత్రి పడుకునేముందూ, ఉదయం నిద్రలేచిన వెంటనే మననం చేసుకోమన్న తారకమంత్రం అది!

అది గొప్పటానిక్‌లా పనిచేసింది. అడుగంటిన ధైర్యానికి కొత్త వూపిరిపోసింది. చేతివేళ్ళ సందుల్లోంచి జారిపోయిన జీవితం గురించి కాదు చేతిలో మిగిలిన జీవితం గురించి ఆలోచించమన్న అతడి సందేశం తనని మనిషిని చేసింది.

అవమానాలూ, హేళనలూ, వెలిచర్యలూ, వెక్కిరింతలూ తనని తాకలేనంత దృఢంగా తీర్చిదిద్దింది!

అందుకే తన జీవితాన్ని సార్థకం చేసుకోవాలని నడుంకట్టింది. మహిళలపై జరుగుతోన్న అన్యాయాల్నీ, అత్యాచారాల్నీ తూర్పారబట్టాలని, మహిళల ఆక్రందనకీ, ఆవేశానికీ అద్దంపట్టాలని, గుండెగదుల్లోపల బంధింపబడ్డ మూగవేదనకో గొంతు కల్పించాలని కత్తిలాంటి కలంపట్టి పత్రికా విలేఖరి అయ్యింది!

"యస్ చైతన్యా! లైఫ్ ఈజే ఛాలెంజ్. ఐ విల్ మీటిట్!" పిడికిలి బిగించి అనుకుంది దృఢస్వరంతో దివ్య.

"ఆంటీ ఆంటీ..." ప్రక్కింటి వారమ్మాయి దివ్యని పిలుస్తూ వచ్చింది.

"రా బుజ్జీ" ఆరేళ్ళ బుజ్జిని ఒళ్ళో కూర్చోబెట్టుకుని ముద్దు పెట్టుకుంది. బిస్కెట్ల పాకెట్లోంచి రెండు తీసిచ్చింది.

"అరె బుజ్జీ- ఈ ముద్దొచ్చే బొమ్మ ఎక్కడిది?" బుజ్జి చేతుల్లోంచి బొమ్మ తీసుకుంటూ అంది. అది మగబొమ్మ.

"బావుందా ఆంటీ"

"బావుందిగాని ఇదెక్కడిది? డాడీ కొన్నారా?"

"వూహూ- మమ్మీ కొంది. మరేమో నీకోమాట చెప్పనా? ఎవ్వరికీ చెప్పకూడదు మరి"

"చెప్పన్లేగాని చెప్పు"

"మాకిలాంటి బుజ్జి తమ్ముడు పుడతాడు"

"ఏమిటీ!" అదిరిపడింది దివ్య.

"నువ్వు చెప్పేది నిజమేనా బుజ్జీ?" నమ్మకం కుదరక అడిగింది.

ఎంతో సంతోషిస్తుందనుకున్న ఆంటీ అలా అడిగేసరికి బుంగమూతి పెట్టేసుకుంది.

"చెప్పు బుజ్జీ- నీకు తమ్ముడు పుడతాడా? ఎవరు చెప్పేరు?

"మమ్మీ"

చటుక్కున బుజ్జిని ఒళ్ళోంచి దింపి చేయి పట్టుకుని నడిపిస్తూ ప్రక్కింటికెళ్ళింది.

దివ్యని చూస్తూనే చిన్నగా సిగ్గుపడుతూ ఆహ్వానించింది బుజ్జి వాళ్ళమ్మ.

ఆమె మొహంలో చిందులేస్తోన్న ఆనందం చూసి ఒకింత ఎంబ్రాస్సింగా ఫీలవుతూ అడిగింది "నేను విన్నది నిజమేనా? మీరు మళ్ళీ నీళ్ళోసుకున్నారా?"

తలాడించింది- "ఈసారి తప్పకుండా మగపిల్లాడు పుడతాడని కొండదొర జోస్యం చెప్పేడు"

"చూడండి... మీకంటే చిన్నదాన్నే అనుకోండి. తయినా ఒక మాట చెప్పకుండా వుండలేక పోతున్నాను. మీకు ముప్పైఏళ్ళు కూడా వుండవు. ఇప్పటికే అయిదుగురాడపిల్లల్ని కన్నారు. మళ్ళీ ఇంకో బిడ్డని కనబోవటం మీకు మీ ఆరోగ్యానికి మంచిది కాదు. మన్లాంటి మధ్యతరగతి వారి ఆర్థికపరిస్థితిని బట్టి కూడా అది సమంజసంకాదు. వెంటనే నా

మాటవిని అన్నయ్యగార్తో డిస్కస్‌చేసి అబార్షన్ చేయించుకోండి''

వినకూడనిది చెవిన బడ్డట్టు చెవులు మూసుకుందామె.

"ఒక మగ బిడ్డని కనని ఆడదీ ఆడదేనా"

"తల్లికి ఏ బిడ్డ అయినా ఒకటే. ఏ బిడ్డ అయినా పురిటి నొప్పులు పడక తప్పదు"

"మగనలుసు లేకపోతే వంశం ఎలా నిలబడుతుంది?"

"వంశాలూ, కులాలూ అన్నవి గతకాలపు శిథిలాలు. వాటి అవసరం ఈనాడు లేదు. ఆ మాటలీనాటి సమాజంలో అర్థంలేనివి!"

"మీరలాగే చెబుతారు. రేపు కాలూ చెయ్యీ వంగేక చూట్టానికీ తల కొరివి పెట్టడానికీ ఒక వంశాంకురం వుండొద్దూ?"

"రెక్కలొచ్చేవరకే మన బిడ్డలు. ఆ తర్వాత ఎవరికెవరో! వెనక సంపాదించిన ఆస్తుల్లేక పోతే కన్నవాళ్ళు బతికి వున్నారో లేదో చూసేంత ఓపికా తీరికా లేవీనాటి కొడుకులకి. బంధాలూ, సంబంధాలూ కృత్రిమమూ, ఆర్థికమూ అయిపోయిన కలికాలపురోజులివి!"

మీరెన్నైనా చెప్పండి. నా ఆరోగ్యం ఏమైనా కానీండి. నేనో వంశాంకురాన్ని కనితీరతాను"

తరతరాలుగా ఆడదాని రక్తంలో జీర్ణించుకుపోయి అనిపించిన ఆ మాటలకి కోపం రాలేదు దివ్యకి.

జాలిగా ఆర్తిగా చూస్తూండిపోయిందంతే!

★ ★ ★

'సమాజానికో హెచ్చరిక!' అను శీర్షికతో వురిబోసుకున్న ముగ్గురమ్మాయిల వృత్తాంతం గురించి రిపోర్టు రాసి, పత్రికాఫీసులో ఇచ్చి వస్తోంటే చైతన్య తారసపడ్డాడు.

ఆమె పక్కనుంచి మోటారుసైకిల్ని నెమ్మదిగా పోనిస్తూ అన్నాడు "ఉదయపు సంఘటనకి బాగా రియాక్టైనట్టున్నావు"

"నీకెలా తెలిసింది?"

"వుబ్బిన నీ కళ్ళు చెప్పాయి"

"చాలా దారుణం చైతన్యా. బతుకులో పావంతుకూడా చూడని ఆ చిన్నారులు... చాలా తొందరపడ్డారు"

"నిజమే... కాని ఆ చిన్నారుల సున్నిత మనస్సుల్ని చిత్రవధ చేసిన పరిస్థితుల్ని మనం తక్కువగా అంచనా వెయ్యకూడదు. ఆడపిల్లలు రోడ్డువెంట వెళ్తే వేధించే రోమియోలు చాలా మందే వున్నారు. ఇక త్వరగా పెళ్ళి కాకపోతే కాకుల్లా పొడిచే లోకులకీ కొదవలేదు. రెక్కల గుర్రం మీద చుక్కల రాకుమారుడొచ్చి అమాంతం పెళ్ళాడేస్తాడని రంగుల కలలు చూపించే సినిమాలకీ, నవలలకీ తక్కువలేదు. వధూవరుల కళ్ళ ముందే కట్నాల బేరసారాలూ, లాంఛనాల అలుగుళ్ళూ జరుగుతున్న రోజులివి. కట్నం ఒక తప్పుగా ఒక నేరంగాగాక ఒక గొప్పగా ఒక స్టేటస్ సింబల్‌గా చూస్తోన్న దురదృష్టపు సమాజం మనది"

"అవునవును... ఎంత ఎక్కువ కట్నం తీసుకుంటే అంతగొప్పగా చెప్పుకుంటారు ఆడవాళ్ళూ మగవాళ్ళూ కూడా"

"అంచేత ముందు మన ఆలోచనాధోరణిలో మార్పురావాలి. అప్పుడుగాని వరకట్నంలాంటి దురంతాలు మాసిపోవు"

"వ్వూఁ- సరేగాని నీ సంగతేమిటి చెప్పు? పప్పన్నం ఎప్పుడు పెడతావ్?"

"పెళ్ళి చేసుకున్నప్పుడు"

"అదే! పెళ్ళెప్పుడు చేసుకుంటావ్?"

"పెళ్ళైనప్పుడు"

"ఎప్పుడవుతుంది?"

"పెళ్ళి చేసుకున్నప్పుడు"

"నీతో మాట్లాట్టం కష్టంబాబూ"

"చేతిలో కలం, నాలికమీద సరస్వతీ వున్న నువ్వే అలాగంటే ఎలా, అన్నట్టు మనం కాసిని టీ నీళ్ళు తాగగూడదూ?"

"ఇప్పుడా?" సంకోచంగా చుట్టూచూసింది.

"ఏమిటలా చూస్తున్నావు. ఎవరైనా మనల్ని చూస్తున్నారనా?"

"అబ్బే అదేంకాదుకాని..."

"ఓ చైనా సామెత చెప్పనా. నువ్వు నిదానంగా నడుస్తున్నప్పుడు నీ నీడ వంకరగా వుంటే దాన్ని నువ్వు పట్టించుకోనక్కర్లేదు"

"పట్టించుకోనుగాని పద. అవునూ ఎప్పు




డూ లేనిది హొటల్ అంటున్నావేమిటి వాళ?''

"ప్రొద్దుట్నుంచీ పంచనామా పోస్టు మార్టంలతోనే సరిపోయింది. గొంతులో ఇన్ని నీళ్ళు పోసుకునే అవకాశంకూడా చిక్కలేదు''

''అరె- చాలా దారుణమైన వుద్యోగం మీది''

''మాతోబాటు మీరూ, డాక్టర్లూ కూడా లెక్కలోకి వస్తారు''

నవ్వుకుంటూ హొటల్లోకి వెళ్ళి కూర్చున్నారు.

''అన్నట్టు రేపు నేను మధుర వెళ్తున్నాను''

''మధుర? యూ మీన్ ఢిల్లీ దగ్గరి...''

''అవును ఆ మధురే. మా ఎడిటర్ వెళ్ళమన్నారు. ఈమధ్య గుజరాత్‌లోని ద్వారకలోనూ ఆ పరిసరాల్లోనూ పరిశోధించిన శాస్త్రవేత్తలు కృష్ణుడిద్వారక అక్కడ వుండేదనీ కాలక్రమేణా సముద్రంలో మునిగిపోయిందనీ అభిప్రాయపడుతున్నట్లు వార్తలొచ్చాయి. అంచేత మధుర, బృందావనాలు వెళ్ళి కృష్ణుడికి సంబంధించిన చారిత్రికాంశాలేమైనా లభ్యమవుతాయేమోనని పరిశోధించమన్నారు''

''నువ్వక్కడికి వెళ్లటం చాలా మంచిది''

''ఎందుకు?''

''వెళ్లేక నీకే తెలుస్తుంది''

గంభీరంగా మారిన అతడి ముఖంచూసి మరి రెట్టించి అడగలేకపోయింది దివ్య.



యమపాశం మీదపడినట్టు వులిక్కిపడి లేచి కూర్చుంది దివ్య. ఏమిటి? ఏమయ్యింది? ఆందోళనగా ఆసక్తిగా కలయజూసింది.

సత్రం గదిలో ఎలాంటి మార్పు లేదు. మరి...?

గుండె ఇంకా వేగంగా కొట్టుకుంటూనే వుంది. వళ్లంతా చిరుచెమటలు పోశాయి.

ఏదో జరక్కూడనిది జరగబోతున్నట్టు అశాంతిపూర్వక అస్థిమిత భావనలు... ఎవరో ఏదో లీలగా ఆర్తిగా పిలుస్తున్నట్టు...

తన సిక్స్‌త్‌సెన్స్ ఏదో చెబుతోంది. ఏమిటది?

ఏం జరగబోతోంది? మంచా, చెడా?

రిపోర్టర్‌గా మధుర, బృందావనాలని గురించి కవర్‌చేద్దామని క్రితంరోజునే వచ్చింది. కృష్ణుడి మధుర గురించీ, బృందావన రాసలీలల గురించీ ఆసక్తికరమైన విషయాలూ, విశేషాలూ సేకరించాలనెంతో ఉత్సాహంతో వచ్చింది.

కృష్ణుడి గుడి చూసింది. కృష్ణుడు జన్మించిన జైలు గది చూసింది. వూళ్లో ఎందర్నో ఇంటర్వ్యూ చేసింది. యమునాతీరంలో కృష్ణలీలలు స్మరిస్తూ విహరించింది. ఇంకోరోజు వుండి బృందావనాన్ని కవర్‌చేద్దామని ఆగింది. బృందావనంలోని ఓ సత్రంలో బసచేసింది.

ఇంతలో హఠాత్తుగా మెలకువ వచ్చింది.

అంతా అయోమయంగా అన్పిస్తోంటే లేచి వెళ్లి వాచీ చూసింది.

నాలుగూముప్పై అయిదు. ఇంత వుదయమే ఎందుకు మెలకువ వచ్చినట్టు?

కిటికీ దగ్గరికెళ్లి సాలోచనగా బయటికి చూస్తూ నిలబడింది. చీకటి తెరలు మెల్లగా తొలగుతున్నాయి. ప్రశాంతంగా నిద్రపోతోంది బృందావనం. యమునమీంచి చల్లనిగాలి వచ్చి మేను నిమురుతోంది. ప్రపంచమంతా హాయిగా మధురంగా వుందన్పించేట్టు వుంది ప్రకృతి.

ఇంతలో ఓపక్కన నీడలా క్రీనీడలా ఎవరో కదిలారు.

అటు చూసింది.

ఎవరో ఒకావిడ పరుగులాంటి నడకతో వెళ్తోంది రోడ్డుమీద.

తెల్ల చీర కట్టుకుని తలమీద ముసుగు వేసుకుని...

అదిరిపడింది దివ్య.

ఆమె... వితంతువా?

ఆశ్చర్యంనుండి ఇంకా తేరుకోనేలేదు ఇంతలో అలాటి వేషంతోనే అదేదిశలో మరొ కామె కూడా వెళ్తూండటం కంటబడింది.

ఆమె ఆశ్చర్యానికి అవధుల్లేకపోయాయి.

ఇంత చీకట్నే లేచి ఎక్కడికి వెళ్తున్నట్టు? ఎందుకెళ్తున్నట్టు? పైగా ఆ తొందరెందుకు?

ఆమెని సంభ్రమంలో ముంచెత్తడానికా అన్నట్టు తెల్లచీరలు ధరించిన మరికొందరు విధవలు ఒంటరిగానూ, జంటలుగానూ, గుంపులుగానూ కూడా అటే వెళ్లసాగారు.

వడివడిగా వెళ్తోన్న వితంతు సమూహాన్ని చూసి మూర్ఛపోబోయి నిలదొక్కుకుంది దివ్య.

అంతమంది అభాగ్యురాళ్లని ఒకేచోట అలా చూడటం ఇదే ప్రథమమేమో తన కళ్ళనీ మెదడునీ విశ్వసించలేకపోతోంది.

ఇంతమంది ఈ పుణ్యస్థలంలో ఏంచేస్తున్న ట్టు? వివిధ వయస్సుల్లో వున్న వీళ్లంతా ఇక్కడి కెలా, ఎందుకొచ్చినట్టు? ఇప్పుడంతా కలసి ఎక్కడికెళ్తున్నట్టు?

చూస్తూ నిలబళ్లేక గబగబా సత్రంలోంచి బయటికొచ్చింది.

గేటువక్కన బీడీ తాగుతోన్న ఒకతన్ని హిందీలో అడిగింది "వాళ్లంతా ఎవరు?"

"ఎవరూ?"

"అదిగో అలా వెళ్తున్నారే ఆ తెల్లబట్టలవా ళ్లు"

"వాళ్లా? అభాగినులు" అదో అతి మామూ లు సంగతిలా చెప్పేడు.

"ఎక్కడికెళ్తున్నారు?"

"పనికి" అదోలా నవ్వేడు.

"ఏం పనికి"

"ఆ ముండలు చేసే పనేంటీ నా బొంద. తిండిగింజలకి పోతున్నారు" ఈసడింపుగా అన్నాడు.

ఆమె ముక్కుపుటాలదిరాయి. వితంతు వంటే ఎంత హీనభావం! దేశంలోని అన్ని ప్రాంతాల్లోనూ ఇంతేనా?

రోషంగా అడుగులేసింది.

వెనకనుంచి అతడేదో అన్నాడు. ఏమన్నాడో పూర్తిగా అర్థంకాలేదు. కాని అంతా బేచారీ లంటున్నాడనుకుంది.

గబగబా వెళ్లి ఒకావిడ్ని కలిసింది. "మీరె క్కడి కెళ్తున్నారు?"

ఆవిడ బదులివ్వలేదు. కనీసం దివ్యవంక చూళ్లేదు. ఏమీ వినబడనట్టు హడావిడిగా నడుస్తోంది.

యమునలో స్నానం చేద్దామని వెళ్లటంలే దుకదా?

ఒక్క నిమిషం సందిగ్ధంలో వూగిసలాడింది.

అదే నిజమైతే మరీ ఇంత పొద్దుటే లేవా ల్సిన అగత్యం ఏమిటి? కొంపలేవో అంటుకుపో తున్నట్టు పరుగున వెళ్లాల్సిన అవసరం ఏమిటి? ఒకరు కాదు, పదిమందికాదు, దగ్గర దగ్గర రెండువందలమంది విధవలు ఇలా వెళ్తున్నారంటే ఏదో పెద్ద కారణం వుండివుండ కపోదు.

అదేమిటో తెలుసుకోవాలి! మౌనంగా అనుసరించింది.

నదులన్నీ సముద్రంలో కలిసినట్టు, అన్ని వైపుల్నుంచీ ఎందరో వితంతువులొచ్చి భజన ఆశ్రమంలోకి వెళ్లారు.

ఇంచుమించు ఏడెనిమిది వందలమంది ఆశ్రమంలో నేలమీద చతికిలబడ్డారు. అంతా తెల్లని వస్త్రాలు ధరించారు. విభూది బొట్లు పెట్టుకున్నారు. తలలమీంచి పైటతో ముసుగు వేసుకున్నారు.

ఒకర్తో ఒకరు మాట్లాడుకోవడంలేదు. కనీసం ఒకర్నొకరు చూసుకోవడంలేదు. పక్క వారితో కూడా సంబంధం లేనట్టుగా నిర్వికా రంగా కూర్చున్నారంతా.

లోపలికి వెళ్లొచ్చే లేదేనని గుమ్మందగ్గరే ఆగిపోయింది దివ్య.

అంతా వితంతువులేమరి. బొట్టు ధరించిన తను వెళ్తే...!

కళ్లు తుడుచుకుని వాళ్లనే గమనించసా




గింది.

సరిగ్గా ఆరుగంటలకి గొంతెత్తి కీర్తనలు అందుకున్నారు.

"హరే కృష్ణ హరే కృష్ణ
కృష్ణ కృష్ణ హరే హరే
హరే రామ హరే రామ
రామ రామ హరే హరే..."

సుమారు గంట గడిచింది. భజన సాగుతూనేవుంది. దివ్య సత్రానికి వెళ్లిపోదామని లేస్తోంటే ఒకతను అటెండెన్సు నోట్‌చేసుకుంటూ కన్పించాడు.

భజనకి ఎవరెవరొచ్చిందీ రాసుకుంటున్నారన్నమాట.

ఎందుకు? వీళ్లందరికీ వుచిత భోజనాలు ఏర్పాటుచేస్తారా? అలాగే నివాస ఏర్పాట్లు కూడా చేస్తే ఎంత బావుండేది. పాపం ఎక్కడెక్కడ్నుంచో రానక్కర్లేదుకదా. అసలే దుర్దశతో మగ్గిపోతున్న వారికెంతో బాసటగా వుండేది కదా. ఏ మహానుభావుడు వీళ్లందరికోసం ఈ ఆశ్రమం స్థాపించాడో అతడికి చెయ్యెత్తి నమస్కరించాలి!

ఆలోచనాస్రవంతిలో కొట్టుకుపోతున్న దివ్య ఎవరో అరుస్తోంటే ఇహానికొచ్చి హాల్లోకి తొంగి చూచింది.

ఒకతను ఒకావిడ తలవంచి వీపుమీద గుద్దుతున్నాడు, భజన సరిగ్గా చెయ్యవేమిటంటూ!

ఎంత ఘోరం అన్పించింది. మిగతావాళ్లెవరూ అడ్డుకోరేం, అసలటు కన్నెత్తి చూడరేం అనుకుంది. వీళ్లల్లో రక్తం ప్రవహించటంలేదా అని ఆశ్చర్యపోయింది.

అసహనంగా నిరీక్షించగా నిరీక్షించగా పది గంటలకి భజన పూర్తయింది. ఒక్కొక్కరికీ పావుకిలో బియ్యం, ఇంత పప్పులూ పంచిపెట్టారు.

దివ్య మనసు ఏదోలా అయిపోయింది. దీనికోసమన్నమాట వాళ్ల తాపత్రయం! దీనివల్లేనన్నమాట ఆశ్రమ అధికారుల జులుం!

బరువెక్కిన హృదయంతో వెనుదిరిగింది.

మధ్యాహ్నమొచ్చి ఫొటోలు తీసి కొందర్ని ఇంటర్వ్యూ చెయ్యాలనుకుంది.

★ ★ ★

భుజాన కెమేరా తగిలించుకుని బయల్దేరింది దివ్య.

ఆమె కళ్లిప్పుడు పురాణ విశేషాలగురించీ, చారిత్రక ఆధారాల గురించీ అన్వేషించడంలేదు. అభాగ్యుల జాడ గురించీ, వారి బ్రతుకునీతల గురించీ కలయజూస్తోంది.

అప్రయత్నంగా ఆమె కాళ్లు ఆగిపోయాయి.

ఆమెక్కొంచెం దూరంలో ఒక ముసలావిడ అడుక్కొంటోంది రోడ్డు పక్కన చతికిలబడి. ఆమె విధవ అని ఆమె వేషమే చెబుతోంది. 'భిక్షువర్షీయసి' గుర్తొచ్చింది. కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

ఫొటో తీసుకుని చేతిలో అయిదు రూపాయల నోటు పెట్టి కదిలింది. కదలబోయే ముందు చూసింది ఆమె మోములో చిరు సంతోషతరంగం కదుల్తుందేమోనని. వూహూ... భావరహితంగా వుండిపోయిందామె మొఖం!

నిట్టూర్చింది.

మరికొంచెం ముందుకెళ్లేసరికి చిన్న చిన్న గూడుల్లాంటి ఇళ్లల్లో కొందరు అభాగినులు కన్పించారు. వారి దగ్గరికి వెళ్లింది.

వారికి అతి సమీపంలోకెళ్లినా ఎవరూ దివ్యని పట్టించుకోలేదు. తమపనుల్లోంచి బయటపడనూలేదు. ఎవరూ అక్కడ లేనట్టే కించిత్తు ఆసక్తి కూడా లేకుండా ప్రవర్తిస్తుంటే ఆశ్చర్యపోవడం దివ్యవంతయ్యింది.

"ఏమండీ... మీతో కొంచెం మాట్లాడాలి"

ఏం మాట్లాడాలన్నట్టు కళ్లతోనే ప్రశ్నించింది.

"నేను చాలాదూరంనుంచి అంటే సౌత్ ఆంధ్రానుంచి వచ్చాను. మీతో కాస్సేపు మంచీ చెడ్డా మాట్లాడదామని వుంది..."

ఒకావిడ మరొకావిడవంక చూసింది. ఆవిడ చేతిలోని పని వదలివచ్చి కూర్చుంటూ దివ్యని కూర్చోమంది.

"మీ పేరేమిటి?"

"పేరెందుకు, దిక్కూమొక్కూ లేనిదానికి"

"మీరెక్కడ్నుంచొచ్చారు?"

"కలకత్తా"

"చాలాదూరంనుంచొచ్చారే"

"ఇక్కడికి కలకత్తా ప్రాంతంనుంచి చాలా మంది వస్తూంటారు?"

"మీరెందుకొచ్చారిక్కడికి? మీకెవరూ లేరా?"

ఆమె శూన్యంలోకి చూస్తూండిపోయింది. ఆమె గాజుకళ్ల మూలల్లో గుండెల్నిపిండేసే తడి కన్పించింది దివ్యకి.

"ఎవరికెవరు ఈ లోకంలో? కడుపునబుట్టిన వాళ్లు పగవాళ్లకన్నా హీనంగా ప్రవర్తించారు. ఇంక నాకెవరో వున్నారని ఎలా చెప్పను?"

"అరే... అయితే మీకు సంతానం వుందా?"

"ఒకరుకాదు ఇద్దరు కొడుకులున్నారు. ఇద్దరి పనీ బాగానేవుంది. వాళ్ల నాన్న పోయాక ఎన్ని అష్టకష్టాలు పడ్డానో ఆ భగవంతుడికే తెలును. పిల్లల్ని పెంచి పెద్ద చెయ్యడానికి ఎన్ని ఇబ్బందులు పడ్డానో రెక్కల్ని ఎన్నిముక్కలు చేసుకున్నానో నా బిడ్డలకే తెలును. కానీ భగవంతుడూ పలకడు, నా బిడ్డలూ పలకరు. నేను వాళ్లింటో పనిమనిషిగా వుండటానికి



క్కూడా ఇష్టపడలేదు. నేను వారిపాలిట శని నట. దరిద్రాన్నట. నేనుంటే వాళ్లకి చిన్నతన మట. అందుకే ఇంట్లోంచి తరిమేశారు. మరొకా మెతో కలిసి ఇక్కడికొచ్చేశాను''

"ఎంత దారుణం. కని పెంచిన తల్లి కొడుకులకి శనిలా కన్పిస్తోందా? ఆ తల్లే లేక పోతే వీళ్లేమయ్యేవారో ఆలోచించారా?''

"ఎందుకాలోచిస్తారమ్మా నీ పిచ్చిగానీ! కాలం అలా వుంది. ఒకర్ని నిందించి లాభం ఏమిట్లే. అంతా తలరాత!''

ఆమె అలా భావించడంలో అసహజం లేదన్పించింది. తలరాత, విధివ్రాత అన్నవి పలాయనవాదపు పడికట్టు పదాలని చెప్పి వీళ్లని ఒప్పించటం అసాధ్యం అనుకుంది దివ్య. మన వాదనకన్నా వారి అనుభవం గొప్పదిమరి!

"మీతో వచ్చినావిడ కూడా...''

"అదీ నాలాంటిదే. దాని పని మరీ ఘోరం. వయస్సులో వుందామె. కొడుకులాంటి మరిది కన్ను ఆమె వయస్సుమీద పడింది. తనకి లొంగివుండమని నానా హింసా పెట్టాడా త్రాష్టు డు. అఖరికి చెరచడానిక్కూడా సిద్ధపడ్డాడు...''

"అతడి భార్య అడ్డుపడ్లేదా?''

"వూహూ... మొగుడికి లొంగిపొమ్మని తనూ తిట్టింది. కొట్టింది. మగాడిచాటు ఆడది. మగా డ్ని వెనకేసుకు రాకపోతే బ్రతగ్గలదా? ఫో నా ఇంట్లోంచంటే వీధినపడాల్సిందే. వీధికుక్కల పాల బడాల్సిందే. దానివనీ అంతే అయ్యిందిలే''

"ఏమయ్యింది? ఇక్కడ మీతో వుండ టంలేదా?''

"ఇక్కడే ఉంటోంది. మాతోకాదు. పండా లంటారే వాళ్లలో ఒకడామెని చెరబట్టి చెరచి వుంచేసుకున్నాడు. పెనం మీంచి పొయ్యిలో పడ్డట్టయ్యింది దాని బ్రతుకు!''

"అయ్యో! ఎంతఘోరం. పూజలు చేయి స్తూ పిండాలు పెట్టించే పండాల్లో కూడా...''

"ఎంతైనా అతడూ మగాడేకదమ్మా!''

మగాడు!

మూడక్షరాల త్రివిక్రముడు.

మీసం, రోషం, బలం, ఆస్తి అన్నీ వున్న బలవంతుడు.

ఆడదాన్ని చెప్పుకింద తేలులా తొక్కిపట్టి వుంచేవాడు. అనాదినుంచీ కథ ఇంతేనా? యు గాలు మారినా నాగరికత పెరిగినా మగాడి దృష్టి, దృక్పథం మారదా? ఆడదాని బ్రతుకు రీతి మారదా? మగాడు తోడులేకుండా ఆడది బ్రతకలేదా? బ్రతక్కూడదా? బ్రతకనివ్వరా?

ఓ మనిషీ! ఎటు నీ పయనం?

భౌతికంగా అంతరిక్షంలోకెళ్తూ నైతికంగా అంధయుగంలోకెళ్తున్నారు? ఎంత సిగ్గు! ఎంత అవమానం! ఎంత దారుణం!

"ఏమిటమ్మా అలా అయిపోయావు? అయ్యో ఆ కన్నీళ్లేమిటి. మాకోసం చెమ్మగిల్లే కళ్లుంటాయని కలలో కూడా అనుకోలేదు''

"అలా అనకండి. మీకోసం మీలాంటివారి కోసం ఎన్నో హస్తాలు బిగుస్తున్నాయి. ఎన్నో గొంతులు కలవబోతున్నాయి. ఆడదాని బ్రతు కుని కన్నీటి శాపాన్నుంచి విముక్తం చెయ్యను న్నాయి''

"తప్పకుండా చేస్తాయమ్మా. కాని అది మేం చూడం. నువ్వు చూడవు. నీ పిల్లలూ చూడరు. ఆ తర్వాత ఏమో ఏమౌతుందో! పాపం అధిక మై, భూమి బ్రద్దలవ్వకపోతే, ప్రపంచం భస్మీప టలం కాకపోతే, అప్పటికీ ఆడదాని బ్రతుకిలా గే వుంటుందేమో! చదువుసంధ్యలున్న వారిళ్ల ల్లోనే కాళ్లపనువు ఆరని ఆడపిల్లల్ని కట్నంకోసం సజీవదహనం చేస్తున్న సమాజంక దమ్మా మనది!''

అవున్నిజం! పచ్చినిజం!

ఎంత చక్కగా చెప్పిందీమె. బ్రతుకుమీద తీపిగాని ఆసక్తిగాని అభిరుచిగాని లేని ఈమె గుండెల్లో జ్వాల ఇంకా మండుతూనేవుందంటే ఆమె మనస్సెంతగా కాగిపోయిందో, కాలిపో యిందోగదా!

"మీదేవూరు?'' రెండో ఆవిడ్ని అడిగింది దివ్య.

"కర్ణాటకలో ఓ కుగ్రామం...''

"చాలాదూరంనుంచొచ్చారే. మీ జుట్టు...'' ఆవిడ గుండుని చూస్తూ అడిగింది.

తలమీద పైటకొంగుని సవరించుకుంటూ





అంది- "శాస్త్రప్రకారం శిరోముండనం చేయించుకోవాలి నాలాంటి అభాగ్యులు. ఈరకంగా మగవారి చూపుల్నుంచి తప్పించుకోవచ్చని పెద్దలు కల్పించిన ఆచారం. పైగా విధవ తలవెంట్రుక నేలమీద పడితే చనిపోయిన ఆమె భర్త నరకానికి పోతాడంటారు"

భర్త గుర్తుకొచ్చాడు కాబోలు కళ్లు తుడుచుకుంది.

"మరి మీవాళ్లు..."

"మా కులంలో భర్తపోయిన ఆడదాన్ని హీనంగా చూస్తారు. ఇక ఆమెకి పిల్లల్లేకపోతే మరీ ఘోరంగా చూస్తారు. తలకొరివి పెట్టడానికి కొడుక్కూడా లేని దౌర్భాగ్యురాలని ఈసడిస్తారు. అలాంటి దౌర్భాగ్యురాలిని నేను. పెళ్లైన రెండేళ్లకే స్వర్గస్తులయ్యారాయన. మా కుటుంబానికి పెద్ద ఇల్లూ, కొంత భూమీ వున్నాయి. మా ఆయన వాటా నాకివ్వాల్సొస్తుందని ఆయన అన్నదమ్ములు కుట్రపన్ని నాకెవర్తోనో అక్రమసంబంధం అంటగట్టి ఇంట్లోంచి గెంటేశారు. ఆయన వాటా ఇచ్చెయ్యమని అడిగితే ఆనందంగా ఇచ్చేసేదాన్ని. అడక్కుండా ఆస్తికోసం నలుగుర్లో నా బ్రతుకు నవ్వులపాలు చేశారు!"

భోరున ఏడ్చేసిందావిడ.

తేరుకోడానికి ఆవిడకీ దివ్యకీ కూడా కొంత సమయం పట్టింది.

"ఎక్కడో కర్ణాటకనుంచి బృందావనమే ఎందుకొచ్చారు?"

"కాశీ, ఋషికేష్, వృందావనా (ఇక్కడ బృందావనాన్ని వృందావనం అని పలుకుతారు)లలో నాలాటి అభాగ్యులకి ఇంత అండా, ఆశ్రయం లభిస్తాయని ఎవరో చెప్పగా విన్నాను. క్రిష్ణభగవానుడి ఈ పుణ్యభూమిలో చనిపోతే మళ్లీ మానవజన్మ ఎత్తాల్సిన అగత్యం వుండదని వచ్చాను. మాకు ఇహం ఎలాగూ లేదు కనీసం పరంకోసమైనా ప్రాకులాడాలి కదా!"

అవాక్కైపోయిందామె మాటలకి. వాటి వెనుక ఆమె వద్ద తపన, మధన, అసహాయ ఆర్తనాదం వూహించుకోడానికి ప్రయత్నించింది దివ్య.

"గూడుల్లాంటి ఈ గుడిసెలకి అద్దె ఎంత ఇస్తున్నారు?" వారి దృష్టిని మరలుస్తూ అడిగింది.

"నెలకి ఇరవై నుంచి ముప్పై, నలభై వరకూ ఇస్తూంటాం. చనిపోతే దహనసంస్కారాలకని వందరూపాయలదాకా ముందే వసూలు చేస్తూంటారు. దిక్కూ మొక్కూలేనివాళ్లంకదా!"

ఆమె గొంతు జీరబోయింది.

"మరి అంత సొమ్ము..."

"ఆశ్రమంలో సాయంత్రం నాలుగింటికెళ్లి మళ్లీ నాలుగు గంటలపాటు భజనచేస్తాం. రోజుకో రూపాయి చొప్పున ఇస్తారు"

"అంటే రోజూ అర్ధాకలితో మాడుతూ..."

"చావుకోసం ఎదురుచూస్తుండాలి"

ఉలిక్కిపడి చూసింది దివ్య.

ఆమె పెదాలు తేలిగ్గా వుచ్చరించిన ఆ మాటల మాటున దాగిన మనఃక్షోభ ఎలాంటిదో అనుకోకుండా వుండలేకపోయిందామె.

భజనవల్ల వచ్చే గింజలతో జీవనం వెళ్లబుచ్చలేక కాబోలు ఎందరో విధవలు అడుగడుగునా అడుక్కుంటూ కన్పిస్తున్నారు మధుర బృందావనాల్లో!

విదేశీ యాత్రికుల్ని చుట్టుముట్టేసి మరీ అడుక్కుంటోన్నవారిని చూసి 'అయ్యో దేశప్రతిష్ఠ దిగజార్చేస్తున్నారే' అని వాపోయేవాళ్లు ఆ అభాగ్యుల ఆకలిమంటల గురించీ, ఆ వ్యథార్త జీవితాల గురించీ ఒక్కసారి - ఒకే ఒక్కసారి ఆలోచించగలిగితే ఎంత బాగుంటుంది

మొదట మాట్లాడినావిడ తిరిగి అంది- "అవునమ్మా... నరకం ఎక్కడో కాదు, ఇక్కడే వుంది. మేం వుంటున్నదే ఆ నరకం. నోరారా మాట్లాడేవాళ్లు లేక నవ్వంటే ఏమిటో మర్చిపోయి నిస్సారమూ, నిస్తేజమూ అయిన గానుగెద్దు బ్రతుకునీడ్చేస్తున్నాం. ఎందుకు? చావు త్వరగా రాకపోతుందా అని! అయినా ఇక్కడెందుకిలా పడివుండాలని ప్రశ్నించొచ్చు. మేం చవిచూసిన నరకంకన్నా ఈ నరకం నయమే. పైగా ఇదీ కాదని ఇంకెక్కడికెళ్లగలం? మాకింకెక్కడ స్థానం లభిస్తుంది చెప్పు?

ప్రపంచాన్నీ ప్రపంచపు బరువుబాధ్యతల్నీ సుఖసంతోషాలనీ వదిలి వచ్చినవాళ్లంకదా!"

అవి మాటలుకాదు మాటలొచ్చిన వేదనలు! మానవత్వం పాలిట రంపపు కోతలు! సభ్యసమాజాన్ని నిలదీసే ప్రశ్నలు!

ఎంత దారుణమైన బ్రతుకు!

దేశం నలుమూలల్నుంచీ ఇదే దారీ దిక్కూ అనుకుంటూ కాశీ, బృందావనం, ఋషీకేష్ వగైరా పుణ్యక్షేత్రాలకి వేలాదిగా తరలివస్తోన్న అభాగ్య వితంతువుల ఆక్రందనల్ని, మూగ వేదనల్ని పట్టించుకునే ఓపికా, తీరికా ఎవరికీ లేవా?

వీళ్లకోసం ప్రజలూ, ప్రభుత్వం ఏమీ చెయ్యలేరా? చెయ్యరా? చెయ్యాలనుకోరా?

నిట్టూర్చి లేచింది దివ్య.

"మా బిడ్డలాంటిదానివని కడుపులోని దుఃఖం కక్కేశాం. మేమిలా చెప్పేమని ఎక్కడా చెప్పకమ్మా. ఆశ్రమానికి వ్యతిరేకంగా ఏదేదో చెప్పేమని అనుమానించి వేధిస్తారు ఆశ్రమ అధికారులు!"

'చెప్పనమ్మా... ఇక్కడెవరికీ చెప్పను. విచక్షణగల మా పాఠకుల్నీ సోషలిజ సూత్రాన్ని పఠించే ప్రభుత్వాన్నీ ప్రశ్నిస్తానంతే' మనస్సులో అనుకుని తలాడించింది.

చేతులు జోడించి నమస్కరించి మౌనంగా వీడ్కోలు తీసుకుంది.

చాలాకాలం తర్వాత మనస్సు విప్పి మాట్లాడే అవకాశం కల్పించిందని కాబోలు, దివ్య వంక ప్రేమగా చూస్తూండిపోయారు తడిబారి నకళ్లతో.

భజన ఆశ్రమానికెళ్లి ఆశ్రమ అధికారుల్ని కలిసింది.

తనో పత్రికా రిపోర్టర్నని చెప్పేసరికి చాలా మర్యాదలు చేశారు. ఆశ్రమం అంతా తిప్పి చూపించారు. భజన చేస్తోన్న మహిళల్ని ఫొటో తీసింది దివ్య.

ఆఫీసు గదిలో కూర్చున్నారు.

"1910లో సంపన్న మార్వాడీశేఠ్ జానకిదాస్‌జీ పటౌడియా ఈ ఆశ్రమాన్ని స్థాపించారు. విడోస్ రోడ్లమీదపడి అడుక్కోకుండానూ, దేవుడ్ని స్మరిస్తూ ఉంటారనీ ఏర్పాటుచేశారు. ఇక్కడ రోజూ గంటలతరబడి భజనలు చేస్తూంటారు గనుక చాలామంది వుదారంగా చందాలిస్తూంటారు. వచ్చిన చందాలని నాలుగు భాగాలు చేసి ఖర్చుపెడతాం. అంటే ఒకవంతు భజనసేవకీ, ఒకవంతు గోసేవకీ, ఒకవంతు దేవాలయ ఖర్చుకీ, మిగతాది సన్యాసులకీ, బ్రాహ్మణులకీ ఖర్చుపెడతాం. ఏడాదికి మా ఆశ్రమపు ఖర్చు సుమారు 20 లక్షలుంటుంది"

"భజనసేవ అంటే..."

"రోజుకి మూడు బాచ్‌లుగా భజన చేస్తూంటారు. ఒక బాచ్ నాలుగ్గంటలపాటు చేస్తుంది. ఉదయం భజన చేసినవారికి పావు కిలో బియ్యం, యాభైగ్రాముల పప్పూ ఇస్తాం. సాయంత్రం మళ్లీ ఇంకో నాలుగు గంటలపాటు భజనచేస్తే ఒక రూపాయి ఇస్తాం"

"బియ్యం, పప్పూ మాత్రమే ఎందుకిస్తున్నారు? ఏమైనా కాయకూరలు కూడా ఇవ్వొచ్చు కదా"

"శాస్త్రరీత్యా వాళ్లలాటి చప్పిడి భోజనమే తినాలి. అన్నిరకాల రుచులకీ, అభిరుచులకీ, ఆశలకీ, ఆకాంక్షలకీ, ఇహపు సుఖాలకీ, బంధాలకీ దూరమై వైరాగ్యంతో భగవంతుడిమీద తమ దృష్టిని కేంద్రీకరించాలి"

"కనీసం రూపాయి బదులు రెండో మూడో ఇస్తే..."

నవ్వేడు. "చూడండి... వృందావనంలో సుమారు మూడువేలపైచిలుకు విడోస్ వున్నారు. ఆపైన చెప్పక్కర్లేదనుకుంటాను"

"బియ్యం, పప్పు కూడా ఇవ్వాల్సినదానికన్నా తక్కువగా ఇస్తుంటారని..."

అతడి ముఖం ఎర్రబడింది. "ఇదో ధర్మసంస్థ. ఇదో ధర్మకార్యం. ఇందులో అధర్మానికి తావులేదు. మీకెవరో తప్పుడు సమాచారం ఇచ్చినట్టున్నారు"

"మీ గురించి చెప్పండి"

"నేనిక్కడో సేవకుడ్ని. అంతే. శలవ్" నమస్కరించాడు.

అతడి భావం అర్థంకాగా లేచింది. మరికొ




న్ని ఫొటోలు తీసుకుని వచ్చేసింది.

టాంగా పిలిచి ఎక్కింది. అతడి అభిప్రాయం తెలుసుకుందామని అంది- "ఈ ఆశ్రమాలవాళ్లు పాపం చాలా మంచివాళ్లు..."

"ఆఁఆఁ - మంచోళ్లేనండి. చందాలు మెక్కి ఒక్కోడూ ఏనుగంతయ్యాడుకదండి. ఈళ్ల వునురుతగలక పోదులెండి నాయాళ్లు. కోట్లు కోట్లు చందాలొస్తాయండమ్మగారూ. ఈ ఆడోళ్లకి రూపాయివ్వడానికి ఏడ్చిపోతావుంటారు..."

అతడేదో చెప్పుకుపోతూనే ఉన్నాడు.

ఒకచోట బండినాపి "అటు సూడండి" అని చూపించాడు.

మున్సిపాలిటీవాళ్లు ఓ విధవ శవాన్ని తీసుకుపోతున్నారు.

"ఎక్కడికి తీసుకెళ్తారు?"

"యమునానదిలో త్రోసెయ్యడానికి"

"అదేమిటి? దహనసంస్కారాలు చెయ్యరా? అందునిమిత్తం కొంత డబ్బు వసూలు చేస్తారంటకదా"

"అంతా దండుకునేవాళ్లే. శవాలకాడి పిండాకూడ ఏరుకుతినే నా కొడుకులే అంతా!"

★ ★ ★

'శుభోదయం' ఎడిటర్ మహర్షి రూంలోకెళ్లి విష్‌చేసింది దివ్య.

"హలో దివ్యా.. వచ్చేశావన్నమాట. ఏమైనా హాట్ హాట్ న్యూస్ తెచ్చావా?"

"మీరే చూడండి సార్" తను తయారుచేసిన నోట్సూ, ఫొటోలూ అందించి ఆయనెదురుగా వున్న కుర్చీలో కూర్చుంది.

"సెన్సేషనల్ న్యూస్ ఏమైనా తెచ్చేవా అని... ఈ ఫొటోలేంటి? నువ్వు మధుర వెళ్లలేదా?"

"వెళ్లేను సార్ అక్కడ తీసినవే అవి"

"కృష్ణుడి మధుర, బృందావనాలు వాస్తవాలా, కల్పితాలా అన్న అంశం గురించి కొత్త విశేషాలు సేకరించమంటే విడోస్ గురించి రాసుకొచ్చినట్టున్నావేమిటి?"

"గుండెల్ని చీల్చే నిజాలు పాఠకులకి చెప్పాలని. మీరొక్కసారి చదివి చెప్పండి సార్ ఎలావుందో..."

నోరు చప్పరించేస్తూనే తిరగేశాడాయన.

"బాగానే రాశావమ్మాయ్. వితంతువులంటే నీకెందుకింత అభిమానం పుట్టుకొచ్చేసిందో అర్థంకావట్లేదు. వెరీ ఓల్డ్‌థీమ్!"

ఎంతో సీనియరూ, అభ్యుదయభావాలు గలవాడుగా ప్రశంసలందే ఆయనలా అనేసరికి అదిరిపడింది దివ్య. ఆమె కళ్లల్లో చిన్న కన్నీటి అల ఛళ్లున బద్దలయ్యింది.

అది ఆయన గమనించలేదు. గమనించి వుంటే ఆమె జీవితవీణ అపశ్రుతినాదం వినేవారేమో!

"ఏమైనా ఇది అమ్ముడయ్యే విషయంకాదమ్మాయ్. పాఠకులకి ఇలాంటి సెంటిమెంటల్ కథలూ, ఆచార సాంప్రదాయాల్ని ప్రశ్నించే విషయాలూ పట్టవు. వాళ్లకి థ్రిల్లింగ్ ఎడ్వెంచరస్ అండ్ సెక్సీ విషయాలు కావాలి. సస్పెన్స్ రచనలు కావాలి. సాహసాలూ, అభూతకల్పనలూ కావాలి. అంతేగాని జీవితాలక్కర్లేదు!"

"కాని మన పాఠకులు..."

"పత్రికలు చదివేవారంతా నిజాలు తెలుసుకుందామనే చదువుతారనుకుంటే పొరపాటు పడినట్లే. వాళ్ల అభిరుచులు చిత్రంగానూ ఎస్కేపిస్ట్‌గానూ, వూహల్లో తేలియాడేట్లుగానూ వుంటాయి. అందుకుతగ్గ వార్తల్ని కథల్ని మనం ప్రింటు చేసినప్పుడే మన పత్రిక సర్క్యులేషన్ పెరుగుతుంది. ఉదాహరణకి తీహార్ జైల్లోంచి శోభరాజ్ ఎలా తప్పించుకున్నాడో, మళ్లీ ఎలా పట్టువడ్డాడో చిలవలూ పలవలూ సృష్టించి రాశామనుకో ఓహో పరిశోధనాత్మక వ్యాసం అంటారు. తెలుగురాని సినీనటి అచ్చతెనుగులో జవాబులిస్తోంటే ఎంత బాగా జవాబులిస్తున్నారని మెచ్చుకుంటారు. ప్రధాని పాలసీల గురించే రాస్తే ఎవరూ ఆసక్తి కనబరచరు. అదే ప్రధాని లక్షదీవుల విహారయాత్ర గురించీ, విహారం గురించీ, అందుకు చేసిన ఏర్పాట్ల గురించీ రాస్తే ఓహో అని పొంగిపోతారు. అంతెందుకు- కృష్ణుడి ద్వారక అబద్ధంకాదని నిజంగా ఒకప్పుడుండేదని శాస్త్రజ్ఞులు సాక్ష్యాధారాలు కనుగొన్నారని బాక్సుక

ట్టి మరీ మన పత్రికలో ప్రచురిస్తే పెద్దగా రెస్పాన్స్ రాలేదు. ఆ వార్తకి మసాలా జోడించి పెద్దవ్యాసంగా మరో పత్రిక పబ్లిష్ చేసేసరికి ఆహా... ఓహో అన్నారు.

అనుమానమొచ్చి ఆగి ఆమెవంక చూశారు.

తలొంచుకుని కూర్చున్న ఆమెని చూడగానే హర్ట్ అయిందని గ్రహించారు.

"అరెరె... నిన్నూ నీ కృషినీ, శ్రమనీ కించపరచాలని చెప్పడంలేదు. కేవలం లోకంపోకడ గురించి చెబుతున్నానంతే. అయినా మన పత్రిక కేవలం సర్క్యులేషన్ కోసమూ, లాభాల కోసమూ పెట్టలేదని నీకూ తెలుసుకదా. ఒక ధ్యేయంతో, ఒక లక్ష్యంతో స్థాపించబడిన మన పత్రికలో ఇలాంటి వ్యాసాలూ, పచ్చినిజాలూ మరెన్నో వెయ్యాలి. వేస్తాం కూడా. మన పాఠకులస్థాయి కొంచెం వున్నతంగానే వుంటుందని గట్టిగా చెప్పగలను..."

"థాంక్యూ సార్... మనసు ద్రవింపజేసే ఇలాంటి యధార్థాల గురించి లోతుగా రాస్తే పాఠకులెప్పుడూ ఆదరిస్తారని మీరే ఓసారన్నారు"

"అన్నాను- ఇప్పుడూ అంటున్నాను. వీటి స్థానం ఎప్పుడూ తక్కువ చెయ్యడానికి వీల్లేదని ఒప్పుకుంటాను. అయినా నగటు పాఠకుల అభిరుచిని కూడా మనం దృష్టిలో పెట్టుకోవాలని చెబుతున్నాను. వృద్ధిలోకి రావాల్సిన రిపోర్టర్‌వి- ఏమంటావ్?"

"అలాగే సార్"

"వితంతువుల పరిస్థితి గురించి చక్కని పరిశోధనా వ్యాసం రాశావు గనుక దీనికి సంబంధించినదే మరో వార్త చెబుతాను. ఛాలెంజింగ్‌గా తీసుకుని పరిశోధించాలి. దాచేసినా దాగని సత్యాలని వెలికి తియ్యాలి. కుట్రల్నీ కుతంత్రాల్నీ కుయుక్తుల్నీ బట్టబయలు చెయ్యాలి"

"ఏమిటి సార్ ఆ వార్త..."

"చాలా ఘోరమైన వార్త. మనం మన నాగరికత మన సంస్కృతీ సిగ్గుతో చితికిపోవాల్సిన ఘోర దారుణవార్త..."

"అంత దారుణమైన వార్త ఏమిటి సార్..." సన్నగా కంపిస్తూ అడిగింది.

ఒక అబల అమానుషత్వానికి బలవ్వడం ఆ వార్త సారాంశమని వెంటనే గ్రహించేసింది.

ఈ మహాసృష్టిలో అత్యంత హీన, దీన, దౌర్భాగ్యస్థితిలో వున్నది స్త్రీలే. పశుపక్ష్యాదుల్లో కనిపించని అగాధ వ్యత్యాసం వుచ్చ, నీచదృక్పథం కేవలం మానవజాతిలోనే వుంది. మనవుడికి మేధ వుండటమే ఆడదాని పాలిట శాపమయ్యిందా? లేకపోతే తనలాంటి మరోమనిషిని చెప్పుకింది తేలులా ఎందుకు చూస్తాడు మగాడు?

"వార్తేమిటో తెలిసిపోయిందా?"

"లేదు సార్. అలా అని తెలీకుండానూ లేదు. ఏజాతి చరిత్ర చూసినా ఏమున్నది గర్వకారణం నారీజాతి చరిత్ర సమస్తం పురుష పీడిత పరాయణత్వం"

"బాగా చెప్పేవ్. నిన్న సతీసహగమనం చేసిందొకామె"

తుళ్ళిపడి చూసింది "సతి?"

"అవును. దేవపురంలో దీపాసతి అనే పద్దెనిమిదేళ్ల అమ్మాయి నిన్న మధ్యాహ్నం భర్త శవంతోపాటు సజీవంగా దహనమయ్యింది. ఆ దృశ్యాన్ని వేలాదిమంది భక్తితో తిలకించారట"

"ఎంత రాక్షసత్వం" నడినెత్తిమీద పిడుగు పడ్డట్టు అరిచింది ఉద్రేకంతో వూగిపోతూ.

"కంట్రోల్ యువర్‌సెల్ఫ్. నీలోనే కాదు. ఆలోచించగల ప్రతివారిలోనూ అలాంటి రియాక్షన్ వచ్చి తీరుతుంది. అంత ఘోరమైన వార్త ఇది. రాత్రే అందింది. ఇంకా ఏ పేపర్లోనూ న్యూస్ రాలేదు. మన పేపర్లో రేపటి ఇష్యూలో రాబోతోంది"

"ఇరవైఒకటో శతాబ్దంలోకి అడుగుపెడుతున్న సమయంలో మధ్యయుగపు సంఘటన జరగటం మన దేశానికీ మన సంస్కృతికీ చెరగనిమచ్చ. మానవత్వానికి సిగ్గుచేటు"

"ఇది మధ్యయుగపు సాంప్రదాయం కాదు. పద్ధెనిమిదవ శతాబ్దంలో ఎక్కువగానూ, అంతకు పూర్వం అతిఅరుదుగానూ వుంటూ వచ్చిన వివసాంప్రదాయం. రాజారామమోహన రాయ్ కృషివల్లా, బ్రిటీషువారి చర్యలవల్లా సతిసాంప్రదాయం ఇంచుమించు అంతమ





య్యింది. అయినా అక్కడక్కడా ముఖ్యంగా రాజస్థాన్లో అప్పుడప్పుడూ జరుగుతూనే వున్నాయి. కాదంటే ఎప్పుడోగాని వెలుగు చూడటంలేదు''

''ప్రభుత్వం కూడా ఏమీ చెయ్యలేకపోయిందన్నమాట''

''గతంలో కొన్నిసార్లు పోలీసులు సతిని నిరోధించిన దాఖలాలున్నాయిగాని ఈసారేమీ చెయ్యలేకపోయార్ట. నీకీ సంగతి తెలుసా? రాజస్థాన్లో చాలాచోట్ల సతీమాత దేవాలయాలున్నాయి. జూన్ జులైలో రాణీ సతిమేలా ప్రతిఏటా పెద్ద జాతరగా జరుగుతూంటుంది. రాష్ట్రప్రభుత్వం ఆ రోజుని శలవుదినంగా ప్రకటించడమేగాక దుకాణాలకిగాను గదులు కూడా కట్టించింది మేలా కోసం. ఎందరో నాయకులూ, అధికారులూ కూడా ఆ జాతరలో పాల్గొంటుంటారు. దీనికేమంటావు చెప్పు? ఇంకో సంగతి- దేవపురంలో పదమూడవరోజున చున్రీ మహోత్సవం మహాడంబరంగా చెయ్యనున్నారు. ఇప్పటికే లక్షల రూపాయల చందాలు వసూలయ్యాయిట ప్రభుత్వంఏం చేస్తుందో చూద్దాం''

''మైగాడ్! మళ్ళీ ఉత్సవం కూడానా?''

''అవును. అంచేత నువ్వావూరు వెళ్లాలి. ఉత్సవ ఏర్పాట్ల గురించీ, ప్రజల రియాక్షన్స్ గురించీ ఎప్పటికప్పుడు తెలియజేస్తూనే మరో ముఖ్యవిషయం కనుక్కోవాలి. దీపాసతి తనంతట తను భర్త చితిమీద కూర్చుందా లేక ఎవరైనా బలవంతం చేశారా? వార్తలో వచ్చినట్టు చిరునవ్వుతో జనాన్ని దీవిస్తూ దహనమవ్వడం నిజమేనా? ఇంత చిన్నవయస్సులో పెళ్లైన ఏడాదిలో భర్తమీద భర్త శవంతోబాటు సజీవంగా కాలిపోయేంత ప్రేమ ఏర్పడటానికవకాశముందా? అవకాశం లేకపోతే అందుకు ప్రేరేపించిందెవరు? ఎందుకు? వీటన్నిట్లకీ నువ్వు సమాధానం సేకరించాలి''

''తప్పకుండా సార్. నిప్పుమీద కాలు పెడితేనే కెవ్వుమంటాం. అలాంటిది మెల్లమెల్లగా ఒళ్లంతా కాలి ఉడికిపోతోంటే నెమ్మది నెమ్మదిగా ప్రాణం పోతోంటే భరిస్తూ కదలకుండా కేకలు పెట్టకుండా కూర్చుని దహనమవడం ఎవరికైనా సాధ్యమైనవని అంటే నేన్నమ్మను. దాని వెనుక ఏదో వుండితీరుతుంది సార్''

''అదేమిటో నువ్వు పరిశోధించాలి''

''అలాగే సార్''

''ఒక్క సంగతి. జనంలో మూర్ఖత్వం, మూఢత్వం ఎక్కువ. గుంపుగా వున్నప్పుడు అదీ మరీ ఎక్కువవుతుంది. సమయానుకూలంగా మనలి మన కార్యం నెరవేర్చుకోవాలి. పైగా నిజాల్ని సేకరిస్తున్నావని తెలిస్తే దీపసతి అత్తింటివారూ, బంధువులూ కూడా నిన్ను తేలిగ్గా వదలరు. అంచేత నువ్వు చాలా జాగ్రత్తగా వుండాలి''

''ప్రయత్నిస్తాను సార్. నేనేమైపోయినా సరే ఆ కుట్ర వెనుకనున్న ముష్కరుల ముఖాల మీది ముసుగుల్ని చించేసి వారి నిజస్వరూపాలని సభ్యసమాజం ముందుంచుతాను. నమస్తే సార్''

పుత్రికా వాత్సల్యంతో చూస్తూ తలూపారాయన. ఆమెని రిస్క్ ఉన్న పనికి పంపుతున్నానా అని ఒక్కక్షణం సందేహించారు.

మహిళలపై జరుగుతోన్న అన్యాయాలకి పరాకాష్ఠ అయిన సతికృత్యంలో దోమల్ని పట్టుకోవాలని కంకణం కట్టుకున్న దివ్యకి, పులిబోనులో ప్రవేశిస్తున్నానన్న సంగతి తెలిసే అవకాశం లేదు.



ఆఫీసునుంచి ఉసూరుమంటూ వచ్చి వున్నూరంటూ సోఫాలో కూలబడ్డాడు రామారావు.

తోటకూరకాడలా వడలిన కొడుకుని చూసి గుండెలు బాదుకుంది మహంకాళి.

"ఏవిట్రా నాయనా అలా వున్నావేంరా"

"కొంచెం నీరసంగా వుందమ్మా"

"ఏనుగుల్ని సైతం నిలిపెయ్యాల్సిన ఈ వయస్సులో నీరసం ఏవిట్రా"

"రెండు బస్సులు మారి వచ్చేసరికి తల ప్రాణం తోకకొచ్చింది"

"అలా చెప్పు..."

సరిగ్గా అప్పుడు మంచినీళ్ల గ్లాసుతో వచ్చింది సీత.

"అబ్బాయి కష్టం చూశావుటే కోడలుపిల్లా. అయినా నీకు చీమ కుట్టినట్లయినా లేదన్న మాట"

వేటగాడి వింటి శబ్దానికి బెదరిన లేడి పిల్లలా చూసింది సీత.

"చూశావుట్రా. ఇదీ వరస. ఏమీ తెలీని అమాయకురాల్లా చూస్తుంది. ఏమైనా అంటే ఊరికే ఏడ్చిపోతుంది. ఇలాటిదాన్ని నీకు కట్ట బెట్టి నీ గొంతు కోసేశాంరా నాయనా"

నీళ్ల గ్లాసందిచ్చి గిరుక్కున వెనుదిరిగిందో లేదో అత్తగారు కయ్‌మని ఒంటికాలుమీద లేచింది.

"ఏమీ పట్టనట్టు వెళ్తావేమే నంగనాచీ. నీ మొగుడిబాగు నీ బాగు కాదూ? నీ మొగుడి కష్టం నీదికాదూ? బెల్లంకొట్టిన రాయిలా మాట్లాడవేమే?"

తలాడించింది.

"క్రితంజన్మలో గంగిరెద్దువయ్యుంటావ్. అన్నిటికీ తలాడించడమేకదా?"

"నేనెంత ట్రబులు పడితే దానికేమే. దాని తిండి దానికి దొరుకుతుందాయె"

"తేరగా మేపడానికి దీనబ్బ సొమ్మేం లేది క్కడ. ఒసే సీతా ఇలారా"

పైటచెంగు నోట్లో కుక్కుకుని వచ్చింది.

"రోజూ పొద్దున్న ఎనిమిదిగంటలకి ఇన్ని మెతుకులు నోట్లో వేసుకుని ఆదరా బాదరా ఆఫీసుకి పరుగెడుతున్నాడు గదా. సాయంత్రందాకా ఆఫీసులో గొడ్డుచాకిరీ చేసి చేసి రెండో మూడో బస్సులుమారి చచ్చీచెడి ఏ ఏడుగంటలకో కొంపకి చేరుకుంటున్నాడుకదా. అబ్బాయి ఇలా ఎన్నాళ్లు అవస్థపడగలడు చెప్పు?"

"నిజమే అత్తయ్యా కానీ..."

"ఇంక కానీ ఎందుకే పిచ్చిపిల్లా. అల్లుడికి స్కూటరు కొనిమ్మని మీ నాన్నకి ఉత్తరం రాయి. ఏదో మొక్కుబడిగా రాస్తే ఈ రోజుల్లో ఎవరూ కొనివ్వరు. మనస్సు కరిగేలా రాయాలి-తెల్సిందా?"

మౌనంగా నిస్సహాయంగా విలపిస్తూండిపో యింది సీత.

"మళ్ళీ ఏమొచ్చిందే నీకూ. రెండు నెల ల్నాడూ ఇలాగే ఏడ్చేవు. ఆ ఏడ్చేదో పుట్టింట్లో ఏడ్చివుంటే కలర్ టీవీ వచ్చేది. అందరి అల్లుళ్లూ రంగరంగ వైభవంగా రంగుల టీవీ చూస్తోంటే నీ మొగుడు బుల్లిటీవీ చూస్తున్నా డు. అది కొనివ్వడానికే ఏడ్చిపోయాడు మీ నాన్న. ఇది నువ్విచ్చిన లోకువ కాదూ? ఏరా అబ్బాయ్ మాట్లాడవేం?"

"అవునమ్మా. ఇది గట్టిగా అడిగివుంటే కలర్ టీవీయే కొనిచ్చును. విక్కువిక్కుమంటూ పోర్టబుల్ టీవీ కొనిచ్చారు ఏదో ముష్టివేసిన ట్టు?"

"అది కొనివ్వడానికి మా నాన్న ఎంత ఇద య్యాడో మీకు తెలుసుకదండీ"

"అబ్బో... తండ్రిని వెనకేసుకొస్తోంది చూ డరా. ఎంతైనా నీకంటే తండ్రిమీదే ప్రేమెక్కు వరా దీనికి"

"తండ్రిమీద అంతలావు ప్రేమ వున్నదా నివి పెళ్లెందుకు చేసుకున్నావు? పుట్టింట్లోనే పడివుండకపోయావా?"

భర్త మాటలకి దుఃఖం పొంగివచ్చింది సీతకి.

"ఏమిటీ ఏదో పండిత చర్చ చేస్తున్నట్టున్నా రు" అంటూ వచ్చారు ఆంజనేయులుగారు

ఆయన రామారావు తండ్రి. రిటైర్డ్ తెలుగు పండితుడు. ఖద్దరుపంచె లాల్చీ కళ్లజోడు, చేతిలో బొందు పుస్తకమూ కర్ణుని కవచకుండ లాల్లా అంటుకునుంటాయాయన్ని/గతకాలము మేలు వచ్చుకాలము కంటెన్ అని ఆయన నమ్మకం. ఆయన సిద్ధాంతం కూడా అదే. ఇంగ్లీషువాళ్లూ, ఇంగ్లీషు చదువులూ వచ్చాక

దేశవిజ్ఞానం మతం సంస్కృతి ఆచారాలు అన్నీ భ్రష్టు పట్టుకుపోయాయని ఆయన ప్రగాఢవిశ్వాసం. మన పురాణాలనీ, శాస్త్రాలనీ, పండితుల్నీ పట్టుకుపోయి వాటి ద్వారా అన్నీ నేర్చుకుని బ్రిటీషువాళ్లూ, వారిద్వారా అమెరికా వాళ్లూ గొప్పవాళ్లయ్యారని వాదిస్తారాయన.

"వచ్చారా. రండి రండి. మీ కోడలేమంటోందో చూడండి. పుట్టింటివాళ్లనడిగి స్కూటర్ తెచ్చుకోమ్మా అంటే బుడిబుడి రాగాలు తీసేస్తోంది" ఫిర్యాదు చేసింది మహంకాళి.

"అది కాదు మావయ్యగారూ..."

"అర్థమయ్యిందమ్మా. కాని చూశావూ పుట్టింటినుంచి వస్తువులూ, బహుమతులూ తెచ్చుకోవడం తప్పు కాదు. ఆ సంగతి మన శాస్త్రాల్లో స్పష్టంగా చెప్పేరు కూడానూ. పూర్వకాలంలో రాజులు కానివ్వు, సామాన్యులు కానివ్వు పెళ్లిలో అమ్మాయితోబాటు దాసదాసీల్నీ వస్తువాహనాల్నీ కూడా ఇచ్చిపంపేవారు. ఎందుకో తెలుసా? వారమ్మాయి ఏ లోటూ లేకుండా సుఖంగా కాపురం చేసుకోవాలని. ఆ ఆచారమే ఇప్పుడు వరకట్నం అయ్యింది. స్త్రీకి పతియే ప్రత్యక్షదైవం. పతి సుఖమే తన సుఖం. అంచేత పతిసుఖం కోసం మాతాపితల దగ్గర్నుంచి కానుకలు తీసుకురావడం శాస్త్రసమ్మతం తెల్సిందా?"

"అద్గదీ అలా విడమర్చి చెప్పండి, అప్పుడైనా దారికొస్తుందేమో"

"మీకు తెలీందేముంది మామయ్యగారూ. ముందనుకున్న కట్నం పెళ్లిలోనే ఇచ్చేశారు. తర్వాత అవీ ఇవీ కొనిపెట్టారు. ఇంకా పెట్టగల స్తోమతు మా నాన్నకి లేదు. ఆయనకి నేనేకాదు ఇంకా ఆడపిల్లలున్నారు. ఇంకా బాధ్యతలున్నాయి" నచ్చచెప్పచూసింది సీత.

"ఉంటాయమ్మా మానవజన్మ ఎత్తేక బంధాలూ, బాధ్యతలూ తప్పవుమరి. మొదట నీ బాధ్యత నువ్వు నిర్వర్తించు..."

"అసాధ్యమని తెలిశాక..."

"పతివ్రతకి అసాధ్యాలంటూ లేవమ్మా. త్రిమూర్తుల్ని పసిపిల్లల్ని చేసిన సతీఅనసూయ కథ నీకు తెలును. కుష్ఠురోగి అయిన భర్తని వేశ్యదగ్గరికి తీసుకెళ్ళిన సతీసుమతి కథ నీకు తెలుసు. వాటినుంచి నువ్వు నేర్చుకోవాల్సింది చాలా వుందమ్మా"

"అవన్నీ చిన్నప్పుడే ముక్కున బట్టేసిందండీ మన కోడలూ. చూస్తుండండి. అబ్బాయికి వారంరోజుల్లో స్కూటర్ తెప్పించేస్తుంది. అమ్మాయ్ సీతా- కాగితం కలం పట్టుకురా ఉత్తరం రాద్దువుగాని"

ఇది ఇలా మలుపుతిరుగుతుందని సీతకి ముందే తెలుసు.

పెళ్లయ్యాక గత పదకొండు నెలల్లో ఇలా ఎన్నోసార్లు ఉత్తరం రాయించారు. కొన్నిసార్లు పుట్టింటికి తరిమారు కూడా.

పెళ్లికైన అప్పుల్లోంచి ఇంకా తేరుకోనేలేదు తండ్రి. పైగా ఎదుగుతోన్న మిగతాపిల్లలు, పెరుగుతోన్న ధరలు, బతకడమే కష్టమైపోతున్న రోజులు.

అయినా తండ్రి తన కన్నీళ్లు చూడలేక తన కాపురం చల్లగా ఉండాలని అప్పుల నిప్పుల్లోకి దూకి ప్రతిసారీ ఏదోరకంగా తెచ్చిస్తున్నాడు తను నిలువునా కాలిపోతున్నా సరే.

టేప్‌రికార్డర్, గ్రైండర్ మిక్సీ, సోఫాసెట్, బీరువా, పోర్టబుల్ టీవీ...

ఇన్ని కోరికలు తీర్చినా వారికి తృప్తిలేదు. వారి గొంతెమ్మ కోర్కెలకి మితిలేదు.

ఇవాళ స్కూటరంటున్నారు, రేపేమంటారో?

తండ్రి దయనీయ పరిస్థితి తలచుకుంటూ ఆగని కన్నీటిని తుడుచుకుంటూనే ఉత్తరం రాసింది. ఆమె స్వంతంగా ఒక ముక్కా రాయలేదు. అత్తమామలూ, భర్తా కూడబలుక్కుని చెప్పిన ప్రకారం రాసింది.

రోజూ బస్సులో వెళ్లిరావడానికి ఆయన ఎంతో అవస్థపడిపోతున్నారనీ, సరిగ్గా తిండి తినే టైము కూడా వుండటంలేదనీ రాయించారు. స్కూటర్ కొంటేగాని ఆయన సుఖపడరనీ, తన కాపురం సవ్యంగా వుండదనీ బెదిరిస్తూ రాయించారు.

"రేపు మర్చిపోకుండా పోస్టులో వెయ్యరా. ఉత్తరం చూసే స్కూటరు కొనుక్కొచ్చెయ్యి




డు మీ మామగారు. అతగాడసలే పిసినిగొట్టు. అల్లునికి పెట్టడానికిక్కూడా ఏడ్చేసే మనిషి. ఒక వారంరోజులాగి నీ పెళ్లాన్ని పంపించు. తండ్రి నెత్తిమీద కూర్చుని వసూలు చేసుకొస్తుంది. చేసుకొచ్చేదాకా పుట్టింట్లోనే పడి వుంటుంది''

ఇంకక్కడ నిలబళ్లేక గదిలోకి పారిపోయింది సీత.

మంచంమీద బోర్లాపడి భోరున ఏడవసాగింది.

ఆ ఏడ్పు తన అసహాయ పరిస్థితి గురించీ కాదు, తండ్రి అవస్థ గురించీ కాదు. భర్త, అత్తమామల స్వార్థదృక్పథం గురించీ కాదు. స్కూటర్ కొనివ్వకపోతే చవిచూసే నరకం గురించీ కాదు.

మరి?

పెళ్ళిచేసుకున్నందుకు! పెళ్లి పేరున మెడలో పసుపుతాడూ, మనస్సుకి ఉరితాడూ వేయించుకున్నానే అని గుండెలు పగిలేలా ఏడుస్తోంది సీత!

★ ★ ★

దేవపురం వూరి పొలిమేరలో బస్సు దిగింది దివ్య.

రెండ్రోజులక్రితంవరకూ ఆ ఊరెక్కడుందో చాలామందికి తెలీదు. సతి సంఘటనతో అకస్మాత్తుగా ఆ ఊరికి ప్రాముఖ్యతొచ్చేసింది. ఇన్స్టంట్ పుణ్యస్థలం అయిపోయింది.

నలువైపుల్నుంచీ జనం తండోపతండాలుగా వచ్చేస్తున్నారు.

దాంతో ఇదివరకు దేవపురానికి అయిదారు కిలోమీటర్ల దూరంనుంచే వెళ్లిపోయే బస్సులిప్పుడు ఊరి పొలిమేరవరకూ వచ్చేస్తున్నాయి. బస్సులే కాదు- మెటడోర్లు, జీపులు, గుర్రపుబళ్లు, రిక్షాలు ఎన్నో వచ్చేస్తున్నాయి. ఊళ్లోకి వెళ్లే మట్టిరోడ్డు మరీ అధ్వాన్నంగా వున్నందునగాని లేకపోతే ఏకంగా వాహనాలు ఊళ్లోకే వెళ్లిపోయేవి.

''చూస్తోంటే ఈ ఊరు మరీ కుగ్రామంలా వుంది. అందువల్లే సతిలాంటి అనాగరిక సంఘటన జరిగింది'' నలుగుర్తో నడుస్తూ తనలో అనుకున్నట్లుగా జనాంతికంగా అంది దివ్య జనం రియాక్షన్ కోసం చూస్తూ.

''ఏమమ్మో... చాలా పొరబాటు పడుతున్నావు. మా ఊర్నలా ఈనుపుల్లలా తీసిపారెయ్యకు మరి. మా ఊళ్లో బ్రాందీ సీసాల్నుంచి బిర్యానీదాకా అన్నీ దొరుకుతాయి తెలుసా?''

నవ్వుతూ అంది ''నిజమే కావచ్చు బాబాయిగారూ. కాని రోడ్లదుస్థితి మాటేమిటి? స్వతంత్రం వచ్చి నలభైరెండు సంవత్సరాలయ్యాక కూడా ఇంకా ఇలాటి కాకులు దూరని కారడవీ, చీమలు దూరని చిట్టడవీలాంటి ఊళ్లున్నాయంటే నమ్మశక్యం కావట్లేదు''

''నువ్వే కాదు, ఎవరూ నమ్మలేరు. ఎప్పుడో వెలుగులోకి రావాల్సిన వూరుకదూ- రాజకీయాలవల్ల కొడిగట్టిన దీపం అయిపోయింది గానీ''

''అంటే ముఠాతగవులా?''

''అలాంటివే... గత పదిహేను ఏళ్లనుంచీ సర్పంచ్ అనంతయ్యకి తిరుగులేదు ఊళ్లో. అతగాడికీ మండలాధ్యక్షుడికీ చుక్కెదురు అవడానికిద్దరిదీ ఒకే పార్టీ అయినా ఇద్దరూ రెండు ముఠాలకి చెందినవాళ్లు. అంచేత మా వూరికిదికావాలి అని అనంతయ్య అడగడు. మా ఊరికి చిన్నపని చేసినా అతడి పరపతి మరింత పెరిగిపోద్దేమోనని మండలాధ్యక్షుడే మీ చెయ్యడు. కడకు ఎక్కడున్నావే గొంగళీ అంటే వేసినచోటే వున్నానూ అన్నట్టయిపోయింది మా ఊరు''

''ఇదన్యాయమని ఎదుర్కొనేవారూ, మీ ఊళ్లో అభివృద్ధిపనులు కుంటుబట్టానికి వీళ్లేదనేవాళ్లూ కరువయ్యారా?''

''ఉన్నారుగాని వారి గొంతు చిన్నది. ఇప్పుడిప్పుడే బాగా పుంజుకుంటోంది సూరపరాజుగారివర్గం. ఆయన మండల ప్రెసిడెంటు మనిషి...''

''సూరపరాజుగారంటే దీపాసతి మామగారా?''

''తప్పు తప్పు... పేరు పెట్టి పిలవకూడదు. సతీమాత అనాలి. ఆఖరికామె తల్లిదండ్రులనైనా నానరే అంతే అలాగే పిలవాలి. అందరికీ తల్లియైన సతీదేవత పుణ్యమా అని మా ఊరికో వెలుగువచ్చింది. మా ఊరో వెలుగు వెలగబో

తోంది. రెండుమూడు రోజుల్లో మా ఊళ్లోకి రోడ్లు వేయించేస్తానన్నారు మండల ప్రెసిడెంటు''

''ఆయనొచ్చారా ఇక్కడికి?''

''ఆయనేమిటి మహా మహావాళ్లే వచ్చారు. ఇహ రోజా వస్తారు కూడా. పెద్ద ఆలయం కట్టించి ఏటా జాతర జరిపించాలనుకుంటున్నారు భక్తులంతా''

''మీరేమంటారు?''

''దేవతని పూజించొద్దని ఏ త్రాష్టుడు అంటాడు?''

మరి మాట్లాడలేకపోయింది దివ్య.

అప్పుడే జనం ఆలోచనల్లో భావాల్లో చాలా మార్పొచ్చేసిందన్నమాట.

అందర్తోబాటు పాకహొటల్లో కెళ్లింది దివ్య.

హొటల్లో చాలా రష్‌గా వుంది. ఒక్కసారే ఒత్తిడి ఎక్కువైనందున ఊపిరాడనట్టుగా వున్నట్టుంది. సర్దుకుని ఓ మూలన బెంచీ చివర్న కూర్చుని ఇడ్లీ తిని కాఫీ తాగింది.

మంది ఎక్కువైతే మజ్జిగ పలచన అన్నట్టుంది క్వాలిటీ. రేట్లు విని మ్రాన్పడిపోయింది.

ప్లేటు ఇడ్లీ రెండ్రూపాయలు. కాఫీ రూపాయిన్నర.

''ఓరి నీ అసాధ్యం కూల! అమాంతం ఆకాశానికెగిరిపోయినట్టున్నావేమిటోయ్'' ఆ ఊరతను కాబోలు అన్నాడు హొటల్ యజమానితో.

''అంతా దీపామాత చలవ''

''నీ కూతురి పెళ్ళి గురించి నువ్వింక దిగులువడక్కర్లేదు''

ముసి ముసిగా నవ్వుకున్నాడు హొటల్ యజమాని.

బిల్లు చెల్లించి బయటపడింది దివ్య.

ఎవర్నీ ఏమీ ప్రశ్నించనవసరంలేకుండానే తిన్నగా సూరపరాజుగారింటికెళ్లింది. నదులన్నీ సముద్రంలో కలిసినట్టు అన్నివైపుల్నుంచీ వస్తోన్న జనం ఆయనింటికే వెళ్తున్నారు మరి.

సూరపరాజుగారిది పాతలోగిలి. ప్రస్తుతం అలంకరణ లేకుండా కొంచెం శిథిలావస్థలో వున్నదిగాని ఒకప్పటి వైభోగానికి దాఖలాలింకా మిగిలేవున్నాయి.

వీధి అరుగుమీద పాతకాలపు చెక్క వడక్కుర్చీలున్నాయి. ఒకదాంట్లో సూరపరాజుగారూ మిగతావాటిల్లో మరికొందరూ కూర్చున్నారు.

తలపాగా చుట్టుకుని గంభీరంగా వున్న సూరపరాజుగారు ముసలిపులిలా కన్పించారు దివ్యకి. పులి- బంగారుకంకణం- బ్రాహ్మణుడు కథ ఎందుకో గుర్తొచ్చింది. చేతికందిన పెద్దకొడుకు అకాలమరణానికి ఆహుతయ్యాడన్న తీరని బాధ, వేదన, వ్యధ ఆయన ముఖంలో అంతగా కన్పించటం లేదేమిటా అని విస్తుబోయింది. అసలు మురళి ఆయన కొడుకేనా అన్న అనుమానం కలక్కపోలేదు కూడా.

మెల్లెక్కి ఆయన్ని సమీపించి నమస్కరించింది.

తలూపి ఏమిటన్నట్టు చూశారాయన.

''పత్రికా రిపోర్టర్ని. ఒక్కసారి జరిగిన ఘటనల గురించి మీతో మాట్లాడదామని వచ్చాను...''

ఆయన అక్కడ కూర్చున్నవారిలో ఒకరి వంక చూశారు.

సన్నగా, పొడుగ్గా రివటలా వున్న ఆయన సూరపరాజుగారి బామ్మర్ది దానప్ప. ఆయన ముందుకొచ్చి దివ్యనోప్రక్కకి తీసుకెళ్లి కుర్చీ చూపించాడు.

''పుట్టెడు దుఃఖంతో మగ్గిపోతున్న మా బావగారు మీకేమీ ఇంటర్వ్యూలివ్వలేరు. ఇక ఏం జరిగిందో, ఎలా జరిగిందో మీ పత్రికలవాళ్లకి తెలుసు. జనానికి తెలుసు. భగవంతుడికి తెలును''

''అసలెలా జరిగిందో ఏమిటో మీ ముఖతః వినాలనుంది''

''అందరికీ తెలిసిందే. ఇందులో దాపరికమేముంది? మా మేనల్లుడు మురళికి కడుపు నొప్పి వచ్చింది. ఇక్కడ సరైన వైద్యసౌకర్యం లేనందున పట్నం తీసుకెళ్లాం. అక్కడ... మమ్మల్ని శోకసముద్రంలోకి నెట్టేసి వెళ్లిపోయాడు...'' కళ్లు తుడుచుకున్నారాయన.

''ఆ తర్వాత ఏం జరిగింది?''

''శవాన్ని ఇంటికి తీసుకొచ్చాం. వార్తవిని




'చనిపోలేదు లేదు- నన్ను వదలిపోరు పోరు' అని అరుస్తూ పడిపోయింది దీపామాత. స్పృహ వచ్చాక భర్త ముఖంలోకి చూస్తూవుండి పోయింది కొంచెంసేపు. అంతా గోడు గోడున ఏడుస్తున్నా కంటతడిపెట్టలేదామె. మురళి ప్రాణాలతో వున్నట్టే ప్రేమగా చూస్తూండిపోయింది కాస్సేపు. తర్వాత లేచి మామగార్తో అంటే మా బావగారి దగ్గరికెళ్లి 'నేను సతినవుతాను. ఏర్పాట్లు చేయించండి' అనేసి గదిలోకెళ్ళిపోయింది. మేమంతా విస్తుబోయాం. ఏంచేయాలో తోచలేదు. దీపామాత భర్తనెంతగా ప్రేమిస్తుందో దేవుడన్నా పూజలన్నా ఎంత భక్తి వుండేదో మా కందరికీ తెలుసు. అయినా ఆమె మాటల్ని జీర్ణించుకోలేకపోయాం. మా పురోహితుడూ వేదాలని ఔపోసన పట్టినవారూ అయిన సోమయాజులుగార్ని పిలిచాం..."

"మీరెవరూ ఆమెకి నచ్చచెప్పటానికి ప్రయత్నించలేదా?"

"లేదు"

అదిరిపడి చూసిందామె.

చిన్నగా నవ్వేడాయన.

"మా పెద్దలూ, సోమయాజులుగారూ ఆమె స్వచ్ఛందంగా చిత్తశుద్ధితో సతి అవ్వదలచుకున్నదీ లేనిదీ పరీక్షించారు. ఆమె నారీరత్నం. మహాపతివ్రత అని తేల్చిచెప్పేశారు. అయినప్పటికీ సతిని నిరోధించి సతీమాత శాపానికి మేం గురవ్వదలచలేదు. తన భర్తతోబాటు తనూ దహనమై స్వర్గంలో పతిదేవుడితో కలిసి సుఖిస్తానంటే వద్దనడానికి మేమెవ్వరం? మేమెంతవాళ్లం?"

"ఆ తర్వాతగాని చితికెక్కేప్పుడుగాని ఆమెకి సెకండ్ థాట్‌రాలేదంటారా? నిర్భయంగా నిప్పుల్లోకి దూకిందంటారా?"

మళ్ళీ నవ్వేరు.

"సతీమాత మహత్యం గురించి తెలిస్తే మీరలా మాట్లాడరు. అనలెంచేతో దీపామాతకి మొదట్నుంచీ సతీమాతమీద ప్రత్యేక భక్తి వుంది. పెళ్లైన వెంటనే భర్తని బలవంతాన తీసుకుని రాణి సతిమేళాలో పాల్గొంది"

"అలాగా..."

"అవును..."

"ఆ తర్వాత..."

"'తమ పెళ్ళినాటి బట్టలు ధరించి పెళ్ళికూతుర్లా తయారయ్యింది. ప్రత్యేక పూజ చేసి అత్తమామలకి నమస్కరించి శవయాత్ర వెంట బయల్దేరింది. వూరి నాలుగు వైపులా ఏవో పూజలు చేసింది. అంతసేపూ ఏదో మరోలోకంలో వున్నట్టే వుంది. బొందితో స్వర్గానికెళుతున్నట్టుగానే నిర్భయంగా చిర్నవ్వుతో చితిమీద కూర్చుంది. భర్త తలని ఒళ్ళో పెట్టుకుని భక్తుల్ని దీవిస్తూ చిర్నవ్వుతో భస్మమైపోయింది మహాతల్లి!"

చేతులు జోడించి కళ్ళొత్తుకున్నారు.

"పెళ్లై ఎన్నాళ్ళయ్యిందంటారు?"

"ఎన్నో ఏళ్ళా...ఏడాదికి ఒక నెల తక్కువే"

"ఇంత తక్కువ సమయంలో భర్తమీద అంత అనురాగం వుద్భవించిందంటారు"

"అంతే కాదు కోటికొక్కరే అలాటి వారుంటారు, సతీమాతలవుతారు అని గట్టిగా చెప్పగలను"

"చితిమీద మెల్లమెల్లగా కాలుతున్నా హాహాకారాలు చెయ్యలేదంటారు..."

"లేదు...వూరిలోని ప్రతి ఇంటినుంచీ నెయ్యి తెచ్చిపోస్తూనే వున్నారు. మంటలు వువ్వెత్తున లేస్తూనే వున్నాయి. భక్తజనం సతీమాతకీ జై అని అరుస్తూనే వున్నారు. సోమయాజులుగారు గాయత్రీమంత్రం పఠిస్తూనే వున్నారు. సతీమాత పెదాలమీద చిరునవ్వు మాత్రం చెరగలేదు. అభయహస్తం పట్టిన చెయ్యి కించిత్తు తొణకలేదు. కూర్చున్న స్థితిలో కొంచెం కూడా మార్పురాలేదు. అది మానవమాత్రులకి సాధ్యంకాదు. మన్లాటివారి వూహ కందదు కూడా. కేవలం సతీమాత ఆశీర్వాదంవల్లే దీపామాత 'సతి' కాగలిగింది"

"దీపాదేవి..."

"ష్... అపచారం- దీపామాత అనాలి..."

"అదే... దీపామాతకి చిన్నతనంనుంచీ కూడా భక్తి ఎక్కువగానే వుండేదంటారా?"

"వుండేదా అని నెమ్మదిగా అంటారేమిటి. కన్పించిన ప్రతిరాయికీ మొక్కేదంటే నమ్మండి. అసలు పుడుతూనే తన మహత్యం

చూపించింది సతీమాత"

"ఎట్లా?"

"ఆమె పుట్టిందని తెలిసిన మరుక్షణమే ట్రాన్స్‌పోర్ట్ కంపెనీకి సంబంధించిన కోర్టు వ్యాజ్యంలో ఆమె తండ్రి నెగ్గినట్టు కబు రందిందట

విస్ఫారిత నేత్రాలతో చూసిందామె.

"ఇదేకాదు ఇలాటి ఘటనలు చాలా వున్నాయి. మా బంధువులందరికీ తెలిసినవే అన్నీను- ఇందులో దాపరికం ఏం లేదు"

"పదమూడవరోజున చున్రీ వుత్సవానికి ఏర్పాట్లు చేస్తున్నారని విన్నాను"

"నిజమే... పెద్దలూ, పురోహితుడూ, సాంప్రదాయమూ కూడా ఆ కార్యక్రమం పూర్తిచెయ్యాల్సిందే తప్ప మధ్యలో అసంపూర్తిగా వదలకూడదంటున్నారు. అలా వదిలితే ఆ దోషానికి పరిహారం లేదంటున్నారు. చూస్తూచూస్తూ సతీమాత శాపానికెవరు గురవ్వగలరు? ఏమైనా సరే చున్రీ వుత్సవాన్ని మహోత్సవంగా చెయ్యాలని పట్టుబడుతున్నారు మా రాజపుత్ర యువకులు సంఘటితంగా"

"కాని ప్రభుత్వం సతిని పూర్తిగా వ్యతిరేకిస్తోంది కదా?"

"ఎవరన్నారు...ఇంతవరకూ ముఖ్యమంత్రి గాని ప్రధానిగాని, సతిని ఖండించినట్లు దాఖలాల్లేవు. అయినా ఇది మత విషయం. మత సంబంధమైన| కర్మకాండ. మత విషయంలో ప్రభుత్వ జోక్యాన్ని ఏ మతస్థులు సహించగలరు?"

"మిగతా విషయాలువేరు, సతివేరు. ఇక్కడో అబల సజీవంగా పాశవికంగా మృత భర్తతో బాటు దహనం చేయబడింది!"

"క్షమించాలి...మేమలా భావించడంలేదు. దీపామాత స్వచ్ఛందంగా దహనమయ్యింది. అందులో ఎవరి ప్రమేయమూ, బలవంతమూ లేదు. ఆ కార్యక్రమంకూడా రహస్యంగా జరగలేదు. వివిధ మతాలకి చెందిన వేలాది మంది చూస్తూండగా బహిరంగంగా జరిగింది"

"కాని లోకులు..."

"లోకులు కాకులన్నారు"

"చున్రీ కార్యక్రమాన్ని ప్రభుత్వం బలవంతంగా నిరోధిస్తే?"

"ఏంజరుగుతుందో మీరే చూద్దురుగానీ"

"ఏంజరుగుతుందంటారు?"

"ఏమైనా జరగొచ్చు. జనం తిరగబడొచ్చు. రక్తం కాలవలవ్వొచ్చు. విప్లవం రావొచ్చు. పార్టీలు చీలిపోవచ్చు. రాష్ట్రప్రభుత్వం పడిపోవచ్చు. దేశవ్యాప్తంగా ఆందోళనలూ, హర్తాళ్ళూ జరగొచ్చు- ఆ తర్వాత..."

దానవ్వ ఆగారు.

ఆయన ధోరణికి కలవరపడిందామె.

చున్రీ వుత్సవంనాడేం జరగబోతోంది?

ఆరోజున మత చాంధసులూ అభ్యుదయ వాదులూ ప్రత్యక్షంగా తలపడితే?

ప్రభుత్వం ఎవర్ని సమర్థిస్తుంది?

ఒకవేళ మధ్యస్తంగా వూరుకుండిపోతే?

అప్పుడేమవుతుంది? ఏమవ్వబోతోంది?

ఆమె గుండె గొంతు నెవరో నొక్కేస్తున్నట్టు గిలగిల్లాడింది దివ్య.

ఇంతలో మంత్రి మృత్యుంజయరావు తన అనుచరులతో కలిసి ఆర్భాటంగా రావటంతో స్వాగతం చెప్పడానికెళ్ళి పోయాడుదానవ్వ.

మంత్రిగారిని చూసి ఆశ్చర్యపోయింది దివ్య.

ఏదో ఆలోచన రాగా తన కెమేరాకి పనిచెప్పింది.

ఫ్లాష్. మెరుపుకి అంతా వులిక్కిపడి చూశారామెవంక!

★ ★ ★

మృత్యుంజయరావూ ఆయన అనుచరుల తీక్షణ దృక్కులను చూసి కలవరపడింది దివ్య.

కలవరపాటు కన్పించకుండా మందహాసం చేస్తూ చేతులు జోడించింది.

"ఎవరీ అమ్మాయి?"

"పత్రికా విలేఖరి..."

దానవ్వ మాటలకి మంత్రిగారి అనుచరులు క్రుద్ధులై ఆమెవైపు అడుగు వేశారు చూస్తూ.

కళ్ళతోనే వారిని వారించి ఆమెని పిలిచారు.

"నీకేం భయం లేదమ్మాయ్. పత్రికాస్వాతంత్ర్యంకోసం అవసరమైతే ఆమరణనిరాహారదీక్ష చేస్తాను. అవునూ- ఇక్కడేం చేస్తున్నావ్?"

"సతీమాత భక్తిప్రవృత్తుల గురించీ సత్శీలం గురించీ పతివ్రతా ధర్మాల గురించీ వివరాలూ కథలూ సేకరిస్తున్నాను. ఎన్నో ఏళ్ళ తర్వాత సతియైన దీపామాత చరిత్రని పాఠకుల కందించాలనొచ్చాను"

"ఇంత చిన్న వయస్సులో అంత మంచిధ్యేయంతో ముందుకొచ్చిన నిన్నభినందిస్తున్నాను. వెళ్ళమ్మా- వెళ్ళి నీ పని చూసుకో"

అయిష్టంగానే అరుగు దిగి మిగతా యాత్రీకుల్తోబాటు భవంతికి మరోవైపు వెళ్ళింది దివ్య.

"ఈ పత్రికల వాళ్ళతో చాలా జాగ్రత్తగా వుండాలి. చూసిరమ్మంటే కాల్చి వచ్చేరకం"

"బాగా చెప్పేరు... అందుకనే వాళ్ళని కనిపెట్టిచూసే బాధ్యత నాకప్పగించారు మా బావగారు" దాసప్ప చెప్పేడు.

"నీ దూరదృష్టి అమోఘమోయ్ సూరప్పా. సతీమాత నీ కోడలవడంవల్ల నీవంశమే కాదు మొత్తం మన బంధువర్గమే తరించిందనుకో రాజపుత్రుల పౌరుషాన్నీ గౌరవప్రతిష్ఠల్నీ ప్రపంచానికి చాటి చెప్పిందయ్యా నీ కోడలూ ఆమె మన కులంలో జన్మించడం మన అదృష్టం. మన పూర్వజన్మ సుకృతం. పతివ్రతా ధర్మానికి పరాకాష్ఠయైన సతీసహగమనం చేసి మొత్తంమీద కులానికి ధన్యత చేకూర్చేసిందనుకో. నువ్వు నిజంగా వరప్రసాదుడివయ్యా" సూరపరాజుని కౌగలించుకున్నారు మంత్రిగారు.

"ప్రధాని పిలిస్తేనూ మొన్న ఢిల్లీ వెళ్ళేను. లేకపోతే స్వయంగా వచ్చి సతీత్యాగాన్ని కళ్ళారా చూసి తరించేవాడ్ని. మా వాడు ఫోన్లో ఇదీ సంగతని చెప్పేడు. వెంటనే యస్పీకి లైట్నింగ్ కాల్ చేశాను. దేవపురంవైపు కన్నెత్తి చూడొద్దన్నాను. మీకేం ఇబ్బంది కలగలేదు కదా. ఏమైనా ఇబ్బంది కలిగితే చెప్పు సూరప్పా ఆమరణ నిరాహారదీక్షచేస్తాను"

"మీ ఆశీర్వాదంవల్ల అంతా సవ్యంగా జరిగింది"

"నా ఆశీర్వాదం కాదయ్యా సతీమాత ఆశీర్వాదం. పార్టీలకిందా మతాలకిందా చీలిపోకుండా మనమంతా ఒక్కటై నిలవాలని ఒక్కతాటిమీద నడవాలని సతీమాత వుద్దేశం. మనమంతా ఐకమత్యంగా వుండాలి"

"బాగా శలవిచ్చారు. రండి- ఫలహారంచేద్దాం..."

మంత్రిగార్నొక్కర్నీ లోపలిగదిలోకి తీసుకెళ్ళారు సూరపరాజు.

"పత్రికల్లో రగడ అవుతోంది. ముఖ్యమంత్రి ఏమంటున్నారు?" సూరపరాజు అడిగారు.

"ఏమైనా అంటే వూరుకుంటానా ఆమరణ నిరాహారదీక్ష చెయ్యనూ?"

"మీమీద నమ్మకం వుందనుకోండి. కాని పత్రికలకీ ప్రతిపక్షానికీ జడిసి..."

"జడిస్తే ఏముంది మన ఓట్లలో ఒకటి కూడా పడదు. అప్పుడిహ ముఖ్యమంత్రి గద్దెదిగిపోయి రాజకీయ సన్యాసం తీసుకోవాలి. మన జోలికెవరూ రారు. ఏమీ చెయ్యరుగానీ నువ్వు నిర్భయంగా వుండు. భారమంతా నామీద వెయ్యి చాలు. మన కుటుంబంలోని స్త్రీలు సహగమనం చేస్తే అది మన కులానికి గర్వకారణం. వీరోచితమూ, పవిత్రమూ, మహిమాన్వితమూ అయిన సహగమనం మన గౌరవమర్యాదలకీ, మత విశ్వాసాలకీ సవాల్‌వంటిది. దాన్నెవరు కించపరిచినా అణచాలని చూసినా మనం సహించకూడదు. అవసరమైతే ఆమరణ నిరాహారదీక్ష చెయ్యడానికి కూడా నేను సిద్ధమే"

"మీరున్నారన్న ధైర్యంతోనే చున్రీ కార్యక్రమం ఘనంగా జరిపిద్దామనుకుంటున్నాం..."

"అవశ్యం... నిర్భయంగా జరిపించండి. నేను స్వయంగా దగ్గరుండి అన్నీ పర్యవేక్షిస్తానని మాట ఇస్తున్నాను"

"మీరొస్తే ఇంకేం మాకు కొండంత బలం"

"చందాలు కుప్పతెప్పలుగా వచ్చి పడుతున్నాయని విన్నాను..."



"అంతా సతీమాత మహత్యం!"

"అందుకే సతీమాత పేరున ఒక ట్రస్టుని స్థాపిద్దాం. సతీస్థలంలో స్మారక మందిరం నిర్మిద్దాం. ఎన్నో ధర్మకార్యాలు చేబడదాం..."

"ఆ సన్నాహాలప్పుడే మొదలెట్టేశారు మన వాళ్ళు..."

"మరి ట్రస్టు బోర్డులో ఎవరున్నారూ...?"

"మీరు లేకుండానా?"

"మంచిది... సూరప్పా. ఈసారి ఎన్నికల్లో నాకేలోటూవుండదు. మనవారి అభిమానానికీ కరువుండదు. నిజంగా నిన్నెలా అభినందించాలో తెలీటంలేదు సూరప్పా" మళ్ళీ కౌగలించుకుని తన ఆనందాన్ని వ్యక్తపరిచారు మంత్రి మృత్యుంజయరావు.

లోపలి మంతనాల గురించి తనకేమీ తెలిసే అవకాశం లేదని నిట్టూర్చింది దివ్య. నలుగుర్తోబాటు సూరపరాజుగారింటిని చూస్తూ ఒక గదిముందాగింది.

ఆ గదిలో ఓ దివ్వే వెలుగుతోంది.

అది దీపా, మురళిల బెడ్‌రూమ్. గది బయట పెద్దసైజు పెళ్ళి ఫోటో వేలాడదీసి దండవేశారు.

"దీపామాత కాపురం చేసిన గదంట..." వింతగా చెప్పుకుంటూ కిటికీలోంచి లోపలికి తొంగి చూస్తూ దణ్ణాలు పెడుతున్నారు. కళ్ళ కద్దుకుంటున్నారు యాత్రికులు.

మహాపురుషుల నివాస ప్రదేశాన్ని చూస్తున్నట్టు ఒక పవిత్రదర్శనీయస్థలాన్ని చూస్తున్నట్టు అంతా చూస్తోంటే విస్తుబోవడం దివ్య వంతయ్యింది.

మధురలో చూసిన కృష్ణజన్మస్థానం గుర్తొచ్చింది. కృష్ణుడు జన్మించాడని చెప్పబడే కంసుని జైలు గదిని కూడా ఇంతభక్తిశ్రద్ధలతోనే చూశారు భక్తులంతా.

గదినీ, జనాన్నీ ఫోటోలు తీసింది.

దీపాదేవి ఇలా వెళ్ళి నీళ్ళు తెచ్చేదిట. అలా వెళ్ళి గోపూజచేసేదట- అని జనం కథలుగా చెబుతోంటే వారివంక జాలిగా చూస్తూ అనుసరించింది.

"దీపామాత రోజూ పొద్దుటే ఈ తులసికోటకే పూజచేసేదట" ఎవరో ఎవర్తోనో చెబుతున్నారు.

తులసి కోటవంక చూసింది దివ్య.

ఎండిపోయినట్టు జీవంలేనట్టు వుందది...

రోజూ నీళ్ళు పోస్తే ఇలాగా వుండాల్సింది? అవునూ దీప ఇక్కడెన్నాళ్ళూ కాపురం చేసినట్టు?

"దీపామాత పెళ్ళయ్యాక రెండుమూడుసార్లు మాత్రమే ఇక్కడి కొచ్చిందనుకుంటానుకదండీ" దివ్య అడిగింది.

"అదేమో తెలవదుకాని మొత్తానికి రెండు నెలలకి మించి లేదంట ఇక్కడ. అయినా ఎన్నాళ్ళు కాపురం చేస్తే ఏవిటి? దీపామాత మహాసాధ్వి, పరమపుణ్యావతి"

జనాన్ని జాలిగా చూసి కదిలింది.

సతి నాడేం జరిగిందో ఎవరు చెబుతారు? ఆనాటి దీప మనఃస్థితి గురించి తెలియజెప్పగలవారెవరు?

ఆమె మెదడులో ఫ్లాష్ వెలిగింది.

సూరపరాజుగారి ఆడవారిని కలిస్తే?

వాళ్ళద్వారా నిజాల్ని రాబట్టడం తేలిక!

గబగబా వీధి గుమ్మంవైపు నడిచింది. సూరపరాజూ దానప్పా మంత్రిగార్ని సాగనంపడానికి వెళ్ళారు.

గబగబా మెట్లెక్కి ఇంటిలోపలికి నడిచింది. హాల్లో అడుగుపెట్టిందో లేదో ఒకతను ఆపేశాడు.

"లోపలికెళ్ళడానికి వీల్లేదు"

"అమ్మగార్ని కలుసుకోవాలి"

"ఎవర్నీ కలుసుకోలేరిప్పుడు"

నిస్సహాయంగా చూస్తూ అంది. "దీపామాత అత్తగారు మాకు చాలా కావాల్సినవారు. ఆమెని ఓదారుద్దామని..."

"అయితే ముందు దానప్పగార్ని కలుసుకోండి"

"ఇంతోటిదానికి మగాళ్ళెందుకయ్యా. వారి బంధువునని చెబుతున్నానుకదా. విచారంలో వున్న వారిని పలకరించి ఓదార్చుదామనొస్తే ఈ ప్రతిబంధకాలేమిటి?"





"అదేమో నాకు తెలీదు. దాసప్పగారికి తెలీకుండా ఎవర్నీ లోపలికి పంపకూడదని దాసప్ప గారి ఆజ్ఞ. పదండి... వెళ్ళి వీధి అరుగుమీద కూర్చోండి. ఆయన పంపిస్తే నిరభ్యంతరంగా లోపలికెళ్ళొచ్చు"

వున్సురంటూ వెనుదిరిగింది.

ఈ కట్టుదిట్టాలు చూస్తోంటే దివ్య అనుమానాలు మరింత బలపడసాగాయి.

నిస్సందేహంగా దీపాసతి కథ వెనకేదో కుట్ర వుంది. అందుకే దానిని శాశ్వతంగా సమాధి చెయ్యాలనే ఈ కట్టడులూ ఘోషాలూనూ. ఆడవారి నోట్లో నువ్వు గింజ నానదంటారు. పైగా ఏ బలహీన క్షణంలోనో రహస్యాల్ని కడుపులో దాచుకోలేక కక్కెయ్యవచ్చు. అది నివారించడానికే ఈ అప్రమత్తతన్నమాట!

"ఈ జాగ్రత్తలెన్నాళ్ళో అదీ చూస్తాను: ఏదో రోజున ఈ కుట్రని బహిర్గతంచేసి తీర్తాను" మనస్సులోనే శపథంచేసుకుంది దివ్య.

వీధి అరుగుమీది కుర్చీలో కూర్చుని దినపత్రికల్ని తిరగెయ్యసాగింది.

ఆనాటి దినపత్రికలన్నీ వున్నాయక్కడ. దాదాపు అన్నిట్లోనూ సతీసహగమనం గురించి ప్రత్యేకంగా బాక్సు కట్టి ప్రచురించారు. రెండు పత్రికలు మొదటి పేజీలో ప్రముఖంగా ప్రకటించాయి. అందులో ఒకటి 'శుభోదయం'.

గబగబా అన్ని పత్రికలూ తిరగేసింది.

అన్నిట్లోనూ వార్త ఒకేరకంగా వుంది. వార్తా సంస్థ అందించిన సమాచారాన్నే ప్రచురించాయి. కొన్ని మాత్రం వ్యాఖ్యల్ని కూడా జోడించాయి.

వార్తా సూక్ష్మంగా ఇలా వుంది-

"సెప్టెంబరు నాలుగవతారీఖున దేవపురం గ్రామంలో దీపాదేవి అనే పద్దెనిమిదేళ్ళ అమ్మాయి "సతి" అయ్యింది. ఆమె భర్త మురళి కడుపునొప్పితో ఆసుపత్రిలో మరణించాడు. వారి పెళ్ళై ఏడాది కూడా కాలేదు. ఇంతలో ఇంత విపత్తు సంభవించింది. భర్త శవాన్ని చూస్తూనే దీపాదేవి ట్రాన్స్‌లోకెళ్ళిపోయింది. తర్వాత సతిసవుతానని ప్రకటించడమేగాక ఏడ్వవద్దని అత్తగార్నీ ఇతర బంధువుల్నీ వారించిందిట. ఆమె నిర్ణయాన్ని మార్చడానికి పెద్దలు చేసిన ప్రయత్నాలు విఫలమవటంతో ఎట్టకేలకు ఆమె సతి అవడానికామె అత్తమామలు అనుమతించారని తెలుస్తోంది.

దీపాదేవి పెళ్ళినాటి దుస్తుల్లో అలంకరించుకుని నిర్భయంగా చిర్నవ్వుతో చితిమీద కూర్చుంది. భర్త తలని ఒడిలో వుంచుకుని చిరునగవుతో అందర్నీ దీవిస్తూండగా ఆమె మరిది చితికి నిప్పంటించాడు. వేలాదిమంది జనం చూస్తూండగానే ఆమె భస్మమైపోయింది. సతీమాతకీ జై అంటూ జనం నినాదాలు చేస్తూనే వున్నారు చితి కాలుతున్నంతసేపూ.

దీపాదేవి హైస్కూలు చదువుకూడా పూర్తి చెయ్యలేదు. పెళ్ళినాటి ఫోటోలు చూస్తే సాంప్రదాయభిన్నంగా దుస్తులు ధరించిందని తెలుస్తుంది. ఆమెలోని ఆధునిక భావాలకది వుదాహరణగా చెబుతూ అలాటి ఆమె తనంతటతను సతి అయి వుండదని కొందరు సందేహిస్తున్నారు. సతికాండ పూర్తయ్యేవరకూ ఆమె తల్లిదండ్రులకీ సంగతి తెలీనివ్వకుండా దాచడం వెనక ఏమైనా ప్రత్యేక కారణంవుందా అని శంకిస్తున్నారు కొందరు.

సమయానికి తమకి సమాచారం అందనందున సతిని నిరోధించలేకపోయామని పోలీసు అధికారి చెప్పేరు. సతి గురించి రిపోర్టుచెయ్యడానికి ప్రజలెవ్వరూ ముందుకి రాలేదనీ సంగతి తెలిసి చూసి వచ్చిన ఓ పోలీసుకానిస్టేబులే యఫ్.ఐ.ఆర్. లాడ్జి చేశాడనీ మరో ప్రశ్నకి సమాధానంగా చెప్పేరాయన..."

"ఏమిటి మీరింకా ఇక్కడే వున్నారా?"

దాసప్ప మాటలకి వులిక్కిపడి పేపరు ప్రపంచంలోంచి బయటికొచ్చింది. దివ్య.

"మీరు మాట్లాడుతూండగానే మధ్యలో మంత్రిగారు రావడంతో వెళ్ళిపోయారు..."

"అంతా చెప్పేనుగా...ఇంకేం మాట్లాడాలి?" విసుక్కున్నాడు.

"మీరలా కోప్పడితేకాదు. కాస్త శాంతంగా కూర్చుని నాక్కొంచెం సాయపడరూ?"

అయిష్టంగానే కూర్చున్నాడు "త్వరగా

బయటపెట్టండి మీ అనుమానాలని. నా కవత లవనుంది..."

"మీ అక్కగార్నోసారి కలుసుకోవాలి"

"క్షమించాలి...ఆమె ఆరోగ్యం బాగుండలేదు. ఎవర్నీ కలుసుకోరు"

"పోనీ ఇంకెవర్నైనా..."

"పత్రికలవాళ్ళకి ఇంటర్వ్యూలివ్వగల స్థితిలో లేరెవరూ. కొడుకూ కోడలూ పోయారన్న పుట్టెడు దుఃఖంలో వున్నారంతా"

"నేను ఏమీ ప్రశ్నించను. ఒక్కసారి కలుసుకోనివ్వండి.."

"చూడమ్మాయ్... నా సహనాన్నింకా పరీక్షించొద్దు- ఇక వెళ్ళొచ్చు"

దానప్ప మాటలు కరుగ్గా గుచ్చుకున్నాయి.

సూటిగా అతడి మొఖంలో కోసారి చూసి లేచి వచ్చేసింది దివ్య.

యాత్రీకులంతా సతీస్థలాన్ని దర్శించడానికి నది ఒడ్డుపై వెళ్తోంటే దివ్య సోమయాజులు గారింటివైపు అడుగువేసింది.

సతీకాండకి పౌరోహిత్యం వహించిందాయనే!

ఆయనద్వారా కొన్ని కీలక ప్రశ్నలకి సమాధానం రాబట్టాలని దివ్య తాపత్రయం!



సోమయాజులుగారు సర్వం కోల్పోయినవారిలా కూర్చున్నారు. మూర్ఛేజుల్నుంచీ ఇదే వరస. అంటే దీపాసతి అయినప్పట్నుంచీ.





ఆయన అర్ధాంగి పార్వతి కళ్ళు నీళ్ళతో నిండిపోయాయి.

"మంచి తీర్థం ఇమ్మన్నారా?" మూగ బొమ్మలా వున్న భర్తతో అందామె. తల అడ్డంగా వూపారు.

"సతీమాతా... నువ్వే ఆయన్ని కాపాడాలి!" మనస్సులోనే ప్రార్థించిందామె.

ఆమె ఏడుస్తోందని అర్థమైనా కన్నెత్తిచూడ లేదు సోమయాజులు.

ఇదివరకెప్పుడైనా ఇలా నిర్వ్యాపారంగా మట్టిబొమ్మలా కూర్చునున్నారా? లేదులేదు. ఎప్పుడూ పూజలో, పునస్కారాలో, వేదపారాయణమో, పురాణ కాలక్షేపమో... వూపిరి పీల్చుకునే వ్యవధికూడా లేనట్లుండేవారు.

చుట్టుపక్కల పదిపదిహేను గ్రామాల్లో తనకెంత పేరుండేది?!

"సోమయాజులుగారు బ్రాహ్మణోత్తముడు, వేదవిదుడు. వేదాల్ని ఔపోసన పట్టిన అరుదైన మహాత్ముడు. ఆయన భార్య, ఆయనా నిజంగా పార్వతీ పరమేశ్వరులే..."

ఇలా ఎన్ని ప్రశంసలు! ఎంత గౌరవం!

ఆయన కళ్ళల్లో నీటి పొర కదిలింది. తుడుచుకునే ప్రయత్నం చెయ్యలేదు.

అంతా తనని పొగడినట్టే తనూ ఎంతో స్థితప్రజ్ఞుడిలా వుండేవారు, ఎలాంటి బాధలూ బలమైన కోరికలూ లేకుండాజితేంద్రియుడిలా తనకొకటే లోపంగా వుండేది.

యజ్ఞం చేసిన వారిని సోమయాజి అంటారు. తనేమీ చేయకుండానే తల్లిదండ్రులు పెట్టిన పేరువల్ల సోమయాజి అయ్యాడు. అయినా నిజమైన సోమయాజి అవ్వాలని అందునిమిత్తం ఓ యజ్ఞం చేయాలని ఎంతో కోర్గ్గా వుండేది. తపనగా వుండేది. కనీసం యజ్ఞంగాక పోయినా అందుకు సమానమైన ప్రత్యేకమైన మహోన్నతమైన కర్మకాండనేదో జరిపించాలని వువ్విళ్ళూరుతూండేవారు.

ఎట్టకేలకు సతీయజ్ఞానికి పౌరోహిత్యం వహించటంద్వారా తీరిందాకోరిక.

ఆనాటి సంగతులు కళ్ళ ముందు రూపుదాల్చాయి...

"సోమయాజులుగారూ సోమయాజులుగా

రూ'' ఉదయం తొమ్మిదిగంటల ప్రాంతాన వచ్చి పిలిచాడు సూరపరాజుగారి పాలేరు.

''ఏమిరా''

''తమర్ని అర్జెంటుగా రమ్మన్నారండి అయ్యగారు''

''వారబ్బాయి చనిపోయినట్టూ, శవాన్ని ఇంటికి తీసుకొచ్చినట్టూ ఇంతక్రితమే తెలిసింది. అటుకేసి వద్దామనుకుంటూండగా నువ్వొచ్చావు- వస్తున్నానని చెప్పు''

ఆయన వెళ్ళేసరికి వూరువూరంతా సూరపరాజుగారింటిముందే వుంది. ఎటు చూసినా విచార సముద్రపు కెరటాలే.

జాతస్య మరణం ధృవం.

పుట్టిన ప్రతిజీవీ గిట్టక తప్పదు.

అయినా చనిపోయినవారికోసం చనిపోబోయేవారు ఏడవటం సృష్టిచిత్రం!

సూరపరాజుగారి దగ్గరికెళ్ళారు. చేతి కందొచ్చిన చెట్టంత కొడుకు చెల్లిపోయాడని దుఃఖంతో నుళ్ళు తిరుగుతున్నారేమో ననుకున్న సోమయాజులు ఆయన్ని చూసి ఖంగుతిన్నారు.

ఆయన మొఖంలో దుఃఖపు నిడలు లేక పోలేదు. కానంతకంటే మరేదో కనిపిస్తోంది. ఏమిటిది? ఏదో సీరియస్‌గా ఆలోచిస్తున్నట్టూ ఏ యుద్ధానికో తలపడబోతున్నట్టుగా వున్నారు. కారణం ఏమైవుంటుంది?

ఏమీ అంతుబట్టలేదాయనకి.

ఆయన్ని చూస్తూనే ఎదురొచ్చి లోపలి గదిలోకి తీసుకెళ్ళారు సూరపరాజు.

''మా కోడలు సతి అవుతానంటోంది!''

చెవి పక్కనుంచి మిస్సెయిల్ దూసుకుపోయినట్టు అదిరిపడి చూశారు సోమయాజులు.

''ఏమిటి... ఏమిటి మీరనేది?''

''నిజంగానే ... సతినవుతానంటోంది...''

ఆయన మనస్సు లోలోపలి పొరల్లో నవ్వన్నరాలు నర్తించాయి!

భగవాన్! యజ్ఞం చెయ్యాలన్న నా కోర్కె ఈ రకంగా తీరబోతోందా? సర్వాంతర్యామీ! నీకీ బడుగు బ్రాహ్మణుడు వేలవేల దండాలర్పిస్తున్నాడు స్వీకరించవయ్యా! అనుకున్నారు.

''మీరు వేదపండితులు. సతి గురించీ సతీ మహాత్యం గురించీ మీకంతా తెలుసు. మా కోడలిద్వారా మేమూ మీరూ కూడా తరించబోతున్నాం. మన వూరికి శుక్రమహర్దశ పట్టబోతోంది ఈ కర్మకాండకి మీరే పౌరోహిత్యం వహించి అంతా నిర్విఘ్నంగా పూర్తిచెయ్యాలి''

సోమయాజులుగారి కళ్ళనుంచి ఆనంద భాష్పాలు జలజలా రాలాయి.

''దేవదేవా! ధన్యుడ్ని- ధన్యుడ్ని స్వామీ. నీవీ పేదభక్తుడిమీద చూపిస్తోన్న అపారకరుణా కటాక్ష వీక్షణాలకి ధన్యుడ్ని. నీకెప్పుడూ దాసానుదాసుడిగా వుండిపోతాను ప్రభూ!

ఆయన శరీరంలోని అణువణువూ పరమానందంతో పొంగిపొరలు తోంది

''సతీసాంప్రదాయానుసారం కోడలు పెళ్ళికూతుర్లా అలంకరించుకుని చితికెక్కుతుంది. పెళ్ళినాటి బంగారు నగల్ని ధరిస్తుంది. ఆ బంగారమంతా సతీయజ్ఞకర్త అయిన మీకే దక్కుతుంది...''

సూరపరాజుగారి మాటలకి సోమయాజులుగారి మొహంలో వెలుగు గుప్పుమంది.

పరమపావనకారుణ్యమూర్తీ! పరంలోనేగాక ఇహంలో కూడా ఆర్థికబాధలో వేదనలు లేకుండా దారిచూపిస్తున్నావా తండ్రీ. ఇకనుంచి పొట్టకోసం దేవుళ్ళాడకుండా నిత్యం నీ సేవలో తరిస్తాను తండ్రీ. ఈ కార్యాన్ని నిర్విఘ్నంగా నిర్వర్తించడానికి నాకు శక్తినియ్యి. చేయూతనియ్యి స్వామీ!

''అలాగే సూరపరాజుగారూ. ఇన్నేళ్ళకి మీ కోడలిరూపంలో మనం మన వూరూ తరించే మార్గం లభించింది. నిజంగా మీరు ధన్యులు సుమండీ...''

''వేదవాక్కులాంటి మీ వాక్కు వృధాపోదని మా నమ్మకం. కోడలికి సతీమహత్యం గురించి రెండు ముక్కలు చెప్పండి. ఎటువంటివారికైనా కొద్దో గొప్పో ప్రాణంమీద తీపివుండితీరుతుందికదా. ఆఖరికికొచ్చేక భీరువైతే మనందరికీ అప్రతిష్ఠ!''

''కాదుమరీ... అయినా అలా జరక్కుండా



అన్నీ నతీమణే చూసుకుంటుంది. మీరు నిర్భయంగా వుండండి...''

“దేవుడి ప్రతినిధిలాంటి మీరుండగా మాకు భయమేమిటి. మీరో రెండు పుణ్యావచనాలు చెబితే బావుంటుంది''

“అవశ్యం''

ఆడవాళ్లు సోమయాజులుగార్ని లోపలిగదిలోకి తీసుకెళ్లారు.

దీపానతి మూర్తీభవించిన శోకమూర్తిలా వుంది. ఒంటరిగా వగిలిన నావమీద సముద్రమధ్యలో చిక్కుకున్నదానిలా వుంది. జుట్టు విరబోసుకుని నేలమీద కూలబడి భోరుభోరున విలపిస్తోంది.

వట్టుమని పద్దెనిమిదేళ్ళైనా లేని ఆమెకొచ్చిన కష్టం తలచి చలించిపోయారాయన. పుత్రరక్షణాన గుండెనిబ్బరవరచుకుని ఓ వక్కనున్న కుర్చీలో కూర్చున్నారు.

దీపానతి ఆయన్ని గమనించలేదు. నిజానికామెకెవరూ కన్పించడంలేదు. అంతా చీకటి. కళ్లముందు చీకటి, గుండెల్లో చీకటి. మెదడులో చీకటి. బ్రతుకుచీకటి. భవిష్యత్తు చీకటి. ప్రవంచం చీకటి!

ఒకదీపం - తన పతిదీపం ఆరిపోయింది. పత్నికి ప్రత్యక్షదైవమైన పతి పరమపదించారు.

ఎలా ఎలా జరిగిందీ ఘోరం? తన సుఖం చూడలేని ఎవరు ఎవరిచ్చారీ ఘోరశాపం?

పెళ్లై ఏడాదికాలేదు. కాళ్ల పారాణి ఆరలేదు. పెళ్లికుమార్తె సిగ్గు పూర్తిగా తొలగలేదు. భర్తతో కలిసి ముచ్చటగా మూడు నెలలు కాపురం చెయ్యలేదు.

ఇంతలో ఎంత దారుణం! పిచ్చికమీద బ్రహ్మాస్త్రం వేసేశారు! తన కలలగూడుల్ని విధ్వంసం చేసేశారు! జీవన వృక్షపు మొదల్ని నరికేశారు!

అయ్యయ్యో! ఎంత అన్యాయం చేసేశారు! నేనేమైపోనూ? మోడులా ఎలా బ్రతకను? పదే పదే తలచుకుని మురవడానికైనా పట్టుమని పది తీపిగుర్తులు కూడా లేవే! పెళ్లయ్యాక జంటగా ఒక్క విహారయాత్రకీ వెళ్లలేదు. ఒక్క సరదా కూడా తీరలేదు. ఇంతలో ఎంత దారుణం జరిగిపోయిందీ!

పెళ్లయ్యాక తెలిసింది తన భర్త మురళి ఆరోగ్యం అంత మంచిదికాదని. అది ఇలా ప్రాణగండమై కూర్చుంటుందని తన బ్రతుకుని కాటేస్తుందని కలలో కూడా వూహించలేదు. ఏదో మామూలు అనారోగ్యమే అనుకుంది. మందులతో పత్యాలతో తగ్గిపోతుందనుకుంది. కాని కొద్దిరోజులక్రితం వూపిరినలపనంత దగ్గు వచ్చింది. రక్తవాంతి చేసుకొన్నారు. అంతా హడావిడిపడి ఆసుపత్రికి తీసుకెళ్లారు. తను తల్లడిల్లిపోయింది. పెనుగాలిలో చిగురుటాకులా కంపించిపోయింది. మర్నాడు మరిది వచ్చి మురళి ఆరోగ్యం కుదుటపడిందనీ, ఆపరేషన్ సక్సెస్ అయ్యిందనీ చెబితే ఎంత పొంగిపోయింది! ఎన్ని దేవుళ్లకి ఎన్ని కృతజ్ఞతలు చెప్పింది! ఎన్ని మొక్కులు కొత్తగా మొక్కింది!

కాని ఇంతలోనే ఓ వుదయం అగ్నిపర్వతం బ్రద్దలయ్యింది.

మురళి ఇక లేడులేడంటూ శవాన్ని తీసుకొచ్చి కటికనేలమీద పరుండబెట్టేశారు.

తనకి స్పృహ తప్పిందాదారుణ భీకరదృశ్యం చూసేసరికి.

స్పృహ వచ్చేసరికి గదిలో కుప్పలా పడి వుంది.

"అమ్మాయ్ దీపా"

సోమయాజులుగారి పిలుపుకి వులిక్కిపడి చూసింది.

ఆయన్ని గుర్తుపట్టింది. తన పెళ్లికి పౌరోహిత్యం వహించింది ఆయనే. సత్యన్నారాయణస్వామి వ్రతం, త్రిమూర్తులవ్రతం వగైరాలు చేయించింది ఆయనే. మొన్న మొన్న శ్రీరామ నవమికి తమ దంపతులచేత దేవుడి కళ్యాణం చేయించిందీ ఆయనే. తనెంతో భక్తిగా పూజలు చేయడంచూసి ముచ్చటపడిందీ, ధన్యురాలవంటూ పొగిడిందీ, దీర్ఘసుమంగళీభవ అని ఆశీర్వదించిందీ ఆయనే.

ఆ పూజలూ, పుణ్యాలూ ఏ ఎట్లోపడి కొట్టుకుపోయాయోగాని ఏవీ తన సౌభాగ్యాన్ని నిలవ లేకపోయాయి.

"నీకొచ్చిన కష్టం ఎవరూ తీర్చలేనిది, పూడ్చలేనిది..."

గంభీరంగా వున్న ఆయన మాటలకి అదిరిపడి చూసింది.

ఈయనెందుకొచ్చినట్టు? భర్తపోయిన దుఃఖంలో మ్రగ్గిపోతున్న తనకేం చెప్పాలని వచ్చినట్టు?

"నీకు తెలీందేముంది తల్లీ... పుట్టిన ప్రతి ప్రాణీ మరణించక తప్పదు. అంతా పోయేవాళ్లమే. ఎవరూ కలకాలం వుండరిక్కడ. కాదంటే కొందరు ముందు వెళ్తారు. మరికొందరు వెనక వెళ్తారు. అంతే తేడా. ఈ పుట్టుకలూ, చావులూ, బాధలూ, బంధాలూ అన్నీ దేహానికి తప్ప ఆత్మకి కాదు. ఆత్మకి చావులేదు. వస్త్రాల్ని విడిచినట్టు దేహాల్ని విడిచేస్తూంటుందంతే, పాపం పూర్తిగా ప్రక్షాళితమయ్యేవరకూ మళ్లీ మళ్లీ జన్మనెత్తక తప్పదు. మహర్షులూ, మహాభక్తులూ, మహాపతివ్రతలూ జన్మరాహిత్యం పొంది స్వర్గంలో భగవంతుడి సాన్నిధ్యంలో స్వర్గభోగాలనుభవిస్తారు..."

వైరాగ్యాన్ని నూరిపోస్తున్నారనుకుంది దీపానతి. తన దుఃఖాన్ని వలచన చెయ్యడానికీయ





న్ని నియోగించినందుకు అత్తమామలకి మన స్సులోనే కృతజ్ఞతలర్పించింది.

"మన పురాణాలని భక్తిగా పఠించినదానివి. పతివ్రతల కథలు కంఠస్థంచేసినదానివి. పతివ్రతాధర్మాలు తెలిసిన నారీశిరోమణివి. నీకు నేను కొత్తగా చెప్పేదేముంటుంది? అయినా రెండు ముక్కలు చెప్పటం నా ధర్మం గనుక చెబుతాను..." సోమయాజులుగారన్నారు.

వింతగా చూసింది దీపాసతి!

తనేదో భక్తురాలైనట్టు మాట్లాడతాడేమిటీ యన? తను పురాణాలని పఠించిందా? లేదే! మరీయన...!

"సతీసావిత్రి, సతీసులోచన, సతీఅనసూయ, సతీసుమతి, సతీసక్కుబాయి... ఇలా పతివ్రతలందర్నీ సతి అంటాం. సతి అంటే మహాపతివ్రత అనే అర్ధంలో విరివిగా వాడుతూంటాం. కాని నిజానికి సతి అంటే ప్రత్యేకార్ధం వుంది. పతివ్రతలు చాలామంది వుంటారు. కాని మహాపతివ్రతలు కోటికొక్కరుంటారేమో."

"మహాపతివ్రత అంటే ఎవరు?"

"మృత్యువు కూడా ఎవరినైతే తమ భర్త నుండి వేరుచేయలేదో ఆమెని మహాపతివ్రత అంటారు. ఇది సాధ్యమేనా? అసాధ్యంకాని అసంభవం కాదు. ఎలా సంభవం? భార్యభర్త తోబాటు నిజమైన సహగమనంచేసినప్పుడు. అంటే భర్త చనిపోతే అతడి శవంతోబాటు అతడి భార్య కూడా దహనమైతే ఆమెని సతి అంటారు. భర్త చితిపై భార్యని సజీవంగా దహనంచెయ్యటం లేదా భర్త శవంతోబాటు భార్యని సజీవంగా ఖననం చెయ్యటాన్ని సతీ లేక సతీసహగమనం అంటారు.

సర్వజనావళి పూజనీయులైన ముగ్గురు సతీమాతల గురించి వినేవుంటావు. వారు సతీసావిత్రి. సతీఅనసూయ, సతీపద్మిని.

వారేగాక ఇంకెందరో అనాదినుంచీ సతీమాతలవుతున్నారు. రామాయణంలో మేఘనాథుడి భార్య సులోచన సతిఅయ్యింది. భారతంలో పాండురాజు భార్య మాద్రి సతి అయ్యింది. ఇక చరిత్ర తిరగేస్తే లెక్కలేనన్ని దాఖలాలు కన్పిస్తాయి.

రణక్షేత్రంలో ఓడిపోయినప్పుడు లేక ఓడిపోతామనుకున్నప్పుడు విజేతయైన శత్రువు కోపదృష్టినుంచీ, కామదృష్టినుంచీ తమ సతీత్వాన్ని రక్షించుకోడానికి పరాజితరాజుల భార్యలు అగ్నిప్రవేశంచేసి ఆత్మహననం చేసుకునేవారు.

బూందీరాజు బుధసింగ్‌తోబాటు 84 మంది రాణులు సతిలయ్యారు. జోధ్‌పూర్ రాజు అజితసింగ్‌తోబాటు 64 మంది రాణులూ, రాజా ఇందర్‌తోబాటు ఏడుగురు రాణులూ జీవన బలిదానం చేశారు. ఓ రాచపుత్రుని వివాహమవుతోంటే వరుడు యుద్ధానికి వెళ్లవలసివచ్చింది. అతడు యుద్ధంలో మరణించగా అతడి పెళ్లికూతురు సతిఅయ్యింది.

మన ధర్మశాస్త్రాలు సతిని గట్టిగా సమర్థిస్తున్నాయి.

విష్ణుధర్మసూత్రాల్లో విధవాస్త్రీ జీవితాంతం బ్రహ్మచర్యమైనా అవలంభించాలి లేదా పతితోబాటు కాలిపోవాలని చెప్పబడింది. వృద్ధహారీత స్మృతిలో సాధ్వీమణులు భర్తతోబాటు దహనమవడం తప్ప వేరే ధర్మం లేదని ఘోషింపబడింది. పరాశర ఋషి సతియైన స్త్రీ మూడున్నర కోట్ల వత్సరాల దాకా స్వర్గంలోభర్తతోబాటు సుఖిస్తుందన్నారు..."

అడ్డూ అదుపూ లేకుండా సాగిపోతోందా యన వాక్ప్రవాహం.

దీపాకంతా అయోమయంగా వుంది. పని గట్టుకునొచ్చి ఇప్పుడిదంతా ఆయనెందుకు చెబుతున్నాడో అర్థం కాలేదు. చెప్పరాని భయం ఏదో మెల్లమెల్లగా ఆమెనాక్రమించేసుకోసాగింది.

పతి వినా సతికి బ్రతుకు లేదన్నది అక్షర సత్యం. స్త్రీ స్థానం మగాడి పాదాల దగ్గర. ఆ మగాడు మరణిస్తే ఆమెకి ఇంట్లోనే కాదు అసలు ప్రపంచంలోనే స్థానముండదు.

సృష్టిలోకెల్లా దౌర్భాగ్యమైన దుర్భరమైన జీవితం విధవది. పసుపూ కుంకుమలు ధరించరాదు. రంగు వస్త్రాలు ధరించరాదు. ఆభరణాలూ, గాజులూ, పూలూ ధరించరాదు. చప్పిడి మెతుకులు తినాలి. కటికనేల మీద పరుండాలి. ఎలాంటి శుభకార్యాల్లోనూ పాల్గొన

రాదు. అసలామె కంటబడితేనే అశుభమంటారు. ఒక్కమాటలో చెప్పాలంటే గృహలక్ష్మిలా వచ్చిన ఇంట్లో గృహ ఖైదీలా పడివుండాలి...!"

ఆ మాటలకి దుఃఖం పెల్లుబికి వచ్చేసింది దీపకి. తనని వితంతువుగా క్షణకాలం వూహించుకుని "లేదు లేదు" అంటూ ఏడ్చేసింది. వజవజా వణకిపోయింది.

అప్పుడెప్పుడో చిన్నప్పుడు మధుర వెళ్లినప్పుడు చూసిన వితంతువుల దుర్భర జీవిత దృశ్యాలు కళ్ల ముందు కదిలాయి!

కన్నప్రేగు తెంచుకుని పుట్టిన కొడుకు పెళ్లిలో సైతం దూరంగా అనామకంగా వుండాల్సి వచ్చినందుకు కుళ్లికుళ్లి ఏడ్చిన తమ దూరపు బంధువు గుర్తొచ్చింది!

త్వరగా చావొస్తే బావుండునని మూలగదిలో మునుగు దీసుకుని మూలిగే నానమ్మ గుర్తొచ్చింది.

బొట్టూ, కాటుకా, గాజులూ లేకుండా తెల్లబట్టలు ధరించి కోర్కెల్ని వూహల్ని ఆశల్ని సమాధి చేసి జీవశ్చవంలా చావుకోసం ఎదురు చూస్తూ, ఏడుస్తూ, ఆదర్శాలకీ అవమానాలకీ ఆంక్షలకీ బలవుతూ....

"వద్దు వద్దు. ఆ బ్రతుకొద్దు. ఈ బ్రతుకొక్కనాటికీ వద్దు. వద్దుగాక వద్దు..." హిస్టీరియా పేషంట్లా అరిచింది దీప.

సంతృప్తిగా చూస్తూ అన్నారు సోమయాజులుగారు.

"నీ భావం, నీ నిర్ణయం, నీ మార్గం సర్వదా హర్షణీయమమ్మా. నీవు నిజంగా చాలా అదృష్టవంతురాలివి. తపః సంపన్నులకిగాని లభించని అదృష్టం నిన్ను వరించిందమ్మా. గర్భిణీ స్త్రీలూ, పిల్లలున్న తల్లులూ, యుక్త వయస్సురాని ఆడపిల్లలూ సతీ సహగమనం చెయ్యడానికనర్హులన్నారు పండితులు. నీకలాంటి అడ్డంకులు లేకపోవడం, సతి అవడానికి పూర్ణ అర్హత కలిగి వుండటం నీ పూర్వ జన్మ పుణ్యఫలం! మహా స్త్రీలలా పుణ్యలోకాలకి బొందితో సహా వెళ్లబోతున్న నీకిన్ని మాటలు చెప్పాల్సిన పనిలేదు. ఏదో నా తృప్తి కోసం చెబుతున్నానంతే. నీ వల్ల మీ అత్తవారికి చెందిన అటు ఏడు తరాలూ ఇటు ఏడు తరాలూ ధన్యం కాబోతున్నాయమ్మా. నిజంగా నీవు మహా సాధ్వివి. సతి కావాలన్న నీ నిర్ణయానికి మనస్ఫూర్తిగా అభినందిస్తూ శిరస్సు వంచి పాదాభివందనం చేస్తున్నాను..."

ఆయన మాటలకి అవాక్కైంది. పిచ్చిగా చూసింది. నిలువునా వణకిపోయింది. భోరున ఏడ్చేసింది.

భోరున ఏడుస్తోంది దీప.

గట్లని కోసుకుని ప్రవహించే వుప్పెనలా దుఃఖం ఆమెని నిలువునా ముంచెత్తేసింది. ఆకాశం బ్రద్దలై కూలిపోతున్నట్టూ, భూమి చీలి లోలోపలికి లాగేసుకుంటున్నట్టూ ఫెళఫెళా రావాలతో ప్రకృతి భీభత్సనృత్యం చేస్తూ మీద కురుకుతున్నట్టు వుంది.

ఎటూ దారి కన్పించక, రక్షించేవారు లేక, ఆర్తనాదాలుచేస్తూ, హాహాకారాలు చేస్తూనే బలి పశువై మెడలో వేపరొబ్బ కట్టుకున్నట్టుగా వుంది.

ఆమె ధోరణికి ఆశ్చర్యచకితులయ్యారాయన. అంతలోనే అర్థం చేసుకుని సానుభూతిగా చూస్తూ అన్నారు.

"కన్నీటికిది సమయం కాదమ్మా. పతి వెంట పరలోకయాత్రకి సిద్ధపడ్డ మహాసాధ్వివి నువ్వు. సామాన్యురాలిలా బేలలా దుఃఖిస్తావెందుకు? నువ్వు సీతా సావిత్రిలాంటి మహా పతివ్రతల కోవకి చెందిన మహనీయురాలివి. బ్రహ్మాండాన్ని పిండి చేసెయ్యగల మహా శక్తివి నువ్వు. నీకు తిరుగులేదు. నీకు ఎదురులేదు.

ఆయన మాటలామెలో ఆవేశాన్ని రగుల్కొల్పాయి. వుద్రేకాన్ని వుద్దీపం చేశాయి.

ఆమెలో ఏవేవో కొత్త భావనలు. తనేదో గొప్పదైనట్టు, అసామాన్యురాలైనట్టు, ఇహలోక సుఖదుఃఖాలకి అతీతమైన దేవతా స్వరూపమైనట్టు నూతన వూహలు.... కమ్మని కల్పనా లోక మధురిమలు... మహత్యాల కథలు...

"చక్కని వస్త్రాలూ, ఆభూషణాలూ, కుంకుమా, పూలూ లేక నవ్వూ,సుఖం,తీయని అనుభూతీ లేక మోడులా, బోడిలా, విధవలా, జీవశ్చవంలా బ్రతుకునీడ్చకుండా అందరి ప్రశంసలకీ పూజలకీ పాత్రమయ్యే సతీమాతవి. జగన్మాతవి. మమ్మల్ని చల్లగా దీవించు మహా





తల్లీ! మహేశ్వరీ! జగదాంబా!"

చేతులు జోడించారాయన భక్తితో.

దేవతా విగ్రహంలా చూస్తూండిపోయింది దీప.

ఆనందభాష్పాలు రాలుస్తూ లోపల్నుంచొచ్చిన సోమయాజులు గార్నీ దానప్పా, తదితరులూ చుట్టుముట్టేశారు.

"ఏమంటోంది ఏమంటోంది"

అందర్లోనూ ఆదుర్దాయే!

"ఏమనేదేముంది. సూరపరాజుగారూ వారి వంశమూ మనమూ మన వూరూ ధన్యం. మన గ్రామం నిజంగా దేవపురమే. ఒక దేవత మన వూరి ఇలవేల్పు కానున్నది. ఇదంతా చూడగల అదృష్టం దగ్గరుండి జరిపించగల మహా అదృష్టం నాకు దక్కడం నా పూర్వజన్మ సుకృతం"

దానప్పా మరి ముగ్గురూ లోపలికెళ్లి ఒక రకంగా బలవంతంగా దీపని హాల్లోకి తీసుకొచ్చారు.

"ఆఖరిసారిగా నీ భర్తని చూసుకో. భర్త లేకపోతే భార్యకి బ్రతుకులేదని స్మరించుకో. చావుకోసం నిరీక్షిస్తూ జీవశ్శవంలా బ్రతికే విధవలాంటి దానిని కాదని అందరికీ చెప్పు. నువ్వు నీ భర్తని మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నావని ఋజువు చేసుకో. నీవు గొప్ప పతివ్రతవని అందరికీ తెలిసేలా చెయ్యి! సతినవుతానంటున్నావా? భర్త చేయి పట్టుకుని నిప్పుల్లోంచి నడిచి స్వర్గలోకం వెళ్లి పోతానంటున్నావా...? ఊ... చెప్పు" ఆమె చెవిలో ఊరిమారు అందరూ కలసి.

దుఃఖం ముంచుకొచ్చేస్తోంది దీపకి.

ఓ ప్రక్క పుణ్యలోకాల మోహం గేలంవేసి లాగేస్తోంది.

మరోప్రక్క విధవ నరక జీవితం వికృతంగా నర్తిస్తూ భయపెడుతోంది.

నీ ప్రేమ గొప్పదనీ, నువ్వు గొప్పదానివనీ, నలుగురికీ తెలిసేలా సాహసం చెయ్యమంటోంది మనస్సులోని ఓ గొంతు.

భర్త పోయాక, అయిదోతనం రాలిపోయాక, బ్రతికినా చచ్చినా ఒకటేనని వైరాగ్య భావం అరుస్తోంది.

ఆమె మెదడు పని చెయ్యడం మానేసింది.

ఒక రకమైన మైకంతో వూగిపోతూ, "నేను సతినవుతాను. సతినవుతాను" అని అరిచి లోపలికి పరుగున వెళ్లిపోయిందామె.

అంతవరకూ జరుగుతున్న సంగతులు తెలీని బంధుజనం ఈ మాటతో అదిరిపడ్డారు. చూడవచ్చిన జనం నిశ్చేష్టులయ్యారు. కొందరు కలవరపడ్డారు. కొందరు అపనమ్మకంగా చూశారు. కొందరు ముక్కుమీద వేలువేసుకున్నారు. కొందరు భయంగా చూశారు. మరి కొందరు చేతులు జోడించి 'సతీమాతకీ జై' అని అరిచారు.

మరుక్షణం 'దీపసతికీ జై దీపామాతకీ జై' అను నినాదాలతో ప్రతిధ్వనించిందా ఇల్లూ, ఆ వూరూ!

క్షణాల్లో వార్త వూరిని చుట్టేసి పొలిమేరలు దాటేసింది.

జనం వివిధ కులాలకీ మతాలకీ చెందిన జనం చేతుల్లోని పనులు వదులేసి పరుగుపరుగున ప్రవాహంలా రాసాగారు. దేవతనీ దైవలీలనీ కళ్లారా చూడాలని ఆరాటంగా పడుతూ లేస్తూ పరుగున పరుగున రాసాగారు.

సతి చితి కోసం చకచకా ఏర్పాట్లు జరిగిపోయాయి.

పోలీసులకి సమాచారం అందకుండా అందినా కార్యం పూర్తయ్యే వరకూ రాకుండా ఏర్పాట్లు చేశారు కొందరు.

చితిని శ్మశానంలోగాక నది ఒడ్డునున్న సూరపరాజుగారి తోటలో ఏర్పాటు చెయ్యటం చూసి ఆశ్చర్యబోయారు కొందరు. ఆరా తీయాలని ప్రయత్నించి విఫలురయ్యారు కొందరు.

ఇంతలో "సతీ మాత మందిరం కట్టొద్దూ?" అన్నారెవరో.

"అవునవును. చందాలు వసూలు చెయ్యాలి" జవాబిచ్చాడు దానప్ప.

దీపాదేవికి పెళ్లి నాటి వస్త్రాలూ ఆభరణాలూ కట్టబెట్టి పెళ్లి కూతుర్లా అలంకరించారు. గోరింటాకు తెచ్చి అరచేతులకి రాశారు.

మనస్సు దిటవు చేసుకుని మౌనంగా వుంది దీప.



కన్నీళ్లిప్పుడు రావటంలేదు. చావంటే భయమూలేదు.

ఏదో మొండి ధైర్యం ఆవహించినదాన్లా వుంది.

అంతా తనని స్తుతిస్తూ సాగిలబడి మ్రొక్కుతోంటే ఎంతో వింతగా వుంది. గొప్పగా వుంది. గర్వంగా వుంది.

భర్త చిటికెనవ్రేలు పట్టుకుని పుష్పక విమానం ఎక్కి వెళ్లగా స్వర్గద్వారాలు వాటికవే తెరచుకున్నట్టూ, సమస్త దేవతలూ పూలవాన కురిపించినట్టూ, గంధర్వులు విజయగానం చేసినట్టూ అప్సరసలు అభివందన నృత్యం చేసినట్టూ - ఎన్నెన్నో రకరకాల రంగురంగుల వూహాచిత్రాలామె మదిలో వూపిరి పోసుకుంటున్నాయి.

త్వరత్వరగా తెమలమని కొందరు తొందర పెడుతున్నా తొణక్కుండా బెణక్కుండా పూజా మందిరంలోకెళ్లి దేవుళ్లకి నమస్కరించి తననీ, భర్తనీ వారిలో ఐక్యం చేసుకొమ్మని ప్రార్థించింది. పెరట్లోని తులసికోటకి ప్రణమిల్లింది. భర్త శవపు కాళ్ల దగ్గర తలవుంచి ప్రణామం చేసింది. అత్తమామలకి పాదాభివందనం చేసింది.

అరచేతుల్లో కొబ్బరిబొండం వుంచుకుని పాడెముందు నడిచింది దీప.

పెళ్లి వూరేగింపులా సాగింది శవయాత్ర.

★ ★ ★

శవయాత్ర వీధి మార్గాన కాక సూరపరాజుగారింటి ప్రక్కనున్న పెరటిదారి గుండా వెళ్లి వారి తోటలో ప్రవేశించి అటునుంచే నది ఒడ్డుకెళ్లారు.

ఇది సత్సాంప్రదాయం కాదని గొణిగినవారికి పోలీసులొచ్చే అవకాశం వుంది గనుక దగ్గరి దారి పట్టామన్నారు. శుభఘడియలు మించిపోకూడదన్నది కూడా ఓ కారణమని చెప్పేరు.

ఏమైతేనేం వదంగల్లో చితి ప్రవేశాన్ని చేరింది వూరేగింపు.

వీరు వెళ్లేసరికి చితి ఏర్పాట్లు పూర్తయ్యాయి. జనం తోసుకు రాకుండా చితి చుట్టూ ఇరవై అడుగుల వ్యాసార్థంతో కర్రల దడి కట్టారు. తలపాగాలూ కరవాలాలూ ధరించిన రాజపుత్ర యువకులు సిద్ధంగా వున్నారు.

చితిని సమీపిస్తోంటే దీప కాళ్లు వణకసాగాయి. వెన్నులోంచి భయం సన్నగా పుట్టుకు రాసాగింది. గుండెల్లో వ్యాఘ్రాల అరుపులు ప్రతిధ్వనించసాగాయి.

సోమయాజులుగారు చెప్పినట్టుగా చితి చుట్టూ మూడుసార్లు తిరిగింది. మృత భర్తకి పాదాభివందనం చేసింది. జనానికి చేతులు జోడించి నమస్కరించింది.

పిమ్మట చితినెక్కి భర్త తలని ఒడిలో వుంచుకుని పద్మాసనం వేసుక్కూర్చుంది. జనం జయజయధ్వానాలు చేస్తోంటే భయం హెచ్చి చెయ్యి అడ్డంగా వూపింది. ఏదో చెప్పాలని అరవాలని ప్రయత్నించింది గాని గొంతులోంచి మాటవూడిపళ్లేదు.

ఆమె చెయ్యి వూపటం చూసి అభయహస్తం పట్టి దీవిస్తోందనుకుని దండాలు పెట్టేశారు. ఆమె అరచేతిలోని గోరింటాకు రంగు అప్పుడే చూసిన కొందరు 'సతీమాత చిహ్నం' అని అరిచారు.

"'సతీ మాత దీవిస్తోంది', 'సతీమాత మహాత్మ్యం ! దీపామాతా మమ్మల్ని దీవించు"

అరచేతులు ఎర్రగా మారటం ఓ అద్భుతంగా ఓ మహాత్మ్యంగా ఫీలవసాగారు జనం! వేలాది జనం! జన సముద్రం!

కరవాలాలు ధరించిన యువకులు చితిచుట్టూ తిరుగుతూ దుష్టశక్తులు సతీమాత. శక్తుల్ని హరించకుండా పహరా కాస్తున్నారు.

డప్పులు మ్రోగాయి.

శంఖాలు నినదించాయి.

"సతీమాతకీ జై, దీపా మాతకీ జై" అంటూ జనం నినాదాలు చెయ్యసాగారు.

వూళ్లోని ప్రతి ఇంటి నుంచీ వచ్చిన నేతి డబ్బాలలోని నేతిని చితిమీద పోసి నమస్కరించారు.

సోమయాజులుగారు ఉచ్ఛస్వరంతో గాయత్రీమంత్రాన్ని పఠించసాగారు.

అప్పుడు-

మురళి తమ్ముడు చితికి నిప్పంటించాడు.

 

మంటలువొక్కసారే ఎగిశాయి.

ఇంతలో...

ఎవరూ వూహించని ఘటన జరిగింది.

ఆ సంఘటన గుర్తొచ్చేసరికి సోమయాజులు గారి మనస్సుచెదరిపోయింది. దాన్ని తలచుకోడానికే జంకేరు.

అంతవరకూ తనేదేదో అనుకున్నారు. పతివ్రతా మహత్యమనీ సతీమాత ఆశీర్వాదమనీ అనుకున్నారు. దైవ ప్రేరణ అనుకున్నారు. కాని ఆ సంఘటన ఆయన భావాలని పటాపంచలు చేసింది. అదంతా వట్టి భ్రమా, కల్పనా తప్ప యదార్థం కాదని మొఖం మీద గుద్ది మరీ చెప్పింది.

సజీవదహనమంత క్రూరకృత్యం మరోటి లేదనుకున్నారు. తన నమ్మకాలూ జనం విశ్వాసాలూ అర్థం లేనివన్పించాయి.

అయినా నిరోధించలేని అసహాయులయ్యారు. ముందుకేసిన అడుగు వెనక్కి తీసుకోలేకపోయారు.

గనుక దీప సతీమాత అయిపోయింది.

అన్ని కార్యక్రమాలూ యధావిధిగా పూర్తి చేసి ఇంటికొచ్చారు సోమయాజులుగారు.

"దీపామాత ఎంత పుణ్యాత్మురాలండీ. బొందితోనే స్వర్గానికెళ్లి పోగలిగింది" అందాయన భార్య పార్వతి.

"అవును. భర్తంటే ఆమెకి అపారమైన అనురాగమంటున్నారు"

ఆమె మాట్లాడలేదు. భర్త ధోరణి చిత్రంగా అన్పించిందామెకి.

"పార్వతీ ఒక్క మాట. నేనొకటి అడుగుతాను మనస్ఫూర్తిగా జవాబిస్తావా?"

"దేని గురించండీ"

"నువ్వు నన్ను ప్రాణప్రదంగా ప్రేమిస్తున్నావా?"

"అదేం ప్రశ్న. నేనేమిటో నా మనస్సేమిటో మీకు తెలీదూ? పెళ్లైన ముప్పై అయిదేళ్లకి మీకెందుకా సందేహం వచ్చింది?"

"అది కాదు...." నాన్నారు.

"ఏమిటో చెప్పండి"

"ఇంతవరకూ ఏ భర్తా ఏ భార్యనీ అడగని కోరిక అడగాలనివుంది"

"ఎవరూ అడగని కోరికా? అడక్కూడని కోరికా?"

"ఏదైతేనేం గాని నేను చనిపోయాక నువ్వు నాతోబాటు సతివవుతావా?"

నెత్తిమీద పిడుగుపడ్డట్టు తుళ్లిపడిచూసింది. మ్రాన్పడిచూసింది. ఆ పిమ్మట ఆయన కాళ్ల మీద కూలబడి భోరున ఏడ్వసాగింది.

అది ఆయన ఆశించని సమాధానం. ఆమె నిజమైన పతివ్రత కాదేమో అన్పించింది. ముఖం త్రిప్పేసుకున్నారు.

అదిగో ఆ క్షణం నుంచి సోమయాజులుగారు మట్టి బొమ్మైపోయారు. చైతన్య రహితులైపోయారు.

ఆలుమగల మధ్య మాటలు లేవు.

అదంతా గుర్తురాగా వున్సురంటూ నిట్టూర్చారు సోమయాజులుగారు.

దివ్య ఆయనింటి ప్రాంగణంలో అడుగుపెట్టింది.

"నమస్తే"

నుదురు చిట్లించి చూశారాయన.

"నా పేరు దివ్య. పత్రికా విలేఖర్ని. మీతో కొంచెం మాట్లాడాలని వచ్చాను"

"క్షమించండి. ఇప్పుడు నేనేమీ మాట్లాడలేను"

"అలాగనకండి. ఎంతో ఆశతో వచ్చాను. మీరు వేదాలనీ పురాణాలనీ ఔపోసన పట్టిన పండితోత్తములు. మీతో రెండు నిమిషాలు ముచ్చటించే అవకాశం ఇవ్వండి"

కాదన్లేకపోయారు ఆమాటలకి, ఏవిటన్నట్టు చూశారు.

"వైదిక యుగంలోని గ్రంధాల ప్రకారం విధవ కావడం దుర్భాగ్యమూ కళంకమూ కాదు. వారికి పునర్వివాహం చేసుకునే హక్కుందని కూడా చెప్పాయి. అధర్వణవేదంలో విధవ పత్ని తన మృత భర్త దేహం ప్రక్కన పడివుంటే ఆమె మరిది లేదా ఇతరులెవరైనా ఆమెని లేవనెత్తి పునర్వివాహం చేసు

కోవచ్చనివుంది. అంటే అధర్వణవేదం సతికి వ్యతిరేకంగా పేర్కొన్నట్టే కదా!

ఆధునిక పరిశోధకుడొకాయన తన గ్రంథంలో బూటకపు ఆడంబరాలకు వశమై చాలాసార్లు విధవలకి మందులిచ్చి అర్ధచేతనావస్థలో సతిని చేయటం జరిగేదని పేర్కొన్నారు.

మనిషి సాటి మనిషిని సజీవంగా దహనంచేసి ఆ దహనకాండకి గొప్ప పేర్లు పెట్టడం హేయమూ, రాక్షసత్వమూ కాదంటారా?

మనిషి ఔన్నత్యాన్ని పెంచేందుకు మానవ వికాసానికి తోడ్పడేందుకూ వేదాలూ, పురాణాలూ పుట్టాయి తప్ప మనుమల్ని అమానుషత్వానికి పూనుకోమని కాదుకదా సతీ దురాచారానికి వేదాల, హిందూమతగ్రంథాల, ధర్మశాస్త్రాల అనుమతి లేదని ప్రముఖ పండితులూ, చరిత్రకారులూ అభిప్రాయపడుతున్నారు. మీరేమంటారు?

సతిపేర బహిరంగ హత్యాకాండలో ప్రత్యక్షంగా పాల్గొన్న మీరింకా సతిని సమర్థిస్తున్నారా చెప్పండి?''

ఆమె ఆవేశానికి చిన్నగా నవ్వేరు. ''సతి గురించిమాట్లాడే ఓపిక లేదిప్పుడు. మరోసారి మాట్లాడుకుందాం''

''అది కాదండీ...''

''ష్...''

''పోనీ ఇది చెప్పండి. దీపాదేవి తనంతటతాను సతి కావాలనుకోలేదని, బలవంతంగా అందుకు పురిగొల్పబడిందనీ అంటున్నారు కొందరు. అది హత్యానేరమవుతుంది గనుక అందుకు సంబంధించిన అందర్నీ అరెస్ట్ చెయ్యాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తున్నారు. మీరేమంటారు?''

ఆయన ముఖం ఘ్లానమయ్యింది.

ఆ సంగతి తనూ విన్నాడు. పోలీసులు రంగంలోకి దిగితే తననీ కస్టడీలోకి తీసుకోవచ్చేమోనని గుండెలదురుతూనే వున్నాయి. ఇప్పుడీ అమ్మాయి హత్య అన్నపదం ప్రయోగిస్తోంది. ఒకవేళ హత్యగా కేసు రిజిస్టర్ చేసుకుంటే తననీ నిందితుడిగా...

దీప దహనానికి ముందు జరిగిన సంఘటన వద్దనుకున్నా గుర్తొచ్చింది.

అదంతా బయటపెడితే తనూ దోషి అవుతాడు. అప్పుడెవరు రక్షిస్తారు తనని? పుణ్యానికిపోతే పాపం ఎదురైనట్టుగా వుంది తన పరిస్థితి. పైగా సూరపరాజులాంటి నాయకుల నాలిక రెండువైపులా పదునున్న కత్తిలాంటిది. దాన్నెవరు విశ్వసించగలరు?

ఆయన్లోని అంతఃఘర్షణని ఆయన ముఖంలో స్పష్టంగా చూసిందామె.

కొన్ని క్షణాలయ్యాక అంది- ''పదమూడోరోజున చున్రీ ఉత్సవం గొప్పగా చెయ్యాలనుకుంటున్నట్టు తెలుస్తోంది. అది నిర్విఘ్నంగా జరుగుతుందంటారా?''

''భగవత్కార్యాన్నెవరూ ఆపలేరు. ఆపాలనుకున్నవారు రక్తం కక్కుకుని ఛస్తారు. నిరోధించాలని వస్తే రక్తం ఏరులై పారుతుంది తప్ప కార్యక్రమం ఆగదు. ఆగనివ్వదు సతీమాత. సతీమాత మహత్యమేమిటో ఆంగ్లవిద్య ముక్కునబట్టి మిడిమిడి జ్ఞానంతో ఎరిగివడే మీరూ మీలాంటివారూ ప్రత్యక్షంగా చూద్దురుగాని''

అంతవరకూ అదోలా వున్న ఆయన ఒక్కసారే ఉగ్రులైపోయారు. జంధ్యాన్ని సవరించుకుంటూ లేచి పచార్లు చేస్తూ ఆంగ్లవిద్యనీ, నాస్తికుల్నీ ప్రభుత్వ విధానాలనీ పెద్దగొంతుతో తూర్పారబట్టసాగారాయన.

తనలోని ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్‌ని కప్పిపుచ్చుకోడానికిఅన్నిమాటలుమాట్లాడుతున్నారని భావించింది దివ్య. అంతా మౌనంగా వింటూ కూర్చుంది. దాంతో సోమయాజులుగారు విస్తుబోయి వెర్రిగా చూశారామెని.

''మీ అభిప్రాయాలని క్రోడీకరించి సూటిగా చెప్పాలంటే విధవలకి జీవించే హక్కులేదంటారు. వాళ్లు బ్రతకడానికి అనర్హులంటారు. వాళ్లని వారి భర్త శవంతోబాటు కాల్చి చంపేయాలంటారు...''

అలా అడుగుతోంటే దివ్య గొంతు జీరబోయింది. కళ్లల్లో సన్నటి కన్నీటిపొర లీలగా కదిలింది.

ఆయన కోపంగా ఏదో అనబోయి ఆమెస్థితి





చూసి నిగ్రహించుకున్నారు.

"అలా అని నేనడం లేదు. శాస్త్రాలంటు న్నాయి. శాస్త్రాలు కూడా విధవలందర్నీ ఒకే గాట కట్టడం లేదు. విధవలంతా సతీమాతలు కాలేరు. అవుదామన్నా గర్భిణీలు మొదలైన కొందరి విషయంలో శాస్త్రం సమ్మతించదు"

"బావుంది. కాని ఈ రూలు పురుషుడికి వర్తించదు. భార్య చనిపోతే ఆమెతోబాటు ఆమె భర్తని చనిపొమ్మనరు. మళ్లీ పెళ్లిపీటల కెక్కమంటారు. మగాడికో నీతి, ఆడదానికో నీతి, మగాడికోన్యాయం ఆడదానికోన్యాయం! ఎందుకండీ ఇంత అంతరం? కేవలం లింగభేదంవల్ల మనిషి సాటిమటిషిని హీనంగా చూడాలా? దారుణంగా అణచెయ్యాలా? ఎందుకండి? ఏం బావుకుందామని?"

"చూడమ్మాయ్. నీవు చిన్నదానివి. ధర్మసూక్ష్మాలని అర్థం చేసుకోగల శక్తీ వయస్సూ నీకు లేవు. "అధమతె అధమఅతి నారి" అన్నారు తులసిదాసు రామాయణంలో. అంటే నీచుల్లోకెల్ల నీచమైనది స్త్రీ. "నస్త్రీ స్వాతంత్రమర్హతి" అన్నారు. అంటే స్త్రీ స్వేచ్ఛకి అర్హురాలు కాదు. ఆమె ఎప్పుడూ అంటే చిన్నతనంలో తండ్రి చాటున, పెళ్లయ్యాక భర్త చాటున, వృద్ధాప్యంలో బిడ్డలచాటున వుండాల్సిందే. "భూషణంత పతిః స్త్రీణాం" అన్నారు. అంటే స్త్రీకి పతియే అలంకారం. కేవలం అలంకారమేకాదు పతియే ప్రత్యక్షదైవం అని కూడా అన్నారు. ఈ కట్టడులూ, నియమాలూ సంఘశ్రేయస్సునీ, కుటుంబ కట్టుబాటునీ, సామాజిక జీవనాన్నీ దృష్టిలో పెట్టుకుని మహర్షులు నిర్దేశించినవి. వాటిని తు.చ. తప్పకుండా ఆచరించటం తప్ప తప్పులెంచగలవాళ్లం కాదు మనం" అంటూనే "ఇహ శలవు" అని చెప్పేసి లోపలికెళ్లిపోయారు సోమయాజులుగారు.

ఎన్నో ప్రశ్నలెయ్యాలని ఆవేశపడుతోన్న దివ్య ఆయన ప్రవర్తనకి హతాశురాలయ్యింది. శిలాప్రతిమలా కూర్చుండిపోయింది చాలా సేపు.

ఏదో పనిమీద వీధిలో కొచ్చిన పార్వతి ఆమెవంక ప్రశ్నార్థకంగా చూసింది.

"మీరు సోమయాజులుగారి భార్యా?"

తలాడించింది.

"దీపాసతి గురించి మీ అభిప్రాయం నిర్మొహమాటంగా చెప్పగలరా?"

ఆమె గాఢంగా నిట్టూర్చింది.

"నా కాపురం కూల్చడానికే ఆవిడ సతి అయ్యింది"



యస్సై సుబ్బారాయుడు జుట్టు పీక్కుంటూ కూర్చున్నాడు పోలీస్‌స్టేషన్లో.

గత మూడు రోజుల్నుంచీ అతడు చేస్తున్న పనులు రెండే- జుట్టు పీక్కోవడమూ, గోళ్లు కొరుక్కోవడమూనూ.

ఎప్పుడేమవుతుందో, ఏది ఏ మలుపు తిరుగుతుందో, ఏ ప్రక్కనుంచి పిడుగొచ్చి తనమీద విరుచుకుపడుతుందోనని ఒకటే భయంగా, ఆరాటంగా, అలజడిగా వుందతడికి.

దేవపురం అతడి స్టేషన్ పరిధిలోకే వస్తుంది. అక్కడ మూడురోజులక్రితం సతి అయ్యింది దీపాదేవి. ఆ సతిని తను నిరోధించలేకపోయాడు. అప్పట్నుంచీ ఏంచెయ్యాలో ఏం చెయ్యకూడదో తోచకుండా అయోమయంగా వుందతడి పరిస్థితి. ఉరుమురిమి మంగళంమీద పడదుకదా అని గుండెల్లో అదురుగా వుంది.

టేబుల్ మీదున్న వార్తాపత్రికలన్నిటినీ మరో సారి తిరిగేశాడు. అన్నీ సతి గురించి బాక్సుకట్టి మరీ ప్రత్యేకంగా రాశాయి. పోలీసులు ఎలాంటి చర్యా తీసుకోలేదని విమర్శించాయి. పోలీసుశాఖనీ, ప్రభుత్వాన్నీ దుమ్మెత్తిపోశాయి. దీపాదేవి బహిరంగంగా హత్య చేయబ





డిందనీ అయినా పోలీసులు నిమ్మకి నీరెత్తిన ట్టు కూర్చున్నారంటూ పోలీసుల ఇనేక్షన్‌ని ఖండించాయి.

హత్యకి బాధ్యులైనవారిని అరెస్టు చెయ్యాలనీ, తగినచర్య తీసుకోవడంలో విఫలమైన పోలీసు అధికారుల్ని సస్పెండ్ చెయ్యాలనీ డిమాండ్ చేశాయి- పత్రికలూ మహిళా సంఘాలూ.

ఇంతవరకూ పై అధికారులనుంచిలాంటి ఆర్డర్లూ రాలేదు. ఏ క్షణంలోనైనా ఎలాంటి ఆర్డర్లయినా రావొచ్చు. సాధారణంగా ఇలాంటి సంఘటనల్లో తనలాంటి వాళ్లని గినీపిగ్స్‌చేసి చేతులు దులిపేసుకుంటారు!

ఆనలవాళ తను సతిని ఆపాలనే అనుకున్నాడు. కాని...

ఆవాళ జరిగిందంతా గుర్తొచ్చింది సుబ్బారాయుడికి.

ఉదయం ఎనిమిదిగంటల ప్రాంతంలో సుబ్బారాయుడు గెడ్డం గీసుకొంటోంటే ఓ పీసీ వచ్చాడు.

"గుడ్‌మార్నింగ్ సార్"

"ఏవేఁయ్"

"ఇప్పుడే ఒకవార్త అందింది సార్. హెడ్డుగారు మీకు చెప్పమని తరిమారు"

"ఏం వార్తేమిటి?"

"దేవపురంలోని సూరపరాజుగారి కోడలు సతి కాబోతున్నదంటండి"

అదిరిపడ్డాడు "ఏవిటీ... సతి...? అంటే ఆయన కొడుకు..."

"రాత్రి అనుపత్రిలో చనిపోయాడంట సార్"

"చ్చా చ్చా... ఎవరు రిపోర్టు చేశారు?"

"ఎవరూ చెయ్యలేద్సార్. ఎలాగో ఊరివాళ్లకి తెలిసింది. సతీసహగమనం చూట్టానికి చాలామంది తరలి వెళ్తున్నార్సార్"

"అలాగా. మన వాళ్లందర్నీ రెడీగా ఉండమని చెప్పు. సి.ఐ.కి మెస్సేజ్ పంపండి. నేనిప్పుడే వచ్చేస్తాను. అంతా వెళ్లి ఎలాగైనాసరే సతిని నిరోధించాలి. ఊఁ... క్విక్..."

హడావుడిగా బాత్‌రూమ్‌లో దూరాడు.

"నీరజా... టిఫిన్ అర్జంటో" డ్రెస్ వేసుకుంటూ కేకపెట్టాడు.

"ఇప్పటిదాకా బాగానే వున్నారుకదా ఇంతలో ఏమొచ్చింది?"

"పోలీస్‌మెడల్ వచ్చే అవకాశం వెదుక్కుంటూ వచ్చిందే"

"ఏమిటీ!"

"అవునేఁయ్. ఈ కాలంలో కూడా అక్కడక్కడా సతీసహగమనాలు జరుగుతున్నాయి తెలుసా. ఇప్పుడు నా ఏరియాలో కూడా జరగబోతోంది. నేవెళ్లి అది నిరోధిస్తాను. దాంతో చచ్చేంత పబ్లిసిటీ వచ్చేస్తుంది నాకు. ఇంక పోలీస్‌మెడల్ ఇవ్వక ఛస్తారా?"

"ఏమిటి... మీరు... సతిని నిలుపుతారా? సతీమాత శపిస్తుందండీ"

"ప్... అలాంటి సెంటిమెంట్స్ పెట్టుకోకు"

"మీకు తెలీదండీ. పైగా జనానికి నమ్మకం ఎక్కువ. అడ్డొచ్చారని వాళ్లంతా కలిసి మీమీద పడితే..."

"నీవన్నీ పట్టి భయాలే నా సంగతి తెలుసుకదా. చాలా తెలివిగా టేకప్ చేస్తాన్లే. 1984 అక్టోబర్లో ఏం జరిగిందో తెలుసా? జైపూర్ దగ్గర్లోనిదేవీపురంలో ఒక రాజపుత్రుడు చనిపోయాడు. అంతా అతడి విధవని సతికమ్మని ప్రోత్సహించారు. ఆ సమాచారం అందగా పోలీస్ అధికారి ఆరెస్ గుప్తా హుటాహుటిన ఫోర్సుతోసహా చితిస్థలానికెళ్లాడు. అప్పటికే యాభైవేలమందివరకూ జనం పోగైవున్నారు. పోలీసుల్ని చూసి గొడవ చేశారు. గుప్తా ఏం చేశాడో తెలుసా? ఓ పెద్ద బండమీద నిలబడి 'మేం సతీ ఆచారానికి వ్యతిరేకులం కాదు. మీలాగే దర్శించి కొబ్బరికాయలు కొట్టడానికొచ్చాంగాని సతిని ఆపడానికొచ్చాదు. కొన్ని హిందూ ధర్మగ్రంథాలలో స్పష్టంగా పేర్కొన్నట్టు ఏ స్త్రీ సతీ అవుతుందో ఆమె శరీరంనుంచి అగ్ని పుడుతుంది. అంతే తప్ప చితిని ప్రజ్వలించాల్సిన అవసరం లేదు. అంచేత మనమంతా ఆమెనుంచి అగ్ని పుట్టేదాకా నిరీక్షిద్దాం" అన్నాడు. అంతా అంగీకరించి కూర్చున్నాడు. సాయంత్రమయ్యిందిగాని అగ్ని పుట్టన్నారు.అప్పుడా పోలీసు అధికారి మళ్లీ లేచా



డు. "హిందూ ధర్మం ప్రకారం ఒకరోజు ముగి సేలోగా శవానికి దహనసంస్కారం చెయ్యాలి- సతి శరీరంనుంచి అగ్ని పుట్టేట్టు లేదు గనుక శవానికి అంత్యక్రియలు జరిపించటం ఉత్తమం"

దాంతో జనంలో తర్జన భర్జనలు మొదల య్యాయి. అప్పుడు తలకొరివి పెట్టబోయే అతణ్ణీ, మిగతా బంధువుల్నీ ఓ పక్కకి తీసుకె ళ్లి సతీదహనం చేస్తే హత్యానేరంకింద వాళ్లందర్నీ అరెస్టు చేస్తామని బెదిరించాడు. దాంతో అంతా లొంగివచ్చేసి చితిమీంచి సతిని లేపి సూర్యాస్తమయానికి ముందే శవానికి దహనక్రియలు చేసేశారు. అలాగే నేనూ తెలి విగా వ్యవహరించి సతిని నిరోధిస్తాను"

"మీకొచ్చే పేరుమాట దేవుడెరుగు. ఆ తర్వాత అతడేమయ్యాడో, అతడి వాళ్లేమ య్యారో ఏమైనా తెలుసా మీకు?"

"ఊహూ- ఏమవుతారు?"

"ఏదో అయ్యేవుంటారు. సతీమాత శాపానికి తిరుగుండదు. ఏ జన్మలో ఏ పాపం చేశానోగాని పెళ్లై ఇన్నేళ్లైనా పిల్లాపీచూ కలగలేదు. ఇక మీరు సతీమాత ఆగ్రహానికి గురైతే ఇంక చెప్పాలా? జన్మజన్మలకీ నేను గొడ్రాలిగానే ఉండిపోవాలి?"

"అది కాదే..."

"మీరింకేం చెప్పొద్దు. ఏమైనాసరే మీరావ నికి పూనుకోవద్దు. అసలే ఇవాళ సంతోషిమాత పూజ మొదలుపెడుతున్నాను..."

"దానికీ దీనికీ సంబంధం ఏమిటే. ఇది నీ నమ్మకం. అది నా డ్యూటీ"

"అంతగా డ్యూటీ అనుకుంటే ఇంకెవర్న న్నా పంపించండిగాని మీరు వెళ్లొద్దుగాక వెళ్లొ ద్దు. వెళ్తే నా మీద ఒట్టే"

భార్యమీద విసుగూ కోపంరాగా "సరిసరే" అన్చెప్పి ఇంట్లోంచి బయటపడ్డాడు సుబ్బారా యుడు.

స్టేషన్లో అంతా సతి గురించి తాపీగా ముచ్చ టించుకుంటున్నారు.

హుటాహుటిన దేవపురం వెళ్లాలని చెప్పినా పట్టించుకోకుండా కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నందుకు అతడి ఒళ్లుమండిపో యింది. హెడ్‌కానిస్టేబుల్ని పిలిచి "ఏమిటి... ఏమిటి చేస్తున్నారు? దేవపురం వెళ్లాలని కబు రంపానా లేదా?" అన్నాడు గద్దిస్తూ.

"తమకో సంగతి చెప్పాలి..."

"సంగతులు తర్వాత. ముందు రంగంలోకి దిగాలి. సర్కిల్‌కి మెస్సేజ్ పంపించావా లేదా?"

"అన్నీ చేస్తాంగాని మీరొక్క క్షణం శాంతంగా కూర్చోండి చెబుతాను"

"ఏవిటోయ్ నువ్వు చెప్పేది బోడి" అంటూ అరవబోయి హెడ్‌కానిస్టేబులి వయస్సూ, అనుభవమూ గుర్తొచ్చి కుర్చీలో కూలబడ్డాడు.

"ఇది పెద్దింటి విషయం సార్. చిన్నవాళ్లో, చిటికెవాళ్లో అయితే ఈ పాటికెళ్లి అందర్నీ అరెస్ట్ చేసుకొచ్చేసేవాళ్లం. కాని సూరపరాజు గారు రాజకీయాల మనిషి. కిందనుంచి పైదా కా చాలామందితో లంకెలున్న మనిషి. మనమె ళ్లి ఆయన్తో ఘర్షణకి తలపట్టం, ఆయనమీద యాక్షన్ తీసుకోవడం మనకంత శ్రేయస్కరం కాదండి"

వెర్రిగా చూశాడు- "అయితే నోరు మూసు క్కూర్చోవాల్సిందే?"

"అయ్యో... అనువుగానిచోట అధికారులమ నరాదన్నారు అనుభజ్ఞులు"

"అన్నీ వేరు ఇది వేరు. ఇది సేన్సేషనల్ న్యూస్. దేశవ్యాప్తంగా ప్రతిఘటన రావొచ్చు. మనం సరైన చర్య తీసుకోకపోతే మనమీద విరుచుకుపడరూ? పై అధికారులకైనా మనం ఎక్స్‌ప్లనేషన్ ఇచ్చుకోవాలి గదా..."

"ఎక్కడో మారుమూల గ్రామంలో ఏదో జరి గితే ఎవరికి తెలుస్తుంది సార్. రాజస్థాన్లో ఎన్ని సతిసంఘటనలు జరగటం లేదు? ఎన్నిచోట్ల సతిమేళాలు జరగటంలేదు? ఎవరు పట్టించు కుంటున్నారు చెప్పండి?"

వారి సంభాషణ విన్న రైటర్ ముందుకొచ్చి అన్నాడు- "మొన్న ఏదో పుస్తకంలో చదివాను సార్. 1980లో ఢిల్లీలో సర్వసతి సంఘం స్థా పించి సతీమందిరం నిర్మించాలని నిర్ణయం తీసుకున్నారట సార్. అప్పుడు అప్పటి ప్రధాని ఇందిరాగాంధీ పార్లమెంటులో ఎలాంటి సతి





మందిరాన్ని నిర్మించనీయమని ప్రకటించార్ట. కాని ఇవాళ ఢిల్లీలో నాలుగు నతిమందిరాలు న్నాయట. అలా వుంటాయి సార్. సామాజిక నమస్యలకి రాజకీయాలిచ్చే పరిష్కారాలు!"

అతడి వ్యాఖ్యానానికి అక్కడ చేరిన పీసీలంతా నవ్వేరు.

నందిర్భంలో పడ్డాడు సుబ్బారాయుడు.

"సరిగ్గా అప్పుడు ఫోన్ మ్రోగింది.

"హలో యస్సై స్పీకింగ్..."

"నేను మండల ప్రెసిడెంటుని..."

"మీరాసార్- నమస్కారం సార్..."

" దేవపురం వెళ్తున్నారా?"

"బయల్దేరుతున్నాం సార్"

"బయల్దేరొద్దు"

"సార్?"

"ఎవరూ వచ్చి యఫ్ఐఆర్ రాయించలేదు కదా?"

"లేద్సార్"

"మరి నీకు బాధేమిటి? మధ్యాహ్నం ఎవర్నయినా పంపించు చాలు. తెల్సిందా?"

"యస్సర్"

ఊనూరుమంటూ రిసీవర్ పెట్టేశాడు సుబ్బారాయుడు.

"అయన్దగ్గర్నుంచి ఫోన్ వస్తుందని నాకు తెలును సార్. నూరవరాజుగారు ఆయన గ్రూపువాడే. మంత్రి మృత్యుంజయరావుగారి దగ్గర్నుంచి కూడా ఫోన్ వస్తుంది చూడండి..."

"సరే... అయితే కాస్సేపాగి ఓ పీసీని పంపించు"

తర్వాత ఓ పోలీస్కానిస్టేబుల్ని దేవపురం పంపించారు. అతడెళ్లేసరికి దహనకాండ పూర్తయిపోయింది. తిరిగొచ్చేక ఆ సంఘటన గురించి రిపోర్టు చెయ్యడానికి ఆ ఊరివారంతా నిరాకరించినందున అతడే యఫ్.ఐ.ఆర్. లాడ్జి చేసినట్టు రికార్డు చేశారు.

నిట్టూర్చాడు సుబ్బారాయుడు అదంతా గుర్తురాగా.





టేబుల్మీది పేపర్లని వజ్జు పెడుతోంటే స్టేషన్ ముందు రెండు పోలీసుజీపులూ, మూడు పోలీస్వేన్లూ వచ్చి ఆగాయి.

★ ★ ★

పోలీసులూ, పోలీసు అధికారులూ కలిసి స్టేషన్మీదకి దండెత్తి వచ్చినట్టు ఫీలై వణికిపోయాడు సుబ్బారాయుడు.

"సార్... యస్పీగారొచ్చేర్సార్..."

హడావిడిగా టోపీలూ యూనిఫాంలూ సర్దుకుని అటెన్షన్ పొజిషన్లో కొచ్చేశారంతా.

పరుగులాంటి నడకతో ఎదురెళ్లాడు యస్సై.

యస్పీ, డీయస్పీ, సర్కిల్- అంతా కట్ట కట్టకట్టుకునొచ్చేశారు.

పులిలా జీపు దిగుతోన్న యస్పీనీ, ఆయన మీసాల్నీ చూసి కంపిస్తూ వంగిపోయి మరీ ఆహ్వానించాడు.

"ఎవరు? స్టేషన్ ఆఫీసరెవరు?"

యస్పీ ఉరిమినట్లు అడుగుతోంటే తప్పు చేసినవాళ్లా తలొంచేసుకుని నిలబడ్డాడు సుబ్బారాయుడు.

"నువ్వేనా? ఏం చేస్తున్నావ్? ఏమిటి మీరంతా దిష్టిబొమ్మల్లా నిలబడ్డారేం? కమాన్- చెప్పండి. మీరంతా డ్యూటీ చేస్తున్నారా నిద్రపోతున్నారా? ఊఁ... చెప్పండి..."

"మరేమో సార్..."

"షటప్. ఐ హేట్ ఎక్స్ప్లనేషన్స్! నతీనహగమనం జరిగి మూడు రోజులయ్యింది. అవునా? మీరేం చేశారు? ఏం యాక్షన్ తీసుకున్నారు? చెప్పండి. మిమ్మల్నే. ఓపెన్ ద మౌత్..."

"అనలేం జరిగిందంటేను సార్..."

"షటప్ ఐసే. కబుర్లొద్దు. ఐవాంట్ యాక్షన్. ఇటిజ్ వెరీ బేడ్ అండ్ ఇన్సల్టింగ్ మిస్టర్ ఆఫీసర్. మనమున్నదెందుకు? లా అండ్ ఆర్డర్ని కాపాట్టానికి? అవునా?"

తలాడించడానికూడా భయపడ్డారంతా.

"మరి పల్లెగ్గా, నజీవంగా కాల్చి చంపేస్తోంటే గారడీ చేస్తున్నట్టు చూస్తూ కూర్చున్నారా- మోళీ కడుతున్నారనుకున్నారా? చెప్పండి... మిమ్మల్నే..."

"మా లోపం లేకుండా..."

"షటప్. చచ్చు ఏడ్పు వద్దు. ఐవాంట్ యాక్షన్. ఛలో... దేవపురం ఛలో. సతితో సంబంధమున్న అందర్నీ అరెస్ట్ చేసెయ్యాలి ఊఁ... క్విక్..."

"యస్సర్" దొంగలుపడ్డ ఆర్నెల్లకి మొరి గిన కుక్కల్ని గుర్తుచేసుకుంటూ అన్నాడు సుబ్బారాయుడు.

★ ★ ★

సతీ స్థలం దగ్గర ఇసుక వేస్తే రాలనంత జనం వున్నారు.

దీపాదేవి తన మృత భర్తతోపాటు దహన మైన చితిప్రదేశం చుట్టూ సర్వీకర్రలతో కట్టిన దడి ఇంకా అలాగేవుంది. దాన్ని దాటి లోపలికె వ్వర్నీ వెళ్లనివ్వటంలేదు. దడి చుట్టూ కరవా లాలూ, తలపాగాలూ ధరించిన రాజపుత్రయు వకులు పహరా తిరుగుతున్నారు.

సతీస్థలంమీద ఎండపడకుండా పందిరివే శారు. చున్రీ ఉత్సవం నాటికక్కడ సతి మందిరం నిర్మించడానికేర్పాట్లు చురుగ్గా చే స్తున్నారు.

చూడవచ్చిన జనమంతా భక్తితో పూలూ, పళ్ళూ, వస్త్రాలూ, గాజులూ సమర్పిస్తున్నారు. కానుకల్ని అక్కడుంచిన పెద్ద డబ్బీలో వేస్తు న్నారు. గత మూడు రోజుల్లోనే సుమారు ఏడెని మిదిలక్షలు పోగైవుంటుందని అంచనా వేశా రు.

ఆ గొడవతో ఏమీ సంబంధం లేనట్టు పక్కనే ప్రశాంతంగా నిద్రపోతోంది సిందునది.

సతీ స్థలాన్ని చూసి చూసి మరి నిలబళ్లేక కూర్చుండిపోయింది దివ్య.

చితాభూమిని చూస్తోంటే భక్తిభావం కలగ టంలేదు. సరిగదా, కడుపులో చెయ్యిపెట్టి తిప్పినట్టుగా వుందామెకి. శరీరంలోని శక్తి నంతా ఎవరో లాగేస్తున్నట్టుగా వుంది.

ఓహ్... ఎంత దారుణం. ఎంత ఆటవికత! ఎంత అమానుషత్వం!

పట్టపగలు వేలాదిమంది చూస్తుండగా ఓ అబల నిండుప్రాణాల్ని అగ్నిపాలు చేసి ఆహా ఓహో అని స్తుతిస్తున్నారు.

ఈ నాగరిక సమాజంలో మహిళాస్థానం ఎక్కడుందో, మహిళకెంత విలువుందో చెప్పడా నికి సంఘటనలు చాలు.

ఆత్మహత్య చేసుకుందామని ఒంటిమీద కి రసనాయిలు పోసుకున్న అభాగినులు కూడా ఆ వేడి, ఆ మంట, ఆ బాధ భరించలేక ఏడుస్తూ గోలచేస్తూ గగ్గోలు పెడతారే. అలా టిది కిందనుంచి మంటలు కమ్ముకొస్తోంటే, శరీరంలోని మాంసం సన్నసన్నగా కాలివుడికిపో తోంటే కిమ్మనకుండా కూర్చోగలగటం ఎవరికి సాధ్యం? పైగా పెదాలమీద చిరునగవు చెరగ లేదని సర్టిఫికెట్ ఇస్తున్నారు.

అప్పుడేదో కుట్ర జరిగింది. ఏమై వుంటుంది?

ఆమె హాహాకారాలు వినిపించకుండా, ఆమె చితిమీంచి లేచి పారిపోకుండా ఏదేదో చే సివుంటారు. ఏంచేసి వుంటారు?

ఆ రాక్షసకృత్యం గురించి ఎవరు ఎవరు చెబుతారు తనకి?

ఆ కన్నీటివ్యధ ఆమెతో అంతమవ్వకుండా సభ్యసమాజానికి చాటిచెప్పాలని ప్రజలూ, ప్ర భుత్వమూ సిగ్గుతో తలొంచుకునేట్లు చెయ్యా లనీ వచ్చింది. కానిక్కడ ఎటూ చూసినా కట్టు కథలే! మూఢనమ్మకాలే!

ఎవరు చెబుతారా దాచేసిన నగ్నసత్యం గురించి!

దివ్య మనసు కుతకుత ఉడికిపోతోంది. కన్నీరు కాల్వలు కడుతోంది.

సతి!

ఏనాటినుంచి ఎలా మొదలయ్యిందోగాని అనాదిగా ఎందరో విజ్ఞులూ, సంస్కర్తలూ దాన్ని ఖండిస్తూనే వున్నారు.

భారతదేశ చరిత్రలో గుప్తరాజుల కా లంనుంచి మధ్యయుగాలవరకూ ఈ సహగమ నాలు జరిగినట్టు చరిత్ర చెబుతోంది. ఫెరిష్టా అనే ముస్లిం చరిత్రకారుని రాతల ప్రకారం కాశ్మీర్ రాజు సికిందర్ (1389-1413) సతీదు రాచారాన్ని నిషేధించినట్లు తెలుస్తోంది.

18వ శతాబ్దపు చివర్లోనూ, 19వ శతాబ్దపు ప్రారంభంలోనూ సతి బెంగాల్ రాష్ట్రానికే పరి





మితంగా వుండేది. 1820 నుంచి వీటి సంఖ్య మరీ పెరిగిందని తెలుస్తోంది.

పశ్చిమ భారతంలో ఒక్క కొంకణతీరంలో తప్ప మిగతా ప్రాంతాలలో ఏడాదికి 27 నుంచి 40 వరకూ జరిగేవని ఒక అంచనా. 1827 తర్వాత ఇవి తగ్గుముఖం పట్టాయి.

దక్షిణభారత దేశంలో మచిలీపట్నం, గంజాం, తంజావూరు ప్రాంతాల్లో ఈ సహగమనాల సంఖ్య అధికంగా వుండేదట!

ఉత్తర భారతదేశంలో రాజస్థాన్, పంజాబ్, కాశ్మీర్ ప్రాంతాలలో ఈ దురాచారం అగ్రవర్ణాలకి పరిమితమైవుండేదని చరిత్రకారుల అభిప్రాయం.

1815-1824 మధ్యకాలంలో బెంగాల్లోని ఆరు డివిజన్లలో సరాసరి ఏడాదికి 378 నుంచి 839 వరకూ వుండేవని తెలుస్తోంది.

నాడియా, వారణాసి, షాహేబాద్ ప్రాంతాల్లో బ్రాహ్మణ రాజపుత్రుల్లోనూ, కొన్నిచోట్ల అన్ని వర్ణాలలోనూ కన్పించేది.

ఈ సతీ దురాచారం గురించి సభ్య ప్రపంచానికి తెలియజెప్పి ప్రభుతనో కుదుపు కుదిపిన మహామనీషి రాజారామమోహన రాయ్.

1811లో రామమోహనరాయ్ కళ్లముందు ఆయన వదినగారైన అలకమంజరి సతికి ప్రేరేపించబడింది. ఆ బీభత్సదృశ్యం చూసి ఆయన చలించిపోయాడు. మిషనరీ కార్యకర్త విలియంకైరీ మొదలైన స్నేహితుల సహకారంతో ఓ సంఘాన్ని ఏర్పాటు చేశాడు రాయ్. ఏ స్త్రీ కూడా బలవంతపు సతికి బలికాకుండా చూసేందుకు ప్రయత్నించారు. 1818లో 'బ్రతికి వుండగానే విధవలను అగ్నికి బలివ్వడం- సమర్థన ఖండన' అనే పుస్తకం రాశారు.

సతీ దురాచారాన్ని అమలు పరిచేప్పుడు హిందువులు వితంతువులను పెట్టే బాధలు అప్పుడు ఆ స్త్రీలు మానసికంగానూ, శారీరకంగానూ అనుభవించే చిత్రహింసలు, ఆ బతికున్న స్త్రీలను పచ్చిబొంగుల మధ్యపడవేసి తాళ్లతో బిగించి మంటలలో పడవేయడం, ఆ మంటలనుంచి ఎలాగో తప్పించుకుని పరుగెత్తే స్త్రీలను మళ్ళీ పట్టుకుని వచ్చి వాళ్ల బంధువులు వాళ్లని మాడి మసిఅయ్యేవరకూ కాల్చివేయటం- మొదలైన దారుణ అమానుష పరిస్థితుల్ని వివరిస్తూ 1818 ఆగస్టులో బ్రిటీష్ ప్రభుత్వానికి ఒక విజ్ఞాపనపత్రం సమర్పించారు రాయ్.

4-12-1829న అప్పటి గవర్నర్ జనరల్ విలియం బెంటిక్ సతి అనే అమానుష ఆచారం చట్టవిరుద్ధమని ప్రకటించారు. జన బాహుళ్యపు అభిప్రాయాన్ని సేకరించి ఆయనీ నిర్ణయం తీసుకున్నట్టు తెలుస్తోంది.

దేశస్వాతంత్ర్యానంతరం కూడా అప్పుడప్పుడూ అక్కడక్కడా సతి తలెత్తుతూనే వుంది.

1981లో రాజస్థాన్‌లోని సీకర్ జిల్లాలోని ఝుడాలీ గ్రామంలో ఓమ్‌కన్వర్, తర్వాత సోహన్ కన్వర్, నరతాజ్ కన్వర్, నేహకన్వర్, సావిత్రి సతి అయ్యేరు. గత 14 ఏళ్లలో సుమారు 28 మంది సతీ దురాచారానికి రాజస్థాన్లో బలయ్యారని అనధికార అంచనా.

అంతేకాదు. రాజస్థాన్లో అనేకచోట్ల సతీ మందిరాలున్నాయి. వార్షికమేళాలు జరిగే ఆచారమూ వుంది. జూన్ జులైలో జరిగే రాణీసతిమేళా అత్యంత పెద్దమేళా. ఆ రోజును రాష్ట్రప్రభుత్వం శలవుదినంగా కూడా ప్రకటించింది.

ఇంకా వెలుగు చూడనివీ, మధ్యలో నిరోధించబడ్డవీ ఎన్నో! ఎన్నెన్నో!

ఏ సతి దహన దృశ్యమైనా రాయ్ వర్ణించినట్టు గొప్ప భీభత్సంగానూ, రాక్షసంగానూ గుండెలు పిండేదిగానూ వుండితీరుతుంది.

మరైతే దీపాదేవి విషయంలో ఏం జరిగి వుంటుంది? ఆమెనందుకు పురిగొల్పిందెవరు? ఎందుకు? ఆమె చితి మీంచి లేవకుండా పెడబొబ్బలు పెట్టకుండా ఏం చేసి వుంటారు?

ఎలా తెలుస్తుంది తనకి?

చితి మీద శవం కాలుతోంటే చూడటానికే చాలా జుగుప్సగా ఉంటుంది. అటువంటిదిక్కడ ఒక సజీవ స్త్రీమూర్తిని ఒక శవంతోబాటు బహిరంగంగా మంటలకాహుతి చేస్తోంటే వేలాదిమంది అదో పవిత్ర పుణ్యకార్యంగా యజ్ఞంగా భావించి చూశారంటే ఏమనుకోవాలి? జనంలో మూఢత్వం పేరుకుపోయిందని గుండెలు బాదుకోవాలా మానవత్వం మసియయ్యిందని గుండెలు పగిలేలా రోదించాలా?

దివ్య దుఃఖాన్ని మరోలా అర్థం చేసుకున్న జనం ఆమె మీద సానుభూతి వర్షం కురిపించారు. దీప ఆమె స్నేహితురాలో బంధువో అయ్యుంటుందనుకున్నారు.

"వూరుకోమ్మా వూరుకో. దీపామాతని తలచి మనం కంట తడిపెట్టకూడదు. ఆమె దేవత. మహాసాధ్వి. అలాంటి పతివ్రతా శిరోమణి మన వారైనందుకు మన జన్మలు ధన్యమయ్యాయి. ఆమె చితాభస్మాన్ని దర్శించడంతో మన పాపాలన్నీ ప్రక్షాళితమైపోయాయి. జై సతీమాత జైజై దీపామాత.

జయజయ ధ్వనులు మిన్నుముట్టాయి ఒక్కసారే.

కళ్లు తుడుచుకుంటూనే లేచింది దివ్య.

వీళ్లలో మార్పు తేవడానికి మళ్లీ మరో రాజా రామమోహనరాయ్ పుట్టాలేమో! అసలు వీళ్లలో మార్పు తేవడానికి పూనుకున్న దెవరు?

సతీసహగమనం జరిగి మూడు రోజులైనా




ప్రభుత్వం ఏం చేసింది?

ప్రధాని పెదవి విప్పలేదు.

ముఖ్యమంత్రి ఎవరో బాబా జన్మదినోత్సవ వేడుకల్లో నిమగ్నమై వున్నారు.

ఇతర అధికారులూ పోలీసు యంత్రాంగమూ కళ్లు తెరచి నిద్ర పోతున్నారు.

మహిళా సంఘాలూ పత్రికలూ ప్రతిపక్షనాయకులూ సతిని తీవ్రంగా ఖండిస్తూ ప్రభుత్వాన్ని దుయ్యబడుతోంటే కేంద్రప్రభుత్వం అవాళే ఓ ప్రకటన చేసింది.

సతిని నిషేధిస్తూ ఆర్డినెన్స్ జారీ చేసిందా? లేదులేదు.

ఇది రాష్ట్రప్రభుత్వ అధికార పరిధిలోకి వస్తుంది గనుక ఆ చట్టమేదో వాళ్లేచేస్తారన్నారు.

ఈ నాయకులకి కావాల్సింది ప్రజా సౌభాగ్యంకాదు ఓట్లు! అందుకోసం ఏమైనా చేస్తారు.

అత్యున్నత న్యాయస్థానమైన సుప్రీంకోర్టు 'షాబాను' కేసులో చారిత్రాత్మక తీర్పు ఇచ్చింది. దేశాన్ని 21వ శతాబ్దంలోకి తీసుకుపోతానన్న ప్రధాని చేసిందేమిటి? సనాతనులకి తల ఒగ్గి సాంప్రదాయవాదుల ఓట్లని దృష్టిలో వుంచుకుని సుప్రీంకోర్టు తీర్పుని త్రోసిరాజంటూ ముస్లిం మహిళా బిల్లు తెచ్చారు.

ఇవి ప్రజాక్షేమ రాజకీయాలు కాదు ఓట్ల రాజకీయాలు!

అందుకే చున్రీ వుత్సవం జరిగి తీరుతుందంటున్నారు. ప్రభుత్వం రాజపుత్రుల కరవాలాల తళతళలకి కాకపోయినా వారి ఓట్లకి తల వొగ్గి తీరుతుందని వారి ధీమా!

అవాళేం జరగనున్నదో!!

నిట్టూర్పి వెనుదిరిగింది దివ్య.

"రాష్ట్రంలోని రాజపుత్ర యువకులంతా వచ్చేసి చున్రీ వుత్సవాన్ని జయప్రదం చేస్తార్ట. ప్రభుత్వం ఎదుర్కోదలిస్తే తీవ్ర పరిణామాలు ఎదురవ్వొచ్చంటున్నారు..."

"అద్సరేగాని ఈ చందాల సొమ్మంతా ఎవరు తీసుకుంటున్నారంటావు? లక్షల రూపాయలేం చేస్తారంటావు?"

"ష్... నెమ్మది..."

వారి సంభాషణ ఆమె చెవిన బడేసరికి ఆమె పెదాలమీద చిరునగవు కదలాడింది.

★ ★ ★

పతి మృతశరీరంతోబాటు చితిమీద దీపాదేవి కూర్చున్నప్పుడు నిజంగా ఏం జరిగిందో ఎవరు చెబుతారు?

ఆనాటి రాక్షసకృత్యాన్ని మూఢభక్తితోగాక మానవతా దృక్పథంతో చూసిన వాళ్లు ఒక్కళ్లూ లేరా?

దివ్యకి నిలువెల్లా నీరసం ఆవహించేసింది.

మసిబూసిన సత్యాన్ని వెలికి తీయడమెలాగో అర్థంగావటంలేదు. ఏదో పొడిచెయ్యాలని వచ్చింది కానిక్కడ మూఢభక్తి అడుగడుగునా అడ్డొస్తోంది.

సతిని ఖండించేవాళ్లు గ్రామంలో మచ్చుకి ఒక్కరు కూడా కన్పించటం లేదంటే ప్రజల అజ్ఞానానికీ మూర్ఖత్వానికీ చింతించాలా లేక నలభైఏళ్ల క్రితం స్వాతంత్ర్యం వచ్చినా ఇంకా ప్రజల్ని రాతియుగంలోనే మ్రగ్గనిస్తోన్న ప్రభుతని నిందించాలా?

ఏం చేయాలో పాలు పోకుండావుంది దివ్యకి. తనమీద ఎంతో నమ్మకంతో ఎడిటర్ తననీ పనికి పంపేరు. ఇంతవరకూ తను సేకరించిన విశేషాలు అన్ని పత్రికలూ రాసినవే. మరింక తన ప్రతిభేమిటి ప్రత్యేకతేమిటి? తను వెలికి తీసిన రహస్యాలేమిటి? తను శోధించిన చితి మంటల హాహాకారాలేమిటి?

అకస్మాత్తుగా ఆమె మెదళ్లో మెరుపు మెరిసింది.

ఆ మెరుపు వెలుగులో అనంతయ్యా కన్పించారు.

వరదల్లో కొట్టుకు పోతుండగా పెద్ద దుంగ దొరికినట్టు పొంగిపోయిందామె.

ఆ వూళ్లో అడుగుపెట్టినప్పుడు ఒక వృద్ధుడుచెప్పిన అనంతయ్యా,నూరవరాజుల ముఠా రాజకీయాల గురించి నెమరు వేస్తూ రెట్టించిన వుత్సాహంతో వూరివైపు నడిచింది.

సుమారు రెండు గంటల క్రితం వరకూ వచ్చే పోయే యాత్రికులతో తీర్థప్రదేశంగా

విలసిల్లిన దేవపురాన్ని ఒక్కసారే శ్మశాన శాంతి ఆవరించెయ్యటం చూసి మ్రాన్పడిపోయింది దివ్య.

మంత్రించినట్టు రోడ్డు మీద జన సంచారం కూడా మాయమయ్యింది.

ఇళ్లల్లో దూరి కిటికీలోంచి బిక్కుబిక్కుమంటు చూస్తున్నారు జనం. ఎవరి మీదకి ఏమొచ్చిపడుతుందోనన్న భయం వారి కళ్లల్లో రెపరెప లాడుతోంది.

ఇంత అకస్మాత్తుగా ఇంత మార్పు వచ్చిందంటే... ఈ కొద్ది సమయంలో ఏం జరిగివుంటుంది?

ఆమె ఎవర్నీప్రశ్నించనవసరం లేకుండానే పోలీసు వాహనాలంతా చెప్పేశాయి.

అయితే ఎట్టకేలకు పోలీసులు రంగప్రవేశం చేశారన్నమాట!

మరొక్క క్షణం వృధా చెయ్యలేదామె. కెమేరా సరిచేసుకుంటూ సూరపరాజుగారింటి వైపు పరుగుపెట్టింది.

మూడు వేన్లలో రెండు జీపుల్లోవచ్చిన పోలీసు బలగాన్ని చూసి జనం చెదరిపోయారు. సూరపరాజుగారి ఇంటి ఆవరణంతా ఖాకీలతో నిండిపోయింది. వారి చేతుల్లో తుపాకులూ తలల మీద శిరస్త్రాణాలూ మెరుస్తున్నాయి.

వూహించని ఈ హఠాత్పరిణామానికి వూరు నివ్వెరపోయింది. చట్టం ఎవరివెంట పడుతుందో నన్న భయంతో గ్రామప్రజలు తలుపుల చాటున దాగుండిపోయారు.

దీప సతికాండకి ప్రత్యక్షంగానో పరోక్షంగానో తాము సాక్షులమన్న అపరాధభావం· నేర భయం వారి గుండెల్ని మీటుతోంది మరి!

చిత్రంగా మారిపోయిన గ్రామ పరిస్థితిని ఫొటోల్లో బంధిస్తూ సూరపరాజుగారింటి వైపెళ్ల బోతోంటే గేటు దగ్గర పోలీసులు ఆపేశారు దివ్యని.

తనో పత్రికా రిపోర్టర్నని చెప్పి ఐడెంటిటీ కార్డు చూపించింది. అయినా ఆమెని వెళ్లనివ్వ లేదు. ఆమె మాటలు పట్టించుకోకుండా మొరటుగా ప్రవర్తించసాగారు.





ఏం చేయాలో పాలుపోక గేటు దగ్గరే నిలబడిపోయి లోపలికి చూసింది.

ఉదయం వచ్చిన మంత్రి మృత్యుంజయ రావుగాని ఆయన అనుచరులుగాని లేరు. అంటే పోలీసులొచ్చేక వెళ్లిపోయారా వస్తున్నారని తెలిసివెళ్లిపోయారా? ఏమైనా ఎక్కడో ఏదో లంకె వున్నట్టేవుంది. తనాయన ఫొటోని తీసుకోవడం మంచిదయ్యింది.

"పోనీ నా ఐడెంటిటీ కార్డు యస్పీగారికి చూపించు"

"ఎవరికీ చూపించక్కర్లేదు. పురుగుని కూడా లోనికి రానివ్వొద్దన్నారు" కటువుగా అన్నాడు.

"ప్రెస్ వారి మీద జులుం ఏమిటయ్యా..." అంటూ లోపలికెళ్ల ప్రయత్నించిందిగాని మొరటుగా ఆమెని వెనక్కిలాగి ఓ ప్రక్కకి త్రోసేశారు.

కోపంతోముక్కుపుటాల దుర్తోన్నా నిస్సహాయంగా చూస్తూండిపోయింది దివ్య.

తుపాకుల్ని స్టడీగా పట్టుకుని పహరా తిరుగుతున్నారన్న మాటేగాని పోలీసులందర్లోనూ ఏదో తెలీని టెన్షన్ చోటుచేసుకుంది. ఏ క్షణంలో ఏమవుతుందో ఏ ప్రక్కనుంచి ఏ గుంపొచ్చిదాడి చేస్తుందోనని భయంగావుంది. సతికి సంబంధించిన వారిని అరెస్ట్ చేస్తోంటే జనం చూస్తూవూరుకోరనీ వూరు వూరంతా విరుచుకుపడుతుందనీ భావిస్తున్నారు భయపడుతున్నారు.

యస్పీ కూడా పైకి గంభీరంగా వున్నా లోలోపల బెదుర్తూనే వున్నాడు. గొడవవుతుందనీ గాయాలు తగుల్తాయనీ కాదు. ఒకవేళ పరిస్థితి విషమిస్తే పోలీసులు కాల్పులు జరిపితే ఏమవుతుందో ఎన్ని గొడవ లొస్తాయో నని గాభరాగావుంది. తనకి రాబోతోన్న ప్రమోషన్ ఎక్కడ రాకుండాపోతుందోనని ఆందోళనగావుంది.

చిత్రమేమిటంటే కర్తవ్యం దృష్ట్యా ఇలా అరెస్ట్ చెయ్యడానికొచ్చినందుకు మన్నించమంటూ సతీమాతని మనస్సులో వేడుకుంటున్నారు కొందరు ఖాకీలు.

సూరపరాజుగారూ దానప్పా తదితరు

లంతా నిర్భయంగావున్నారు. ఏమీ జరగబోవటం లేదన్నట్టు ప్రవర్తిస్తున్నారు. పోలీసు అధికారులకి మర్యాదలు చేస్తూ అవీ ఇవీ మాట్లాడుతున్నారు. మధ్యమధ్య ఇంట్లోకెళ్ళి రహస్యంగా చర్చిస్తున్నారు. ఎవరెవరికో ఫోన్ కాల్స్ చేస్తున్నారు.

సోమయాజులుగార్ని అరెస్ట్ చెయ్యడానికి సుబ్బారాయుడు కొంత బలగంతో వెళ్ళేడు.

డీయస్పీ సర్కిల్ ఇన్స్పెక్టరూ కలిసి వూరి పెద్దల్నీ ఇంట్లోని ఆడవాళ్ళనీ పనివాళ్ళనీ ఇరుగుపొరుగువారినీ ప్రశ్నించారు.

"సతి అవడానికిదీపాదేవినిఎవరైనా ప్రోత్సహించారా?"

"లేదు. సతిమాత ఆశీర్వాదంవల్ల సతి అయ్యింది తప్ప మానవమాత్రుల ప్రమేయం వల్లకాదు" అందరిదీ ఒకే సమాధానం.

"సతి అవ్వాలన్న కోరిక ఆమెకెలా పుట్టింది?"

"భగవదేచ్ఛ!"

"చితి మీదకి తనంతటతనే వెళ్ళిందా లేక ఎవరైనా బలవంతంగా చితికెక్కించారా?"

"ఎవరూ ఏమీ అనకుండానే పెళ్ళి పీటలమీదకెళ్ళి కూర్చున్నట్టు కూర్చుంది దీపామాత"

"చితికి నిప్పుపెట్టిందెవరు?"

"ఆమె మరిది. అతడు నిప్పుపెట్టడానికి సందేహిస్తోంటే, 'వూఁ కానివ్వు. ఆలస్యంచేసినా ఆగ్రహానికి గురవ్వొద్దు. నీవు కేవలం నిమిత్త మాత్రుడివి. చితికి కొరివి పెట్టి సతీమాత అనుగ్రహానికి పాత్రుడవవ్వు' అని చెప్పి స్వయంగా దీపా మాతే ప్రోత్సహించింది"

"చితి మండుతున్నప్పుడు దీపాదేవి రక్షించమని కేకలుపెట్టలేదా?"

"లేదులేదు"

"డప్పుల శబ్దంలో శంఖాల హోరులో మీకంతా విన్పించిందా? చుట్టూ దడి కట్టిన యువకుల మధ్య పొగమధ్య ఏం జరిగిందో మీకు స్పష్టంగా కన్పించిందా?"

"కన్పించింది. సతీమాత చిహ్నం దీపామాత అరచేతిలో ప్రత్యక్షమయ్యింది. చిరునవ్వుతో జనాన్ని దీవిస్తూ ఆత్మబలిదానం చేసుకుందా మహా పతివ్రత"

"ఆమె సతి అవడానికి ఆమె మామగారు గాని ఇతరులుగాని ప్రోత్సహించారనిగాని బలవంతపెట్టి వుంటారనిగాని మీరు భావిస్తున్నారా?"

"అపరాధం అపరాధం. సతీమాతని శంకిస్తే కళ్ళుపోతాయి"

"చితిని శ్మశానంలోగాక స్వంత తోటలో ఎందుకేర్పాటు చేశారంటారు?"

"ఇలవేల్పుని నిత్యం కొలవడానికి వీలుగా"

ఇంకేం అడగమంటారంటూ యస్పీ వంక చూశాడు డీయస్పీ.

"సరే సరే త్వరగా ముగించెయ్"

అందరి దగ్గరా సంతకాలూ వేలిముద్రలూ తీసుకున్నాడతడు.

గేటు దగ్గర పోలీసుల్తో ఎవరో ఘర్షణ పడుతూండటం యస్పీదృష్టిలో పడింది.

"ఏయ్ ఏమిటది. డామిట్ ఏం జరుగుతోంది" వున్న చోటనుంచి కదల కుండానే అరిచారు.

"ఎవరో పత్రికా విలేఖరి సార్. పొమ్మని ఎంత చెప్పినా వినటం లేదు"

"పత్రికా విలేఖరా? యూ మీన్ ప్రెస్? మరింకా చూస్తావేంరా ఇడియట్ పంపించు పంపించు..."

ఆయన ధోరణికి విస్తు బోతూనే దివ్యని లోనికి వెళ్ళనిచ్చారు.

"నువ్వు రిపోర్టర్వా?"

"అవున్సార్.. శుభోదయం పత్రిక రిపోర్టర్ని"

ఆ పత్రిక పేరు వింటూనే మహదానందపడిపోయారు.

"కమాన్ కమాన్.... బీ సీటెడ్. ఒరే ఆ కుర్చీ ఇలా వెయ్యి. మా వాళ్ళు మీరెవరోతెలీక క్రూడ్గా ప్రవర్తించలేదుకదా?"

"లేద్సార్"

"చూస్తున్నావుగా. అందర్నీ అరెస్ట్ చేసేస్తున్నాం. ఫొటోలు తీశావా? పోనీ మళ్ళీ తీసుకో..."

"థాంక్యూసార్"

ఆయన్ని చాలా ప్రశ్నించాలనుకుంది. కాని మొదటికే మోసం వస్తుందేమోనని ఆ ప్రయత్నం విరమించి అరెస్ట్ తతంగాన్ని ఫోటో తీసింది.

ఇంతలో సోమయాజులుగార్ని అరెస్ట్‌చేసి తీసుకొచ్చాడు సుబ్బారాయుడు.

సర్వం కోల్పోయిన వాళ్లా వున్నాడాయన. సన్నగా కంపిస్తూ కన్నీళ్లతో "సూరపరాజుగారూ" అన్నాడు అర్థింపు స్వరంతో.

"నిశ్చింతగా వుండండి సోమయాజులుగారూ. రేపటికల్లాతిరిగి వచ్చేస్తాం. మన కోసం రాయల్ వెల్‌కమ్ ఎదురు చూస్తూంటుంది"

ఆయన నిజంగా అంటున్నారో హేళన చేస్తున్నారో అర్థం కాలేదు.

"మనల్ని జైల్లో పెట్టేస్తారా?"

చిరునవ్వు చిందించారాయన.

"జైలంటే భయమెందుకండీ. జైలుకెళ్లి నందున గొప్ప వాళ్ళైన దాఖలా లెన్నోవున్నాయి. మనలో మనమాట. ఉత్తరప్రదేశ్‌కి చెందిన రవిదాస్ మెహరోత్రా అనే విద్యార్థి నాయకుడు మొత్తం 190 సార్లు జైలుకెళ్లొచ్చి రికార్డు సృష్టించాట్ట. అతడి పేరు గిన్నీస్ బుక్ ఆఫ్ రికార్డ్స్‌లోకి ఎక్కబోతోందిట ఎంతగొప్పో చూడండి" అని నవ్వి ఆయన భుజం తట్టి అభయమిస్తూ చూశారు.

సాక్షాత్తు శ్రీరామచంద్రుడే అభయమిస్తున్నట్టుగా ఫీలయ్యాగాయన.

"ఇంకేమిటి ఆలస్యం?" యస్పీ అడిగారు.

"ఏం లేదు సార్"

"మరింకేం జీపు లెక్కించెయ్యండి"

సోమయాజులుగారితోబాటు సూరపరాజు గార్ని చిటికెనివ్వు పెట్టిన వారి చిన్నబ్బాయి రాంబాబునీ అరెస్ట్‌చేసి జీపు ఎక్కించారు.

యస్పీగార్ని సమీపించి 'ఒక్క ప్రశ్న సార్' అనడిగింది దివ్య.

"ఒకటేమిటి ఎన్నైనా అడుగమ్మాయి. చూస్తున్నావుగా మా కార్యనిర్వహణ" మీసం సవరించుకుంటూ అన్నారు.

"సతియనే క్రూర అనాగరిక సంఘటన జరిగిన మూడు రోజులకి పోలీసులు రంగప్రవేశం చేశారంటే దానిక్కారణం పోలీసుల అలసత్వమా రాజకీయాల ఒత్తిడా? లేక ప్రముఖుల విమర్శలా మహిళా సంఘాల నిరసనలా?"

"డామిట్! వూ( స్టార్ట్...." జీపెక్కుతూ అరిచారు.

"సార్ నాకు జవాబివ్వలేదు..."

"ఐ హేట్ జర్నలిస్ట్స్!"

దుమ్మురేపుకుంటూ కదిలాయి జీపులూ వేన్లూ!



ఎడిటర్ మహర్షి దివ్యని చూస్తూనే "హలో చాలా త్వరగా వచ్చేశావే వెరీగుడ్" అన్నారు.

"సతికి సంబంధించిన అందర్నీ అరెస్ట్ చేసేశార్సార్"

"పిటిఐ తెలియజేసింది"

"వ్వాట్? నేను దేవపురాన్నుంచి తిన్నగా ఇక్కడి కొస్తున్నాను. ఇంతలోనే..."

"విమర్శల పరంపరల నుంచి నిరసన ధ్వనుల ముష్టిఘాతాలనుంచి తప్పించుకోవడానికి ప్రభుత్వం వారిని అరెస్ట్ చేసింది. అలాంటప్పుడు ఆ వార్తని వేగాతి వేగంగా పత్రికలకందించదూ? పత్రికలు దేశానికి జీవనాడులు కదా"

"అవున్సార్... పత్రికలు పూనుకోకపోతే సతి సంఘటన వెలుగు చూసేదేకాదు"

"ఏమైనా సాలిడ్ న్యూస్ సేకరించావా?"

"సారీసర్.... అంతా ఒకే పాటపాడుతున్నా

రు. ఎంత ప్రయత్నించినా అంతర్గత విషయాలు తెలీలేదు. మళ్లీ వెళతాన్లెండి. ఆ రహస్యాన్ని సాధించేవరకూ నిద్రపోను" అంటూ తను సేకరించిన సమాచారమంతా వివరించింది.

"మురళి కడుపునొప్పితో చనిపోయాడా? సూరపరాజుగారిలో దుఃఖం దాదాపు లేదా? ఈ రెంటి గురించీ లోతుగా పరిశోధించాలి. వీలైతే వైద్యం చేసిన డాక్టర్ని కూడా కలుసుకో. అన్నట్టు దీప పుట్టింటివారి రియాక్షన్ ఏమిటి? వియ్యాలవారి మీద ఏమైనా ఆరోపణలు చేస్తున్నారా? వారిని కలిస్తే క్లూ దొరకొచ్చు. పొలిటికల్ అప్పోనెంట్ అనంతయ్యని కలుసుకో వూళ్లో వాళ్లు పైకి చెప్ప సాహసించని విషయాలు ఆయన చెప్పొచ్చు"

"అలాగే సార్. అనంతయ్యగారు వూళ్లో లేనందున కలుసుకోలేకపోయాను. ఈసారి తప్పక కలుసుకుంటాను"

"ఒక్క సంగతి గుర్తుంచుకో దివ్యా. పూర్వమైనా ఇప్పుడైనా సరే సతి ఆచారానికి ముఖ్య కారణాలు మూడు.

ఒకటి: వితంతువైన స్త్రీకి ఆస్తిలో వాటా దక్కనీకుండా చూడటం.

రెండు: నరక సదృశ వితంతు జీవనం.

మూడు: సతీ సహగమనం చెయ్యటం వారి వంశానికి గర్వకారణంగానూ అదొక వీరోచిత చర్యగానూ భావించడం.

ప్రజల మూఢభక్తిని కాష్ చేసుకోవాలన్న స్వార్థాన్ని కూడా ఓ కారణంగా చెప్పుకోవచ్చు. వీటిని దృష్టిలోవుంచుకుని నీ పరిశోధన సాగించు. తప్పక నిజం బయటపడుతుంది"

"థాంక్యూ సార్"

"ఇంకో సంగతి. కేవలం అరెస్టులతో ఆ వ్యవహారం పూర్తవలేదు. ఒక మలుపు తిరిగిందంతే. సతిని సమర్థించే మతవాదులంతా ధర్మరక్షా సంఘం పేరుతో సమీకృతమై ప్రభుత్వ చర్యని ఖండించడానికి సమాయత్తమవుతున్నారు. వారికి కొందరు మఠాధిపతులు నాయకత్వం వహించే అవకాశం లేకపోలేదు. ఇంకో ప్రక్కన దేశం నలుమూలల్లోనూ మహిళా సంఘాలూ, ప్రతిపక్షాలూ, మేధావివర్గమూ నిరసన ప్రదర్శనలూ సమావేశాలూ వుధృతం చేయబోతున్నాయి. చున్రీ వుత్సవం జరపకుండా న్యాయస్థానాన్నాశ్రయించాయి కొన్ని మహిళా సంఘాలు. ఎటు మొగ్గితే తమ ఓట్ల బ్యాంకుకి ముప్పువస్తుందోనని అధికార పార్టీ తల పట్టుకుని కూర్చుంది. ఈ నేపథ్యంలో ఈ వ్యవహారం ఎన్ని మలుపులైనా తిరగొచ్చు. చున్రీ నాడేమైనా జరగొచ్చు. వీటన్నిటినీ నువ్వు బాగా కవర్ చెయ్యాలి"

"అలాగే సార్... మీలాంటి మార్గ దర్శకులు మా ఎడిటర్ అవడం మా అదృష్టం"

ఆయన దగ్గర శలవు తీసుకుని ఇంటికెళ్లింది దివ్య. తాళం తీస్తోంటే 'ఆంటీ' అంటూ వచ్చింది బుజ్జి.

"ఏం బుజ్జీ బాగున్నావా"

"ఓ... ఎక్కడికెళ్లేవు ఆంటీ"

"వూరికెళ్లేనమ్మా"

"ఆ వూళ్లో ఏం వుందాంటీ"

"నాలాటి నీలాటి ఓ అభాగ్యురాలి సజీవ సమాధి వుందమ్మా" చేతిలోబిస్కెట్టు పెట్టి తలనిమురుతూ అంది.

"ఏమంటున్నావాంటీ"

"అర్థంకానిదే కాదు అర్థం లేనిదైపోయింది ఆడదాని బ్రతుకు!"

"నాకేం తెల్టం లేదాంటీ. ఆంటీ నీకోసం ఓ అంకుల్ వచ్చాడు. మోటారు సైకిలు మీదొచ్చాడు"

"ఓ చైతన్యా?"

"ఆ అంకుల్ పెద్ద పోలీను" రహస్యంగా చెప్పింది.

"ఎంత పెద్ద పోలీసైనా నిన్నేం చెయ్యళ్లే బుజ్జీ" నవ్వుతూ అంది.

"నన్ను కాదు నిన్ను తీసుకెళ్తాడు ఆంటీ జాగ్రత్త"

కళ్లు పెద్దవి చేసుకుని బుజ్జి చెప్పిన తీరుకి పకపకా నవ్వేసింది దివ్య.

"ఛీపో... నీతో మాట్లాడను"

"సరే... నువ్వు చెప్పినట్లేవింటాన్లే. ఆ పోలీసుతో జాగ్రత్తగా వుంటాను. సరేనా?"



తలాడించి ఆమె బుగ్గ మీద ముద్దుపెట్టుకుని తుర్రుమని పారిపోయింది.

బుజ్జి అనాలోచితంగా అన్న మాటల గురించే ఆలోచిస్తూండిపోయింది కాస్సేపు.

చైతన్య!

అతడి గురించి తలచుకుంటే చాలు మనసంతా ఎంతో హాయిగా వుంటుంది. దూది పింజకన్నా తేలికై తేలిపోతుంది. వూహల్లో తేలియాడుతుంది.

అతడితో కలిసినడిస్తే... మాట్లాడుతోంటే... ఎంతో నిండైన తృప్తినిండిన అనుభూతి!

అది శాశ్వత మైతే?!

ఛా... తనేమిటి తనవూహ ఏమిటి?

తనెవరు?

ఓ దురదృష్టవు స్త్రీ! విధవ!!

ఆమె కళ్లు నీళ్లతో నిండిపోయాయి.

పెళ్లైన మూణ్నాళ్లకే పతిని పోగొట్టుకున్న నిర్భాగ్యురాలు తను! అయినవాళ్ల ఆరళ్లకీ సమాజపు ఆంక్షలకీ మధ్య నలిగిపోయిన శాపగ్రస్తురాలు తను!

తన బ్రతుకింక ముగిసిపోయినట్లేనని చీకటిగదిలో ఒంటరిగా మ్రగ్గిపోతోంటే వెలుగు రణంలా వచ్చాడు బంధువూ, చిన్ననాటి మిత్రుడూ అయిన చైతన్య.



చైతన్య స్నేహం తన పాలిట బంగారు వరమయ్యింది.

జడపదార్థమనుకున్న తన బ్రతుకులో చైతన్యం చిగురించింది.

అతడి బోధనలూ అతడిచ్చిన పుస్తకాలూ తనని చిత్రంగా మార్చాయి. తనేమిటో జీవిత పరమార్థమేమిటో తెలిసొచ్చింది. అందర్నీ కాదనెయ్యగల శక్తి వచ్చింది. ఆచారాల సంకెళ్లు ఛట్‌ఫట్‌మని త్రెంచేసుకుంది.

ఇంట్లో వాళ్లు సహించలేకపోయారు. ఆడదన్న అలుసుతో సాంప్రదాయాల పేరుతో అణగద్రొక్కాలని చూశారు. వాళ్లెంతగా త్రొక్కితే అంతెత్తు లేచిపడింది తను స్ప్రింగులా.

ఫలితంగా ఇంట్లోంచొచ్చేసింది. ఒకరి భార్యగాక ముందూ తర్వాతా కూడా మొదట తను స్త్రీయనీ తర్వాతే మిగిలినవనీ విశ్వసించింది. బొట్టూ కాటుకా రంగువస్త్రాలూ ధరించి తన బ్రతుకుని చూసి నవ్విన మొఖాలమీద వూసింది.

పత్రికా విలేఖరిగా వుద్యోగంచేబట్టేక తెలిసింది ప్రపంచమెంత విశాలమైనదో. జరిగిన అనర్థం తలచుకుని జీవితాంతం విలపించటం అవాంఛనీయమే గాక అవివేకం కూడా అని తెలిసొచ్చింది. జీవితం పండించుకోవడానికి తప్ప ఒంటరిగా కుళ్లిపోవటానిక్కాదని గ్రహించింది..

బాధాసర్పద్రష్టులు కథల్ని వ్యధల్నీ అక్షరీకరించటం ధ్యేయంగా సాగిపోతోంది. ఆశావహమైన భవిష్యత్తు వంక విశ్వాసంతో వుత్సాహంతో చూస్తూ నడుస్తోంది.

"దివ్యా" అంటూ వచ్చాడు చైతన్య.

గబగబా కన్నీళ్లు తుడిచేసుకుందామె. అయినా అవి అతడి కంటపడ్డాయి.

"గతాన్ని తవ్వుకుంటూ కూర్చున్నావన్న మాట"

"అబ్బే... అదేం కాదు"

"నా మొఖంలోకి సూటిగాచూసి చెప్పు"

తలవంచేసుకుంది.

"దీపాదేవి సతి గురించి వివరాలు సేకరించి వచ్చావుకదా. ఆమె చేసిన పని సవ్యమైనదే అంటాను. ఏమంటావు?"

"చైతన్యా... నువ్వేనా అలా మాట్లాడుతున్నది? బార్బారిక్ యాక్ట్‌ని సమర్థిస్తున్నావా?"

"సమర్థించటం తప్పంటావు. పోనీ బ్రతికి ఆమె ఏం చేయాలో చెప్పు? పువ్వులూ- నవ్వులూ లేక ఆశా- అనుభూతీ లేక జీవశ్చవంలా బ్రతకాలి. ఎంచేతంటే ఒక పద్ధతి ప్రకారం విధవల మీద అమానుషకాండ సాగించడం దేశంలోని అన్ని ప్రాంతాలలోనూ అన్ని కులాలలోనూ వుంది కదా. ఇహలోకపు కోరికల్నీ స్వేచ్ఛనీ లేకుండా చెయ్యాలని విశ్వప్రయత్నం చేస్తున్నాయి కదా. అలా బ్రతకమంటావు. లేదా జాగ్రా సిస్టంలోలా విధవల్ని అత్తవారు వేలంవేసి అమ్మెయాలంటావా? చెప్పు దివ్యా"

"అలా బ్రతకమనెవరు శపించగలరు?"

"అంటే అందర్లా బ్రతకాలంటావు. స్త్రీకి అజ్ఞాతంగా తనలో కదిలే అనుభూతుల్ని వాంఛల్ని తెలుసుకునే స్వేచ్ఛ వుందిగాని వాటిని వెల్లడించుకునే స్వేచ్ఛ మాత్రం లేదన్న మాటలు అబద్ధం కావాలంటావు. ఒకే... స్త్రీకి శరీరం వుంది- దానికి కసరత్తుకావాలి. ఆవిడకూ మెదడువుంది- దానికి విజ్ఞానం కావాలి. ఆమెకూ గుండె మనస్సూ వున్నాయి- వాటికి అనుభవం కావాలి అనే మాటతో ఏకీభవిస్తున్నానంటావు"

తలాడించింది.

"థాంక్ గాడ్... వితంతువు మళ్లీ పెళ్లిచేసుకున్నప్పుడే అదంతా సాధ్యం. సో... సతికావొద్దని చెప్పటమే కాదు భర్తపోయినా మీకు బ్రతుకుంది. ఈ సమాజంలో చక్కని స్థానంవుంది. రండి ఇదీ దారి అంటూ పునర్వివాహాన్ని సూచించబోతున్నావన్న మాట. యామై కరెక్ట్?"

తలాడించక తప్పలేదు దివ్యకి.

"మనదేశపు దౌర్భాగ్యం ఏమిటో తెలుసా దివ్యా? నీతులు చెప్పేవాళ్లూ, సూత్రాలు వల్లించేవాళ్లూ అడుగడుగునావున్నారు. కాని ఆచరించేవాళ్లు కాగడాపెట్టి వెదకినా కన్పించరు. నేను చెప్పినట్టుచెయ్యిగాని నేను చేసినట్టు చెయ్యకన్నది మన నడవడి సూత్రం. అవునా?"





''కాదు'' నవ్వేసిందామె.

''ఇదెప్పట్నుంచి?''

''ఈ ముక్క నానోటితో చెప్పించడానికి నువ్వు తిప్పితిప్పి చెప్పుకొచ్చినప్పట్నుంచి''

''నిజమేనా వేళాకోళమా?''

''నా గురువ్వి. మార్గదర్శివి. నీతో అబద్ధమాడతానా?''

''ఈజిట్''

''యస్ ఇటీజ్... నువ్వు చెప్పిన తారక మంత్రంలోని 'లైఫ్ ఈజ్ ఎ లవ్ ఎంజాయ్ ఇట్' అన్న ముక్క మననం చేసుకుంటున్నా రక్తంలో.

జీర్ణించుకుపోయిన ఏవో బూజుపట్టిన భావాలు నన్ను వెనక్కి లాగుతూనే వున్నాయిన్నాళ్ళూ. ఏదో తెలీని ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్ డిప్పలో ముడుచుకునే నత్తలా నాలో నేను ముడుచుకుపోయేలా చేస్తూ వచ్చింది. పతి పోయాక ప్రేమ గురించి ఆలోచించటమే మహాపాపమని మెదడులోని పురాతన కణాలు హెచ్చరిస్తోంటే అపరాధ భావనతో నలిగిపోతున్నాను. ఇప్పుడిహ ఆ భావాల సాలెగూళ్ల నుంచి బయటపడతాను చైతన్యా. నువ్వన్నట్టు కేవలం సతిని ఖండిస్తే చాలదు. వితంతువులకి పునర్జీవితానికేర్పాట్లు చేసినప్పుడే సమాజ బాధ్యత తీరుతుంది. థాంక్యూ థాంక్యూ వెరీమచ్ చైతన్యా''

''హమ్మయ్యా... ఇన్నాళ్ళకి మబ్బు వెలిసింది. నా తపన్సు ఫలించింది. ఏమంటావమ్మా పెళ్లి కూతురా'' ఆమె గెడ్డం పట్టుకుని మొఖం పైకెత్తుతూ అడిగాడు.

''కాని మీ వాళ్ళు...''

''మా వాళ్ళనీ మీ వాళ్ళనీ కట్టగట్టి అవతల పారెయ్''

''సాధ్యమేనా?''

''మానవుడికి అసాధ్యం వుంటుందా?''

''కాని పరిస్థితులు...''

''పురోగమన శీలమైంది కాలం''

''చైతన్యా!'' అంటూ సుడిగాలిలా అతడ్ని చుట్టేసింది.

ఎన్నాళ్ళనుంచో బలవంతాన అణచి పెట్టిన దుఃఖం వరదలై పొంగింది.

చిన్నపిల్లలా ఏడుస్తోంటే ప్రేమగా ఆమెని పొదివిపట్టుకుని తల నిమురుతూండిపోయాడతను.

కౌగిలిలో ఇమిడిపోయిన వారిని చూసి విసురుగా వెళ్ళిపోయిన మనిషిని ఆ ఇద్దరూ గమనించలేదు!

* * *

మేళతాళాలతో కొండలపైకి సాగిపోతోందో పెద్దగుంపు.

ఏమిటది? జాతరా?

అరెరె- అదేమిటి? పెడరెక్కలు విరిచికట్టి కొందరాడవాళ్ళని బలిపశువుల్లా తీసుకుపోతున్నారేమిటీ? అయ్యయ్యో ఇదేం ఘోరం? అసలు వాళ్ళెవళ్ళు? వాళ్ళుచేసిన ఘోర పాపమేమిటి!

అరె!

వాళ్ళు... వాళ్ళందర్నీ ఎక్కడో చూసినట్టే వుంది. ఆఁ- ఈ మధ్య తను చూసిన పెళ్ళికూతుళ్ళు వాళ్ళంతా. కాళ్ళపారాణి ఆరని వాళ్ళు. పసుపుతాడు వెలవని వాళ్ళు. బుగ్గన చుక్క చెరగని వాళ్ళు!

వాళ్ళని ఎక్కడికి తీసుకుపోతున్నారు? వారి నుదుట ఆ పెద్ద బొట్లేమిటి? మెడలో వేప రెబ్బలేమిటి? వాళ్ళు ఏడ్చి గోలచేస్తున్నా ఎవరూ వినరేం? పట్టించుకోరేం?

ఏదో పండుగ చేసుకుంటున్నట్టు సంబరంతో గెంతుతున్నారేం? శివమెత్తినట్టు ఆ బాజా భజంత్రీల ఘోష ఏమిటి? ఎందుకు?

అయ్యో! ఎంత ఘోరం! కొండ ఎక్కలేక జారి అగాధంలో పడిపోయిందో అభాగ్యురాలు! అయినా ఎవరూ పట్టించుకోరేం? చేతులు దులిపేసుకుని ముందుకి సాగిపోతున్నారేం? ఎక్కడికి? ఎందుకు?

పాపం! ఎక్కలేక ఎక్కుతున్నారు కుసుమకోమలులు. మోకాళ్ళూ మోచేతులూ కొట్టుకుపోయి రక్తం స్రవిస్తోంది! కళ్ళనుండి రక్తాశ్రువులు కాల్వలు కడుతున్నాయి. గొంతు పగిలేలా రోదిస్తున్నారు గోడుగోడున!

ఎంత కష్టం! ఎంత దారుణం!



హమ్మయ్యా... గుంపు ఆగింది. ఇంత కొండ పైకి ఇంత శ్రమపడి ఎందుకు తీసుకొచ్చినట్టు?

అరెరె... ఆ ఎముకల గుట్టలేమిటి? మై గాడ్! అవి మానవ అస్తిపంజరాలు!

జనం వూగుతున్నారు. మద్యం తాగి గెంతుతున్నారు. బూరలూ, బాజాలూ గొంతు చించుకుంటున్నాయి.

అరె- తళతళ మెరుస్తోన్న కత్తులు బయటికి తీశారు!

దేవుడా! ఆ అభాగ్యుల్ని బలిస్తారు కాబోలు! ఎంత రాక్షసం!!

ఆపండి... ఆపండి... ఈ పైశాచిక కాండనాపండి! అయ్యో వినరేం. మిమ్మల్నే... మిమ్మల్నే. ఆడ బిడ్డల్ని చంపకండి. వాళ్ళ వుసురు పోసుకోకండి అయ్యో- అలా బొమ్మల్లా నిలబడి చూస్తారేం! ఆ దారుణం ఆపండి. వాళ్ళనీ వాళ్ళ తల్లులు నవమాసాలు మోసి కన్నారయ్యా. వాళ్ళూ మీలాగా చీమూ నెత్తురూ వున్నవాళ్ళేనయ్యా. వాళ్ళూ మీలాగే ప్రాణమున్న జీవులయ్యా వాళ్ళకీ నొప్పి, బాధ, భయం, అనుభూతి, దుఃఖం అన్నీ వున్నాయయ్యా!

ఏమండీ మిమ్మల్నే. మిమ్మల్నే. ఆపండి! ఆపెయ్యండి!!

నా గోల వినరేం? మీరంతా బధిరులా? కళ్ళున్న గుడ్డివాళ్ళా? మనస్సులేని దానవులా?

మరేమిటీ నారీ బలి?

మరెందుకీ నారీ యాగం?

అయ్యయ్యో! కత్తులులేచాయి! కుత్తుకలు తెగాయి!

గిలగిల తన్నుకుంటున్నాయి మొండాలు!

రక్తం! ఎల్లెడలా రక్తం! అయ్యో అలాటి ఆడదే ఆలాటి రక్తమే పంచిచ్చి మిమల్ని కన్నదయ్యా.తన రక్తాన్ని పాలగా మార్చి మీ కండల్ని పెంచిందయ్యా. అదంతా మరచి కండకావరంతో కత్తి ఎత్తి ఆమె కంఠాన్ని నరికేస్తారా వంచకులారా! లజ్జా హీనులారా దుష్టులారా! ఏ పురాణంలోనూ ఏ రాక్షసుడూ ఇలా తమ స్త్రీలని అంతంచెయ్యలేదయ్యా. రాక్షసులకన్నా హీనాతి హీనులైన మిమ్మల్నేమనాలి? ఏ పేరుతో పిలవాలి?

అదేమిటీ?

ఏదో పవిత్ర కార్యం చూస్తున్నట్టు చూస్తూ మంత్రం పఠిస్తున్నారు. ఏం మంత్రం అది? ఏం పూజ అది?

సతీమాతకీ జై! సతీమాతకీ జై!

ఎంత క్రూరులు మీరు!

చేతులు జోడించి పిమ్మట పిస్తోలు పేల్చిన గాడ్సేకన్నా దుర్మార్గులు మీరు!

చంపేసి చేతులు జోడిస్తున్నారుట్రా రాక్షసాధములారా!

దేవుడనేవాడు వుంటే మళ్ళీ జన్మలో మిమ్మల్ని ఆడపిల్లగా పుట్టించాలి. అప్పుడు తెలుస్తుందిరా ఈ నరకయాతన ఏమిటో ఎలాంటిదో!

గుండెలు చీల్చుకుని దుఃఖం పొంగి వస్తోంటే...

అమ్మ!

అదిరిపడి లేచి కూర్చుంది దివ్య.

ఆమె గుండెలు ఎగిరెగిరి పడుతున్నాయి. ముచ్చమటల్తో బట్టలు తడిసి ముద్దయ్యాయి.

కొన్ని నిమిషాలగ్గాని ఆ షాక్ నుంచి తేరుకోలేకపోయిందామె.

ఎంతదారుణమైన కల.

లేచి మంచినీళ్ళు తాగి మళ్ళీ పడుకుంది.

అవునూ అలాటి కల ఎలా వచ్చింది?

అవాళ్టి పేపర్లో చదివిన వార్త గుర్తొచ్చింది.

హిమాలయాలమధ్యలో అలకానంద నది (ఈ నది భాగీరథితో కలిసి గంగానది అవుతుంది) సమీపంలో కాండ, కుమాన్, గర్వాల్ అనే ప్రాంతాల్లో ప్రతి ఏటా డజన్ల కొద్దీ దున్నపోతుల్ని బలిస్తుంటారు. ఇదంతా మంజు భోగ్ అనే దేవత ప్రీత్యర్థంచేస్తూంటారు.

ఎత్తైన పర్వతాలనెక్కించి బలి ప్రదేశానికి వాటిని తీసుకెళ్తూంటారు. మార్గమధ్యంలో కొన్ని జారిపడి చనిపోతాయి. అంతులేని చిత్రవధననుభవిస్తూ ఎక్కలేక ఎక్కిన జంతువులన్నిట్నీ వరుసగా నిలిపి ఒకటి తర్వాత ఒకటిని బలిస్తారు. ఆ ప్రాంతంలో వేలాది జంతుకళేబరాల గుట్టలున్నాయిట.





కేవలం దున్నపోతుల్నే ఇలా ఎందుకు వధిస్తున్నారని పరిశీలిస్తే అసలు విషయం బయటపడింది.

పర్వత ప్రాంతాల్లో దున్నపోతుల్ని పొలం దున్నటానికో బండ్లు లాగడానికో వుపయోగించ లేరు. పైగా ఆహారపు కొరత ఎక్కువగా వుంటుంది. దానికి తోడు ఆ ప్రాంతపు పొట్టి ఆవుల్లా అవి కొండలూ గుట్టలూ ఎక్కలేవు. వాటి సైజూ బరువూ అందుకనుకూలించవు.

అంచేత అక్కడి ప్రజలకి దున్నపోతు ఒక బరువైపోయింది. వాటినీరకంగా పాపం అంట కుండా మతం పేరు చెప్పుకుని ప్రతి సంవత్సరం జాతర చేస్తూ వధిస్తూంటారు.

సరిగ్గా ఇదే సూత్రం స్త్రీ మీద ప్రయోగిస్తున్నారీ కర్మభూమిలో!

భర్త చనిపోతే అతడి భార్య ఆ కుటుంబానికి బరువైపోతుంది. పరాయి ఇంటి బిడ్డ గనుక అది అనవసరపు బరువైపోతుంది. అనివార్యపు బరువైపోతుంది. అంతే కాదు ఆస్తి చీల్చుకుపోతుంది. అందుకనే ఆమెని కూడా భర్త చితిమీదకి తోసేసి ఆహా సతిఅయ్యిందంటూ చేతులూ జోడిస్తున్నారు!

అలా చెయ్యలేని వారు, చెయ్యవీలు లేనివారినీలేనిపోని ఆరళ్ళతో, ఆరోపణలతో బృందావనాలకీ, కాశీ, రుషికేష్‌లకీ తరిమేస్తున్నారు.

ఇంకొందరింకో అడుగుముందుకేసి ఏం చేస్తున్నారో తెలుసా?

వరకట్నం పేరిట, లాంఛనాల పేరిట, బహుమానాల పేరిట కోడలి పుట్టింటి నుంచి ఎంతవరకూ రాబట్టగలిగితే అంత వరకూ రాబడుతున్నారు. కోడల్నింకేం చేసినా ఆమె పుట్టింటినుంచి పైసలు రాలవని తేలిపోయాక ఆమెని సజీవదహనం చేసేస్తున్నారు. ప్రమాదం జరిగిపోయిందని కల్లబొల్లి కన్నీళ్ళు కార్చి చట్టం కన్నుగప్పుతున్నారు. కొడుక్కి మరో పెళ్ళి చేసి మళ్ళీ కట్నం గుంజుతున్నారు!

తన శీలం పవిత్రమని రుజువు చేసుకోడానికి అగ్నిలోకి దూకిందో సీత ఆనాడు!

తన వారికి సంపదలనీ, సౌఖ్యాలనీ సమర్పించడానిగ్గాను, మరో వనిత అగ్నిలోకి త్రోయబడుతుందీ నాడు!

అప్పుడూ ఇప్పుడూ కూడా బలిపశువు ఆడదే!

ఎందుకీ వైరుధ్యం? ఎందుకీ అన్యాయం?

ఒకేలా పుట్టినా, ఒకేలా పెరిగినా, ఒకేలా శ్రమిస్తోన్నా ఎందుకీ భూమ్యాకాశాల అంతరం?

ఎప్పుడు- ఎప్పుడు చెరిగి పోతుందీ అంతరం? ఆడా మగా ఇద్దరూ సమానమని సమంగా చూసే చల్లని రోజు ఎప్పుడొస్తుంది?

వేడి ఆలోచనలు మెదడులో సుళ్ళు తిరుగుతోంటే కన్నీళ్ళు చల్లగా జారుతోంటే నిద్ర పట్టక దొర్లసాగింది దివ్య.

అప్పుడు తలుపు తట్టారెవరో.

తనింటి తలుపు దగ్గర కాదేమోననుకుంది మొదట. కాని మళ్ళీ దబదబమని బాదేసరికి అదిరిపడుతూ లేచి కూర్చుంది.

ఇంత అర్ధరాత్రి వేళ తనింటికి...

భయం వెన్నులోంచి జరజర ప్రాకుతోంటే గుమ్మందగ్గరికెళ్ళి "ఎవరూ" అనడిగింది.

"నేను దివ్యా మీ వదిన్ని"

గబుక్కున తలుపు తెరిచింది. సుడిగాలిలా లోపలికొచ్చి తలుపేసేసింది సీత.

ఆమెనీ ఆమె వాలకాన్నీ చూసి విస్మయమయ్యింది.

"ఏమయ్యింది వదినా ఇలా వున్నావేం?"

నేలమీద చతికిలబడి బావురుమందామె.

"ఏంజరిగింది వదినా?"

"నేను బతకను...నేను బతకను... ఎవరికీ నా మొఖం చూపించలేను"

"అవేం మాటలు వదినా...ఎంతో జీవితాన్ని ముందుంచుకుని..."

"ఇంకేం జీవితం? మెడలో మూడు ముళ్ళు పడ్డనాడే మగువ బతుకు ముగిసిపోతుంది దివ్యా. ఆ తర్వాత ఆమె ఒక పెంపుడు జంతువు. సొంత ఆస్తి. చాకిరీ చేసే యంత్రం- అంతే అంతే..."

"అసలేం జరిగింది వదినా?"

"ప్రతిచోటా జరుగుతున్న భాగోతమే. పెళ్ళిలోనూ పెళ్ళయ్యాకా మా నాన్న ఎన్ని వస్తువులు కొనిచ్చారో, ఎన్నిమర్యాదలు చేశారో నీకు తెలుసు కదా. అయినా ఆయనకీ, అత్తయ్యకీ దాహం తీరలేదు. అదో ఇదో తెమ్మంటూ హింసిస్తూనే వున్నారు. వుత్తరాలు రాయిస్తూనే వున్నారు. పుట్టింటికి తరుముతూనే వున్నారు..."

"ఆమధ్య టీవీ కొనిచ్చారుగా. మళ్ళీ ఇంతలో ఏమొచ్చింది?"

"స్కూటర్ కావాలిట... ఉత్తరం రాయించారు. నాన్నవచ్చి కళ్ళనీళ్లతో ఇంకేమీ ఇచ్చుకోలేనని చెప్పేరు. నాకూతుర్ని చిత్రవధ చెయ్యవద్దంటూ అర్థించారు. ప్రార్థించారు. అలాగే అని చెప్పి ఆయన్ని పంపించారు. అంతా సద్దుమణిగిందని సంతోషించానుగాని మరో అవతారమెత్తుతారనుకోలేదు..."

"నిన్నేమైనా..."

"ఈనోటితో ఎలా చెప్పను దివ్యా! ఏ భార్యా ఏ భర్తనోటా వినకూడనిది. నాశీలం మంచిది కాదని ఇంట్లోంచి గెంటేశారు. ఎంత అరిచినా తలుపు తియ్యలేదు. ఎందులోనైనా పడి చావమని శపిస్తున్నారు. నేను నిప్పులాంటి దాన్నని వాళ్ళకీ తెలుసు. అయినా నా పీడ తొలగించుకోడానికి ఏ ఆడదీ మోయలేనంత అభాండం వేసేశారు నా మీద. ఇప్పుడేం చెయ్యను చెప్పు? ఏ అగ్నిలోకి దూకి శీలపరీక్ష చేసుకోను"

బావురుమందామె.

"ఊరుకో వదినా వూరుకో... కొందరు మగవాళ్ళు ఆడవారిని బానిసగా చూస్తున్నారని గొంతు చించుకుని అరుస్తున్నాం. కాని కొందరాడవాళ్ళు- ఆడపిల్లల్ని కన్న తల్లులు కూడా వాళ్ళతో చేతులు కలిపి మరో ఆడపిల్ల పీక కోయడానికి సిద్ధపడుతున్నారంటే ఇంక ఆడపిల్లల రోదన వినేదెవరు? రక్షించేదెవరు? స్త్రీకి స్త్రీ శత్రువు కానినాడే మగ దౌష్ట్యపు కోరలు పీకవచ్చని మహిళలంతా గుర్తించేవరకూ మనఘోషకి అంతం వుండదు. వదినా ప్రపంచ మహిళల్లారా ఏకంకండి అని గొంతు చించుకుని అరవాలని వుంది వదినా!..."

దివ్య వాక్ప్రవాహం వింటూ విస్మితయై చూస్తూండిపోయింది సీత. ఆమె మెదడు పొరల్లో ఏదో సంచలనం వుద్భవించసాగింది.

ఒక ప్రమిద మరో ప్రమిదని వెలిగిస్తుంది.

ఒక ప్రమద మరో ప్రమదని కదిలిస్తుంది.

పది కదలికలు చేతులు కలిపితే ఈ సమాజాన్ని కుదిపెయ్యగలవు!

★ ★ ★

అతికష్టంమీద తెల్లవారింది ఆ ఇంట్లో వారికి.

అర్ధరాత్రినుంచీ గోతికాడి నక్కల్లా కాచుకూర్చున్నారు మహంకాళీ, ఆంజనేయులూ, రామారావూనూ.

"మీ కోడలు కాలువలోపడో, చెట్టుకి వురిపోసుకునో, కారుకింద పడో, చనిపోయిందన్న చల్లని కబురు ఎవరైనా తెస్తారని ఆశగా ఎదురుచూస్తూ చూస్తూ వుండగానే తెల్లవారిపోయింది.

తెల్లగా వెలుగుకూడా వచ్చేసిందిగాని ఎలాంటి కబురూ లేదు కాకరకాయా లేదు."

అబ్బా... అని ఆవులించి అన్నారు ఆంజనేయులు "ఇంక లేచి తెమలండి"

"సీత సంగతి తెలీకుండా..."

"మీరేదేదో అనుకుంటున్నారుగాని నాకైతే నమ్మకం లేదు. తిన్నగా పుట్టింటికి పోయి వుంటుంది" ఆంజనేయులన్నారు.

"అదైనా ఇదైనా ఫర్లేదు నాన్నా. మధ్యలో..." రామారావు ఆగాడు.

"మధ్యలో ఇంకేదారుందిరా గోదావరి తప్ప"

"పోలీసు రిపోర్టిస్తే..."

"దాని మొఖం... దానికంత ధైర్యం ఎక్కడిదిరా... పిల్లిపిల్ల!" కొట్టి పారేసింది మహంకాళి.

"కట్టేసి కొడితే పిల్లి కూడా ఎదురు తిరుగుతుందే పిచ్చిదానా. అందుకు శాస్త్రాల్లో కావల్సినన్ని దాఖలాలున్నాయి"

"ఒకవేళ దివ్య దగ్గరికెళ్తే..."

"నిజమేరా అబ్బాయ్. ఆ బరితెగించిన దాని దగ్గరికెళ్ళిందంటే కొంపకి ముప్పు తెచ్చిందన్నమాటే!"




"పోలీసు రిపోర్టిస్తే గొడవవుతుందమ్మా. కట్నంకోసం రాచి రంపాన పెడుతున్నామని కేసుపెడితే రెండుమూడేళ్ళు జైలు శిక్ష వేస్తారే. ఉద్యోగంకూడా పోతుంది..." గాభరాగా అన్నాడు రామారావు.

"అది వుత్తుత్తి రిపోర్టిస్తే మనకి శిక్ష వేసేస్తారేమిట్రా నీ పిచ్చిగానీ"

"న్యాయస్థానానికి చెవులేగాని కళ్ళు లేవన్నది మాత్రం నిజం"

తండ్రి మాటలకి మరీ బెదిరాడు రామారావు.

"దివ్య ఇంటికెళ్ళి చూసొస్తానమ్మా"

"దాని దగ్గరికే వెళ్ళి వుంటే ఇప్పుడో ఇంకా స్పేవట్లోనో వస్తార్లేరా"

"మీ కోడలేదని ఇరుగుపొరుగువాళ్ళడిగితే ఏం సమాధానం చెప్పడమే" భార్యవంక నీళ్ళు నములుతూ చూశారు ఆంజనేయులు.

"సీత కన్పించడంలేదని మనమే పోలీసు రిపోర్టిస్తే?"

రామారావు ఆలోచనని వెంటనే కొట్టిపారేసింది తల్లి. "ఎందుకెళ్ళిపోయింది. ఏమైనా గొడవలున్నాయా అని మనవెంట పడతార్రా. అంతగా ఏదైనా అయితే నిన్న పుట్టింటి కెళ్తానని వెళ్ళిందని చెబుదాం"

"ఈ ఆలోచన దివ్యంగా వుంది. అంటు రోగులకీ పోలీసులకీ, ఎంతదూరంగా వుంటే అంత మంచిదన్నాడో తలమాసిన పండితుడు"

"సరిపెట్టండింక దాని వూసు ఏమీ జరగనట్టే మనుల్దాం- లేవండిహ"

మహంకాళి మాటలకంతా లేచి దినసరి కార్యక్రమంలో వడ్డారన్నమాటేగాని అందరి గుండెలూ గుబులు గుబులుగానే వున్నాయి. ఎప్పుడేమొచ్చి మీదవడుతుందో నని అదిరివడుతూనే వున్నారు.

రామారావు ఆఫీసుకెళ్ళడాని కుద్యుక్తుడవుతోంటే ఓ పోలీసు కానిస్టేబులొచ్చాడు.

ఎర్రటోపీ కంటబడేసరికి అందరి పై ప్రాణాలూ ఎగిరిపోయాయి.

అతడ్ని ఇరుగు పొరుగు చూస్తే రకరకాలుగా అనుకుంటారని లోపలికి పిలిచారు. కలవరపాటు కన్పించకుండా వుండటానికి తంటాలు పడుతోంటే "రామారావు ఎవరు?" అనడిగాడతడు.

"నే...నే... ఏం...?" కాళ్ళువణకిపోతోంటే తడబడ్డాడు.

"మిమ్మల్ని మా అయ్యగారు అర్జంటుగా రమ్మన్నారు"

"అయ్యగారంటే ఇన్స్పెక్టర్ చైతన్యా?"

"అవును మీకు తెలుసా?"

"తెలుసా అని నెమ్మదిగా అడుగుతావేమిటోయ్. చైతన్య మావాడు మాకు బాగా కావాల్సినవాడు. అవునుగాని ఇప్పుడెందుకు పిలిచినట్టూ?" ఆంజనేయులడిగాడు.

"తెలీదండీ"

"పోనీ ఎవరైనా అమ్మాయి రిపోర్టు లాంటిదేమైనా చేసిందా?"

"అమ్మాయా! ఏ అమ్మాయీ ఎవరమ్మాయీ?"

"అహ వూరికే అడుగుతున్నానంతే. మావాడి వల్ల ఏమైనా పొరబాటులాంటిదేమైనా జరిగిందేమోనని"

"ఈయనేం జేస్తాడు?"

"లక్షణమైన ఉద్యోగం చేసుకుంటున్నాడనుకో కాని ఏం చెప్పగలం ఎవరే దొంగ ఆరోపణచేస్తారో ఎవరెందులో ఇరికిస్తారో!"

"తప్పులేకుండా ఎందుకు చేస్తారు?"

"అంటే ఇప్పుడేదో తప్పుండే స్టేషన్కి పిలుస్తున్నారంటావా?" డీలా వడ్డారు ఆంజనేయులు.

"అది నాకు తెలీదు"

"అరెరె- అదేమిటండీ అబ్బాయిని నిలబెట్టే మాట్లాడుతున్నారూ. రా కానిస్టేబులు బాబూ కూర్చో కాఫీ తెస్తాను" అంటూ మర్యాదలు చేసింది మహంకాళి.

"ఇప్పుడేం చెయ్యటం?" వంటింట్లో చేరి ముగ్గురూ గునగునలాడారు.

"పిలిచింది నిన్ను గనుక నువ్వే వెళ్ళాలి"

"నన్నొక్కడ్నే ఎందుకు పిలిచారంటావు నాన్నా"

"ఎందుకేవిట్రా పిచ్చి నన్నాసీ. సీత మొగుడివి. నిన్ను గాకపోతే మమ్మల్ని పిలుస్తారా? నీకేం భయంలేదులే. చైతన్య మనవాడే"

"కాని నా మీద పీకలదాకా కోపమే. అతడ్తో క్లోజ్‌గా వుండొద్దని దివ్యని చాలాసార్లు హెచ్చరించానుగా. చెప్పేవుంటుంది. ఆ కోపం కడుపులో పెట్టుకుని... పోనీ నువ్వు కూడా రా నాన్నా"

"ఇంకా నయం... పోలీస్‌స్టేషన్ అన్నమాట చెవినబడితేనే నాకు చలిజ్వరం వచ్చేస్తుంది" చలిజ్వరం వచ్చిన వాళ్ళా వణికిపోతూ అన్నాడు ఆంజనేయులు.

"నీ వెనక మేమంతా లేమా వెర్రి నాన్నా క్షేమంగా వెళ్ళి లాభంగారా" మహంకాళి అంది.

"వెళ్ళక తప్పదా?"

"ఎలా తప్పుతుందిరా. చేసుకున్నవాళ్ళకి చేసుకున్నంత మహాదేవ అన్నారు!"

వుస్సురంటూ కానిస్టేబుల్ని అనుసరించాడు రామారావు.

స్టేషన్లో ఎలాటి పరిస్థితి ఎదురవ్వనున్నదో అని పరివరి విధాల మధనపడుతున్నాడు. సీత ఏ అఘాయిత్యానికో పాల్పడి వుంటుందనుకుంటూ భయపడుతున్నాడు. ఆమెతో కఠినంగా ప్రవర్తించకుండా వుండాల్సిందని ప్రప్రథమంగా పశ్చాత్తపపడుతున్నాడు.

స్టేషన్లో అడుగుపెడుతోంటే కాళ్ళు వణికి తడబడ్డాయ్.

"రామారావు- రా-రా-" చిన్నగా నవ్వుతూ ఆహ్వానించాడు చైతన్య.

అతడి వాలకం చూసి ఖంగుతిన్నాడు రామారావు. అతడు నవ్వుతున్నాడు. అంటే తను అనుమానించినట్టు సీత...

చుట్టూ చూశాడు. అంతా మామూలుగానే కన్పించింది. సీత ఆత్మహత్యగాని అలాటిదే మరోటిగాని చేసుకునుంటే వాతావరణం ఇలా వుండదన్పించింది. తను లేనిపోని భయాలతో బెదరి పోయినందుకు సిగ్గుపడుతూ గుండెల్నిండా వూపిరి పీల్చుకుని వదిలాడు.

అతడివంక చిత్రంగా చూశాడు చైతన్య.

"అలాగున్నావేమిటి? గుండెలమీంచేదో పెద్ద బరువు తొలగినట్టు!"

"అహ అదేంకాదు. నన్నెందుకు పిలిచావోనని..."

దివ్యా, చైతన్యా జంటగా గదిలో వుండటం తను చూసిన సంగతి అతడు చూశాడేమోనన్పించిందొక్క క్షణం. అదే నిజమైతే తనని హెచ్చరించటానికి పిలిచి వుంటాడు. అందుకే తన దర్పం, అధికారం ప్రదర్శించడానికే స్టేషన్కి పిలిచాడన్నమాట!

అతడి మనస్సు కరకుగా, మొఖం వికృతంగా మారసాగింది!

"నిజానికి నిన్నిక్కడికి పిలిపించి మాట్లాడటం మర్యాదకాదు. కాని మన టైమింగ్స్ దృష్ట్యా తప్పులేదు. ఏమీ అనుకోవనుకుంటాను"

సంశయంగా చూస్తూండిపోయాడు.

"నీవు గ్రహించే వుండొచ్చు. దివ్య అంటే నాకెంతో ఇష్టం. ఆమెని మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను. పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను. అదృష్టవశాత్తు దివ్య కూడా ఒప్పుకుంది. దివ్య సౌఖ్యం కోరే అన్నవీ యువకుడివీ. పరిస్థితినీ, మారిన కాలాన్నీ మారుతున్న విలువల్నీ పెద్దవారికన్నా బాగా అర్థంచేసుకుంటావనుకుంటున్నాం. పెద్ద వాళ్ళని నువ్వే ఒప్పించాలి. అఫ్ కోర్స్- ఎవరొప్పుకున్నా లేకున్నా ఈ పెళ్ళి జరిగి తీరుతుందనుకో. అయినా ఆ గౌరవం పెద్దవారికి దక్కాలని నిన్ను పిలిచాను..."

"ఇందులో నేనేం చెయ్యగలను?"

"ఏమైనా చెయ్యగలవు. మీ అమ్మా నాన్నని ఒప్పించగలవు. నా కోసం కాదు దివ్య తృప్తి కోసం"

"ఇదంత ఆషామాషీ వ్యవహారం కాదు. వంశప్రతిష్ఠల్నీ గౌరవమర్యాదల్నీ సాంప్రదాయాల్నీ ఆచారవ్యవహారాల్నీ ప్రశ్నించే జటిల సమస్య. నష్టమొచ్చినా అప్రతిష్ఠ వచ్చినా మాయని మచ్చ వచ్చినా మాకేగాని నీకు కాదు. నిన్నంతా విధవని వుద్ధరించిన ఘనుడిగా





పొగడుతారు. కాని...''

"ష్... అలాంటి పొగడ్తలకోసం నేనీ అడుగు వెయ్యటం లేదు. కేవలం దివ్య కోసం. నా కోసం- అంతే''

ఏదో తెలీని ఆవేశం, వుక్రోషం ఆవహించగా "నా కంఠంలో ప్రాణం వుండగా ఈ పెళ్ళి జరగదు- జరగనివ్వను'' అనుకున్నాడు.

దివ్య చెంపలు వాయించి ఇంటికి ఈడ్చుకు పోదామని తిన్నగా ఆమె ఇంటికెళ్ళాడు.

తాళం కప్ప వ్రేలాడుతూ కన్పించింది.

"ఎక్కడికెళ్ళుంటుంది?'' పెదవి కొరుక్కున్నాడు.

"ఆంటీ కోసమా అంకుల్'' పరుగెత్తుకుంటూ వచ్చింది బుజ్జి.

"అవును పాపా! ఆంటీ ఎక్కడికెళ్ళింది? ఆఫీసుకా?''

"వూరికెళ్ళింది''

"వూరికా? ఒక్కత్తే వెళ్ళిందా లేక కూడా ఇంకెవరైనా వున్నారా''

"నేను చూళ్ళేదంకుల్''

"రాత్రి ఒకమ్మాయి దివ్య దగ్గరికొచ్చిందా?''

"పడుకునేప్పుడు చూశాను. ఆంటీ ఒక్కత్తే వుంది''

మరి... సీత ఏమైనట్టు?

మిలియన్ డాలర్ల ప్రశ్న!




"సతి ఒక ఆచారంకాదు హత్య''

"సతీ సహగమనం సమాజ తిరోగమనం''

"మహిళల్ని మంటలకాహుతి చెయ్యకండి''

"వితంతువుల సజీవదహనం అమానుషం''

"సతిని సమర్థించే శాస్త్రాల్ని తగలబెట్టండి''

"సతి సిగ్గు సిగ్గు!''

"మాకున్యాయంకావాలి! మేం కూడా మనుమలమే!''

"మాకు సమానత్వం కావాలి!''

"సతి దేశానికి తీరని కళంకం!''

"మానవతికి మాయని మచ్చ సతి''

"దీపాదేవి హంతకుల్ని వురితీయాలి''

"సతీ పూజల్ని నిషేధించాలి''

"చున్రీ వుత్సవాన్ని నిరోధించాలి!''

దిక్కులు పిక్కటిల్లేలా నినాదాలు మార్మోగటంలేదు.

మరి?

ఆ నినాదాలు రాసిన అట్టలూ బేనర్లూ గాజులు ధరించిన చేతుల్తో పట్టుకుని మౌన శంఖారావం చేస్తూ సాగిపోతున్నారు.

అవును... గాజులు ధరించిన చేతులే. పిడికిళ్ళు బిగించి రాష్ట్రరాజధానిలో రోడ్లమీద నిరసన ప్రదర్శన చేస్తున్నాయి.

మౌనంగా నడుస్తూ చూపుల చురకత్తుల్తో మెదళ్ళకి పట్టిన రాతి యుగపు బూజు పొరలు చింపి ఆలోచనల్ని రగిలిస్తున్నారు వారు.

రాజకీయ పార్టీలూ మతాలూ కులాలూ- వేటితోనూ సంబంధం లేకుండా యావత్ స్త్రీ ప్రపంచం కదలివచ్చింది సతి రాక్షసాన్ని గర్హిస్తూ, ప్రభుత్వ ఉదాసీనత చూసి గర్జిస్తూ!

వారందరి మనోఘోష ఒక్కటే.

సతి అనే అనాగరిక పైశాచిక ఆచారాన్ని నామరూపాల్లేకుండా నాశనం చెయ్యండి! దీపాదేవిని బహిరంగంగా హత్య చేసిన హంతకుల్ని వెలివెయ్యండి సృష్టికి ప్రతిరూపమైన స్త్రీ శక్తినీ గుర్తించి ఆదరించండి!

లేదా-

స్త్రీ జాతి మేల్కొంది. ఏకత్రాటిపై నడుస్తోంది. శక్తి స్వరూపిణియై విలయతాండవం




చేసి పురుషాహంకారాన్నీ పురుషాధిక్యతనీ పితృస్వామ్యాన్నీ అణగద్రొక్కేస్తుంది. స్త్రీ పురుషులిద్దరూ సరిసమానమనే సమాజస్థాపనకి నాంది గీతం పలుకుతుంది.

ఇది హెచ్చరికకాదు. దెబ్బతిన్న ఆడమనస్సు చేస్తోన్న ఆక్రందన

ప్రదర్శన కారులంతా సుశిక్షిత సైనికుల్లా సచివాలయంవైపు బారులుగా సాగిపోతోంటే ముక్కుమీద వేలుంచుకుని చూస్తూండిపోయారు పోలీసులు. ఇంతవరకూ ఇంత క్రమశిక్షణతో ఇంత శాంతియుతంగా జరిపిన వూరేగింపుని వాళ్లు చూడలేదుమరి.

రకరకాల కోణాల్లోంచి ఫొటోలు తీస్తూ మధ్య మధ్య ప్రేక్షకుల కామెంట్లనీ రియాక్షన్‌నీ రికార్డు చేస్తోంది దివ్య.

వూరేగింపు సచివాలయం ముందాగింది. గేట్లు వేసేసి వున్నాయి. ఆ ఆవరణంతా ఆయుధాలు ధరించిన సీఆర్పీ జవాన్లతోనిండిపోయింది.

అయినా నిగ్రహం కోల్పోలేదు ప్రదర్శనకారులు.

"ముఖ్యమంత్రిని కలిసి విజ్ఞాపన పత్రం ఇవ్వదలిచాం" మహిళా నాయకులన్నారు.

"క్షమించాలి... ఆయనిప్పుడెవర్నీ కలినుకోలేరు"

"ఆయన సెక్రటేరియట్లో లేరా?"

"వున్నారు కానీ..."

"అర్థమయ్యింది. మాటి మాటికీ ఢిల్లీ పరుగెట్టడానికి ముఖ్యమంత్రికి కావల్సినంత టైము వుంటుంది. పరిపాలనాయంత్రాంగాన్ని గాలికొదిలి వరుసగా నాలుగురోజులు ఓ మారుమూల గ్రామంలో జరిగిన ఓ చోటా బాబాగారి జన్మదిన వేడుకల్లో పాల్గొనడానికి టైము వుంటుంది. కాని రాష్ట్రనలుమూలల్నుండీ మండే గుండెల్తో వచ్చిన ఆడబడుచులతో రెండు నిమిషాలు మాట్లాట్టానికి తీరిక లేదన్న మాట. ఓకే... ప్రజలెన్నుకున్న ముఖ్యమంత్రికి ప్రజల ఘోషవినే ఓపికా తీరికా దొరికే వరకూ నిరీక్షిస్తాం. ఎంతైనా ఓర్పులో భూదేవంతటివాళ్లం కదా, తరతరాల్నుంచీ యుగయుగాల్నుంచీ పురుష ప్రపంచంచేత అణగద్రొక్కబడుతున్న వాళ్లం కదా, వాటికిది ఇంకో పుదాహరణ లేక కొద్దిపాటి పొడిగింపు అనుకుంటూ నిరీక్షిస్తాం. మా సహనం అడుగంటే వరకూ నిరీక్షిస్తాం. ఆ తర్వాతేమవుతుందో మీరూ మీ ముఖ్యమంత్రీ చూద్దురుగాని"

నిప్పుల వర్షంలా కురిసిన వాగ్ధాటికి అదిరిపోయారు పోలీసు అధికారులు. కొందరు లోపలికి పరుగెట్టారు.

కూర్చోమని సైగ చెయ్యటం ఆలస్యం ఎక్కడివాళ్లక్కడ బైఠాయించారు. సెక్రటేరియట్ ప్రాంతపు రోడ్లన్నీ స్త్రీ జనంతో నిండిపోయాయి. ట్రాఫిక్కూ ఆగిపోయింది. రాజధాని గుండె అదిరిపడిందొక్కసారే!

ఏ విదేశీయులో ఏ విమానంమీంచో ఆ దృశ్యం చూస్తే రాజధానిని స్త్రీలు ఆక్రమించి హస్తగతం చేసుకున్నారని భావించొచ్చు.

సెక్రటేరియట్లోని తన రూమ్ కిటికీలోంచి ఆ దృశ్యం చూసిన ముఖ్యమంత్రి సరిగ్గా అలాగే భావించారు. కాళ్లల్లోంచి వెన్నులోంచి వణకు పుట్టుకొచ్చింది.

వెంట్రుకల్లేని తలమీంచి కారిపోతున్న చెమటని తుడుచుకుంటూ కూలబడ్డారు కుర్చీలో అక్కడే వున్న ఇతర మంత్రులూ అధికారులూ చిత్రంగా చూస్తూండిపోయారు.

ఇందులో ఇంతగా కొట్టుకు పోవాల్సిన సంగతేముందో అర్థంగాక విస్తుపోతున్నారు వాళ్లంతా.

కాని ముఖ్యమంత్రి ఆందోళనకి కారణాలువేరు.

ఆయన గురువుగారైన ఆనందబాబాగారి జన్మదిన వేడుకల్లోనూ ఆ సందర్భంగా ఏర్పాటుచేసిన యజ్ఞంలోనూ పాల్గొని క్రితం రోజునేవచ్చారు నగరానికి. దీపాదేవి సతివార్త పత్రికల్లో వచ్చేసరికి ఆయన అక్కడే వున్నారు. దాన్ని పెద్దగా పట్టించుకోలేదు కూడా. బాబాగారు ఆ యజ్ఞం కేవలం ఆయనకోసం అంటే ఆయన పదవి సురక్షితంగా వుండటం కోసం చేస్తోన్నందున నాలుగు రోజులు అక్కడే వుండిపోయారు.

రెండ్రోజుల క్రితం రాజధానికి రాగానే కొంద



రు పత్రికావిలేఖరులు సతి గురించి ప్రశ్నలు గుప్పించారు.

సతి గురించి జనంలో పెద్ద ఎత్తున ప్రతి స్పందన వస్తుందని ఏమాత్రం వూహించని ఆయన అదోమామూలుసంఘటనగా తేల్చేసి మాట్లాడారు. అంతేకాదు అదో మత సంబంధిత విషయమనీ ప్రభుత్వం మత విశ్వాసాల్లో జోక్యం చేసుకుని అడ్డుకోదనీ చెప్పే శారు.

ఇంటర్వ్యూ ముగిశాక తెలిసింది ఆ మూడో రోజున మహిళా సంఘాలు రాజధానిలో సతిని నిరసిస్తూ పెద్ద నిరసన ప్రదర్శన నిర్వహించ నున్నారని.

కుడితిలోపడ్డ ఎలుక చందమయ్యిందా యన స్థితి.

ఆ ప్రదర్శన విజయవంతమైతే అసమ్మతి వాదులు దాన్ని వుపయోగించుకుంటే తన పదవి చేజారిపోవచ్చన్న భయం పట్టుకుంది. వెంటనే సతికి కారకులైన వారిని అరెస్ట్ చేసెయ్యమని ఆజ్ఞలు జారీచేసేశారు.

ఆ వార్తతోబాటే ఆ వార్తకన్నా ప్రముఖంగా సతిని సమర్థిస్తూ ముఖ్యమంత్రి చేసిన వాఖ్యల్ని ప్రచురించాయి పత్రికలు.

మ్రింగలేక కక్కలేక సతమతమవుతున్నారు. ఈ గొడవ నుంచి గౌరవంగా ఎలాంటి నష్టమూ లేకుండా బయటపడటం ఎలాగా అని తలక్రిందులవుతోంటే గోరుచుట్టు మీద రోకలిపోటులా మహిళా ప్రదర్శన!

వుస్సురని నిట్టూర్చారు:

ఈ మహిళల్లో ఓటున్న వారిలో నూటికి డబ్బై అయిదుమంది తమ పార్టీకి ఓటుచేసి వుంటారనడంలో సందేహం లేదు. నిజం చెప్పాలంటే తమ పార్టీ బలమంతా మహిళా ఓట్ల బ్యాంకులోనేవుంది. అంచేత వాళ్లని నొప్పించటం వ్యతిరేకించటం ఏ రకంగానూ క్షేమంకాదు. ఓట్ల బ్యాంకుకి ఏమాత్రం దెబ్బ తగిలినా ప్రధాని సహించరు. అసలే తన పేరు ప్రతిష్టలు రోజురోజుకీ దిగజారుతున్నాయని బెంబేలు పడుతున్న ఆయన ఒక్క ఫోన్ కాల్‌తో తనని పీకేసి మరొకర్ని ముఖ్యమంత్రి గద్దె మీద కూర్చోబెట్టడానికి కూడా వెనుకాడరు.

మరంచేత ఈ స్త్రీ వాహినికి అడ్డుతగిలి ఆయిపు లేకుండా పోయేకన్నా అందులో కొట్టుకుపోయి ఒడ్డు చేరడం అన్నివిధాలా తనకీ తన పదవికీ శ్రేయస్కరం.

మరొక్క క్షణం వృధా చెయ్యకుండా పదండి అంటూ కదలి హుటాహుటిని బయటికొచ్చేశారు.

"గేట్లు వేసిందెవరు? నా సోదరీ మణుల్ని గడప బయట నిలిపిందెవరు? సచివాలయమంటే ఏమిటనుకున్నారు? ఇది ప్రజా దేవాలయం. ఇక్కడందరికీ ప్రవేశముంది. తెరవండి గేట్లని" నాటకీయంగా అరిచారు ముఖ్యమంత్రి.

త్రుటిలో తెరుచుకున్నాయి గేట్లు.

గబగబా ముందుకొచ్చి ముందు వరుసలో కూర్చున్న మహిళా నాయకుల ముందు నిలబడ్డారు. ఆయన కళ్లనుండి కన్నీళ్లు జలజలారాలాయి.

"సొదరీమణులారా క్షమించండి. అత్యవసరమైన సమావేశంలో వున్నందున వెంటనే వచ్చి మిమ్మల్ని కలుసుకోలేకపోయినందుకు క్షమించండి"

చేతులు జోడించారు.

మహిళా నాయకులు కలవరపడ్డారు

మహిళల్లో కలకలం లేచింది.

"నాతోడబుట్టిన అక్కలారా! చెల్లెళ్లారా! మీ గుండెల్లో రగులుతోన్న అగ్ని జ్వాలలవేడి ఏమిటో, ఎంతటిదో నాకు తెలుసు. దేవపురంలో జరిగిన అమానుషకాండకి మీరెంతగా కదిలిపోతున్నారో నాకు తెలుసు. మీరేందిగులు పడకండి,కృంగిపోకండి. మీకు అండగా మేం వున్నాం, ప్రభుత్వం వుంది, మా పార్టీవుంది, మన ప్రధానివున్నారు"

"దేశానికి తలవంపులు తెచ్చిన సతిని ప్రపంచమంతా ఖండిస్తోన్నా ప్రధాని ఇంతవరకూ ఖండించనేలేదు" ఓ యువతి కంఠం ఖంగుమంది.

కలవరపడ్డారు మంత్రివర్యులు. పిమ్మట చిద్విలాసంగా నవ్వేరు.

"పత్రికల్లో అచ్చయిన ప్రతిముక్కా నిజం





అనుకుంటారు మీరు. అంతెందుకు నిన్న కొన్ని పత్రికలు మా గురించెన్నో అవాకులూచ వాకులూ రాశాయి. అవన్నీ నిజాలని నమ్మ కండి. అదంతా రాజకీయ దురుద్దేశంతో రాసిన రాతలు. మమ్మల్నీ మా ప్రభుత్వాన్నీ అప్రతిష్టపాలు చెయ్యాలని పన్నిన భయంకర కుట్ర. లేకపోతే మహిళోద్ధరణకి ఎన్నో చేసిన మేం సతిని సమర్థించగలమా? మేమే కాదు చీమూ నెత్తురూ వున్న ఎవరూ సమర్థించరు గాక సమర్థించరు. నన్ను విశ్వసించండి. సతి ఒక దానవచర్య. హేయాతిహేయమైన ఘాతుక చర్య. దాన్ని మేం తీవ్రాతి తీవ్రంగా ఖండిస్తున్నాం..."

చప్పట్లు మార్మోగాయి.

ముఖ్యమంత్రికి వుత్సాహం వుద్రేకం వచ్చే శాయి.

"మన రాష్ట్రానికే కాదు మొత్తం దేశానికే అప్రతిష్టకరమైన అనాగరిక సతీ సహగమనా న్ని మేం గర్హిస్తున్నాం. ఇంకెన్నడూ ఇలాటివి జరక్కుండా తగిన చర్య తీసుకుంటాం. కే వలం తగిన సమయానికి వార్త అందనందున సతీహత్యని నిలుపలేకపోయాం. అందుకే చింతిస్తున్నాం. అయినా మేం చేతులు ముడు చుకుని కూర్చోలేదు. వెంటనే సతికి బాధ్యులైన వారిని అరెస్ట్ చేయించాం. వారి మీద కఠినచ ర్య తీసుకోనున్నాం..."

"చుస్రీ వుత్సావాన్ని జరగనివ్వరాదు" వది కంఠాలు గర్జించాయి.

"అలాగే అక్కల్లారా... మీ మాట మాకు వేదవాక్కు. మీరు సృష్టికి ప్రతిరూపాలు. మీరు ఆగ్రహిస్తే సృష్టి ఆగిపోతుంది. జగన్మాత అంశతో పుట్టిన మీ అందరికీ నా వేనవేల ప్రణామాలు. చుస్రీ వుత్సవం జరక్కుండా తగిన ఏర్పాట్లు చేస్తాం. అవసరమయితే చట్టా న్ని మార్పు చేయడానికి వెనుదీయమని మీకు హామీ ఇస్తున్నాను"

వినమ్రంగా చేతులు జోడించారు.

మహిళా నాయకులిచ్చిన విజ్ఞాపన పత్రాల నందుకుని తృప్తిగా నిట్టూరుస్తూ తన ఆఫీసు రూములోకెళ్లేసరికి అక్కడ మంత్రి మృత్యుంజ యరావు రాజీనామా లేఖ కన్పించింది ముఖ్య మంత్రికి.

★ ★ ★

"సీత ఇంట్లోంచి వెళ్లిపోయి అప్పుడే మూ డు రోజులైపోయింది. ఇంతవరకూ దాని అతీ గతీ తెలీలేదు. ఎక్కడుందో ఏమిటో" ఆంజనే యులన్నారు.

అక్కడే వున్న రామారావు తలొంచేసుకుంటే మహంకాళి కయ్యమని లేచింది.

"పోయిందాని గొడవ మనకెందుకూ! పీడా పోయిందని సంతోషించక"

"దానికేమైనా అయ్యిందని తెలిస్తే కదా సంతోషించడం"

"ఏదో అయ్యే వుంటుంది. అవ్వకపోతే ఇన్నాళ్లెక్కడ దాక్కుంటుంది?"

"అది తెలిస్తే బాగానే వుండు. నిశ్చింతగా అన్నంతిందుం. రామారావుని చూడు గెడ్డం పెంచేసి మనోవ్యాధి పీడితుళ్ళాగా అయిపో యాడు"

"ఏరా... అంతలావు ప్రేమ పుట్టుకొచ్చే సిందేమిటి పెళ్లాం మీద" ఆశ్చర్యపడింది మహంకాళి.

"ఎంతైనా అగ్నిసాక్షిగా వేదమంత్రాల మధ్య శుభలగ్నాన మంగళ ప్రదమైన సూత్రాన్ని సీత మెడలో కట్టాడాయె. ఆ బంధం అంత తేలిగ్గా తెగుతుందా!" వ్యాఖ్యానించారు ఆంజ నేయులు.

"అదేం కాదు నాన్నా..."

"మరింకేవిట్రా?"

సిగరెట్టు తీసి వెలిగించుకుని గాఢంగా పొగపీల్చి వదుల్తూ అన్నాడు.

"సీత ఏమయ్యిందోనని ఆందోళనగా వుంది. దివ్య దగ్గరలేదు. పుట్టింటికి వెళ్లలేదు. అన్నీ ఎంక్వైరీ చేశాను. ఎక్కడా లేదు. ఎక్కడి కెళ్లి వుంటుందో ఏం చేసివుంటుందో అర్థం కావట్లేదు. నన్ను కారకుడిగా చిత్రిస్తూ తనే అఘాయిత్యానికో పాల్పడిందేమోనని భయంగా వుంది. నిశ్చింతగా వుండలేకపోతు న్నాను. నిద్రపోలేకపోతున్నాను"

"నువ్వు నిజంగా పిచ్చోడివేరా. అదెక్కడికో పోయి ఏ వురో పోసుకుంటే మనకేంరా. ఎవ డ్తోనో లేచిపోయిందని చెప్పి అందరి నోళ్లకీ

తాళం వేసేద్దాం. నెల తిరక్కుండా నిన్ను పెళ్లికొడుకుని చేసే పూచీ నాది. పెళ్లిలోనే స్కూటర్నీ కలర్ టి.వి.నీ వసూలు చేస్తానుచూడు''

''నాకూ ఆశగానేవుందమ్మా... కాని ఈ పీడ అంత తేలిగ్గా వదుల్తుందా అని నా అనుమానం. హత్య చెయ్యటం తేలికేగాని శవాన్ని మాయం చెయ్యటమే కష్టం అన్నారు. శవమే కదా హంతకుణ్ని పట్టిస్తుంది!''

''బాగా చెప్పేవురా. శవాన్ని మాయం చెయ్యగల మంత్రం తెలిసుంటే చాలామంది హంతుకులయ్యేవారు'' భార్య వంక వోరగా చూస్తూ అన్నారు ఆంజనేయులు.

''బుర్రలేకపోతే సరి... శవాన్ని మాయంచెయ్యడమేమీ బ్రహ్మ విద్యకాదు. ఎన్ని చోట్ల ఎందరు కోడళ్లని చంపటంలేదు. అవన్నీ వెలుగు చూస్తున్నాయా ఏమిటీ!''

మహంకాళి మాటల్ని మౌనంతో అంగీకరిస్తూండిపోయారు తండ్రీ కొడుకులు.

వారి మనస్సుల్లో విషపుటాలోచన మొలకెత్తి వేరూనసాగింది.

సరిగ్గా అప్పుడొచ్చారు సీతా, దివ్యానూ.

సీతని చూసి దెయ్యాన్ని చూసినట్లు జడుసుకున్నారు ముగ్గురూ.

ఒక్కరికీ నోట మాటరాలేదు. గుడ్లప్పగించి చూస్తూండిపోయారు.

''ఏమిటంతా శిలా విగ్రహాలైపోయారు. సీత ఇంకా బ్రతికివుందనా? తిన్నగా తిరిగి వచ్చిందనా?''

దివ్య మాటలకి వులిక్కిపడి సర్దుకున్నారు.

సీతని ఇంట్లోకి రావొద్దనీ ఈ ఇంట్లో చెడిపోయిన వారికి స్థానం లేదనీ అరుద్దామనుకుంది మహంకాళి. కాని నోరు పెగల్లేదు.

''అలా వురిమి చూస్తావేమ్మా... కడుపునబుట్టిన కూతుర్ని విధవగా కుళ్లిపొమ్మన్న తల్లివి కదూ. ఇంక కోడల్నేం ఆదరిస్తావు. అత్తా ఒకింటి కోడలే అనేలా గుర్తుంచుకుంటావు''

''దివ్యా! మళ్లీ ఏ మొఖం పెట్టుకునొచ్చావే సిగ్గులేనిదానా. తల చెడినా పునిస్త్రీలా తయారై సిగ్గూ శరం వదిలేసి తిరుగుతున్నావు. నలుగురూ మొఖం మీద వుమ్మేస్తున్నా చెరిపేసుకుని మగరాయుల్లా తిరుగుతున్నావు. నీదీ ఒక ఆడజన్మేనా! నీదీ ఒక బ్రతుకేనా! ఛీ...!''

కన్నతల్లి నోట్లోంచి ఛీత్కారాలు శూలాల్లా వచ్చి గుండెల్లో దిగబడుతోంటే మౌనంగా భరిస్తూండిపోయింది దివ్య.

''అంతటితో ఆగలేదమ్మా... మన పరువుని బజారుకెక్కించడానికి, మన కట్టుబాటు తప్పించి కులంలో నవ్వులపాలు చెయ్యడానికి మళ్లీ పెళ్లి చేసుకోబోతోంది'' వ్యంగ్యంగా అన్నాడు రామారావు.

''అపచారం! సాంప్రదాయాల లక్ష్మణరేఖని దాటేదానివి పుట్టేవన్నమాట. మా తల సిగ్గుతో చితికి పోవడానికే మా ఇంట పుట్టావన్నమాట. నిన్ను కన్న పాపానికి తలవంపులూ అవమానాలూ అన్నీ భరిస్తాం. కానొక్కటి గుర్తుంచుకో. లక్ష్మణరేఖని దాటిన సీతకేగతి పట్టిందో ఆచార సాంప్రదాయాలని కాలదన్ని వెళ్లిన ఏ ఆడపిల్లకైనా అదే గతిపడుతుంది''

''శపిస్తున్నావా నాన్నా?''

''శపించడం కాదే లోకులు కాకులై పొడుస్తారు. గ్రద్దలై రక్కుతారు. కుక్కలై కరుస్తారు. అనుక్షణం హింసించి చిత్రవధ చేస్తారు. నాలుగ్గోడల మధ్యవున్నంత కాలమేనే ఆడదాని బ్రతుక్కి సుఖమూ!''

''కాని భర్త అకాల మృత్యువాతపడినందున నాకు బ్రతుకూ సుఖమూ కూడా లేవన్నావు కదమ్మా''

''అది నీ తలరాత. దానికెవరేం జేస్తారు?''

''ఎవర్రాశారమ్మా ఆ రాత? చెయ్యని పాపానికి అంత శిక్ష విధించిందెవరమ్మా?''

''భగవంతుడు! గత జన్మ కర్మానుసారం నడుస్తుంది మన బ్రతుకు!''

''కాని నా బ్రతుకుని నేను నడుపుకుంటాను నాన్నా. నాకిష్టమైన రాతల్ని నానుదుట రాసుకుంటాను. కనబడని దేవుడు రాసిన రాతల్ని చెరిపేస్తాను. చెయ్యనినేరానికి శిక్ష వేస్తూ దేవుడిచ్చిన తీర్పుని ఎదిరిస్తాను. నా బ్రతుకు నా ఇష్టం. దాన్ని నా ఇష్టప్రకారం తీర్చిదిద్దుకుంటాను. పూలు రాలినా ముళ్లు ఎదురొచ్చినా సహిస్తాను, భరిస్తాను''





"భరించవే... నీలాటి సంకరులవల్లే మనధ ర్మాలూ ఆచారాలూ మైలపడిపోతున్నాయి. ప్రపంచంలో పాపం పెరిగిపోతోంది. ఒక ప్రక్క దీపాదేవి లాంటి మహా పతివ్రతలు సతీ సహగమనం చేస్తోంటే నీలాంటి కుక్క మూతి పిందెలు మళ్లీ పెళ్లిచేసుకుంటున్నాయి"

"నాన్నా!"

"వున్నమాటంటే వులుకెందుకే. నీలాటి వారివల్ల కాదూ కలికాలం మండిపోతుంట?" మహంకాళి ముందుకొచ్చింది.

"దివ్యా.... వారి మనస్తత్వాలు నీకు తెలుసు కదా. వారి నోట్లో నోరు పెట్టొద్దు. వారి నోటినుంచి ఎలాంటి మాటలు వెలువడుతున్నాయో వాళ్ల కే తెలీని అజ్ఞానులు,మూర్ఖులు!" అంది సీత మెల్లగా.

అసలు సంగతి వదలి ప్రక్కదారి పట్టినట్టు గుర్తొచ్చి అంది దివ్య "మనం తీరిగ్గా దెప్పుకుని తాపీగా చర్చించుకుందాంగానీ నేనిప్పుడీ ఇంటి ఆడబడుచుగా రాలేదు"

"ఓహో... వదినగారి తరపున వకాల్తా తీసుకునొచ్చావా?"

"అవునమ్మా... అందుకనే పనిగట్టుకుని ఇక్కడికొచ్చాను. లేకపోతే..."

"లేకపోతే ఏంచేద్దువ్?" రామారావు గద్దించాడు.

"చట్టం సహాయం తీసుకునే వాళ్లం"

"అంటే నీకన్న వాళ్లనీ తోడబుట్టిన వాడ్నీ కోర్టుచుట్టూ తిప్పి జైలుకి పంపిద్దువన్న మాట. ఎంతకి తెగించావే పాపాష్టిదానా!"

"ఇంటి గుట్టులంకకి చేటని..."

తండ్రి మాటల్ని మధ్యలోనే అడ్డుకుంది దివ్య "ఇది లంక అయితే చేటు తప్పదు నాన్నా"

"చాలు చాల్లే పెద్దచెప్పొచ్చావుగాని. బరితెగించింది చాలక వెధవ్వాగుడొకటా"

"ఇది వాగుడుకాదమ్మా హెచ్చరిక"

"ఆ హెచ్చరికేదో నీ వదినకి చెయ్యి. ఆడదానికి మానం ప్రాణం కన్నా ఎక్కువని చెప్పు. అడ్డమైన తిరుగుళ్లూ తిరిగే ఆడదానికీ విధవ అయ్యుండి కూడా పునిస్త్రీలా అలంకరించుకుని తిరిగే ఆడదానికీ, ఈ ఇంట్లోనే కాదు ఈ సమాజంలోనే స్థానంలేదు"

"అయితే మా ఇద్దర్నీ కూడా సజీవంగా చితికెక్కించి దహనం చేసెయ్యండి"

"దివ్యా!" భయంగా అరిచింది సీత.

"భయమెందుకు వదినా... అంతకు మించి వీళ్లేమీ చెయ్యలేరు!"

"మేమేం కసాయి వాళ్లంకాదే నోటికొచ్చినట్ట ల్లా వాగుతున్నావుగాని!" మహంకాళి అందుకుంది.

"ఇంటి మహాలక్ష్మిని అర్ధ రాత్రివేళ మెడబట్టి బయటికి గెంటడం కసాయిపనికాదా అమ్మా?"

"అది కాదు దివ్యా... అసలేం జరిగిందంటే..." ఆంజనేయులు కల్పించుకోబోతోంటే అడ్డుకుంది దివ్య.

"ఏం జరిగిందో నాకు తెలుసు. మీకు తెలుసు. మీకు తెలీందేమిటంటే కాలం మారిందని. ఏం చేసినా నోరుమూసుకుని పడివుండే రోజులు వెళ్లి పోయాయని. వరకట్నపు వేధింపులకి కాలం చెల్లిందని గ్రహించి మసలు కోవటం మంచిది. కోడల్ని కూతురిగా భావించి ఆదరించటం మంచిది. లేకపోతే చట్టం సంకెళ్లు వేస్తుంది. విలువైన జీవితాన్ని జైలు గోడల మధ్యనా నిరుద్యోగియై రోడ్ల మీదా పదుగురి హేళనలు భరిస్తూ గడపాల్సి వస్తుంది. మరోసారిలా కిరాతకంగా ప్రవర్తిస్తే క్షమించగల ఔదార్యం వదినకుందేమో గాని నాకు లేదు జాగ్రత్త"

తేలుకుట్టిన దొంగల్లా మిన్నకుండిపోయారంతా.

"నీ మేలు మర్చిపోలేను దివ్యా" కన్నీళ్లతో అంది సీత.

"బేలగా మాట్లడకు వదినా. బ్రతకటానిక్కావాల్సింది కన్నీళ్లుకాదు గట్స్. ఎప్పుడూ నిన్ను నీవు అబలగా భావించుకోకు. మౌనంగా భరించటం మంచితనం అనుకోవద్దు. భరిస్తున్నంతకాలం వేధిస్తూనే వుంటారు. ఒక్కసారి ఎదురు తిరిగితే తోకజాడిస్తారు. ఆడది అబల కాదు శక్తి స్వరూపిణి అన్నది కలలోకూడా

మర్చిపోకు వదినా... ఇక నిన్నెవరూ ఏమీ చెయ్యలేరు. చెయ్యాలని చూసిన వాళ్ళు చెల్లని నాణేలవడం ఖాయం. బ్రేవ్ మైడియర్ ఉమన్!''

''నువ్వంతగా చెప్పక్కర్లేదు దివ్యా... సీతని పువ్వుల్లో పెట్టుకుని చూసే బాధ్యత నాది. క్షణికావేశానికి లొంగిపోయి అబ్బాయి కోడల్ని ఇంట్లోంచి తరిమేశాడు. నిజమే చాలా తప్పైపోయింది. మేమెంతో నచ్చచెప్పేం. వాడు కూడా ఎంతో పశ్చాత్తాపపడి తిండీ తిప్పల్లేకుండా చిక్కి సగమైపోయాడు చూడు. గెడ్డమైనా గీసుకోకుండా ఆఫీసుకైనా వెళ్ళకుండా సీతని వెదుకుతూ కూర్చున్నాడు. పాపం వాణ్ణి తప్పుపట్టానికి లేదులే. ఎవరో సీత శీలం గురించి కారుకూతలు కూస్తే నమ్మేశాడు. చాకలివాడి మాటలు పట్టుకుని భార్య నొదిలేసిన రాముడు పుట్టినగడ్డ గనుక అప్పుడప్పుడూ అలా జరుగుతూంటాయి. భూదేవంత ఓర్మి గల మనమే సర్దుకుపోతూండాలి రామ్మా... సీతా ఇంక నిన్ను చల్లగా చూసుకుంటాం. ఎంతైనా మా ఇంటి సౌభాగ్యానివి కదా''

కోడల్ని కావలించుకుంది మహంకాళి.



"మీ అత్త చెప్పింది ముమ్మాటికీ నిజం సీతా. మావాణ్ని క్షమించి నూరేళ్ల నీ బ్రతుకు పసుపుకుంకాలతో తెల్లార్చుకో" ఆశీర్వదించారు ఆంజనేయులు.

"సారీ సీతా" రామారావు అన్నాడు.

సినిమాలోని ఆఖరి సీన్ గుర్తుకొచ్చింది దివ్యకి. సంతోషంగా వెనుదిరిగింది.

నిజానికి సినిమా అప్పుడే మొదలయ్యింది.

★ ★ ★

సురేఖా నర్సింగ్‌హోమ్‌కి టౌన్లో మంచి పేరులేదు.

సుఖరోగాల పేషంట్లూ, అక్రమ అబార్షన్ కేసులూ ఆసుపత్రికి జాస్తి అని కొందరు అదో రకంగా నవ్వుతారు కూడా.

అయినా డాక్టర్ నిరంజన్ ప్రాక్టీసూ ఆదాయమూ బాగానేవుంటుంది. ముఖ్యంగా పరిసర గ్రామాలనుంచి రోగులెక్కువగా వస్తూంటారు. వాళ్లతో ఓపిగ్గా మాట్లాడటం ఫీజు తక్కువగా తీసుకోవడం వారికి ప్రధాన ఆకర్షణ.

కొడిగట్టిన దీపంలావుండే సురేఖా నర్సింగ్ హోమ్ ఒక్కసారే వార్తలలో కొచ్చేసింది. అందుక్కారణం సతియైన దీపాదేవి భర్త మురళి అక్కడ మరణించడమే.

ఎందరో పత్రికా విలేఖర్లు డాక్టర్నీ నర్సుల్నీ ఇతర రోగుల్నీ ఎన్నో రకాలుగా ఇంటర్వ్యూ చేశారు. మురళి మరణానికి ముందు రెండ్రోజులు దీపాదేవి కూడా అక్కడే వుందేమో! ఆమె గురించీ ఆమె ప్రవర్తన గురించీ రకరకాల కథలూ విశేషాలూ బయటికి లాగారు.

దీపాదేవి మొహంలో దేవీ కళ కన్పించిందన్నారొకరు. ఏ దేవతో శాపవశాన మానవజన్మ ఎత్తి వుంటుందని ఆమెని చూడగానే అనుకున్నానన్నారింకొకరు. చీకటితోనే లేచి పద్మాసనం వేసుక్కూర్చుని ఏవో మంత్రాలు చదివేదన్నారొకరు. ఆమె ప్రక్కన వుంటే తనకెంతో ధైర్యంగానూ బాధారహితంగానూ వుందని మురళి అనే వాడని కొందరు చెప్పేరు.

ఏ టైముకి ఏమందు వేసుకోవాలో తాము చెప్పకుండానే ఆమె మురళికి వేసేదని ఆశ్చర్యం వ్యక్తపరిచిందో నర్స్.

"నేను డాక్టర్ని... అలౌకిక శక్తుల మీద నాకు నమ్మకంలేదు. అయినప్పటికీ ఒక సత్యం చెప్పడానికి వెనుకాడను. దీపాదేవి నా ఆసుపత్రిలో వున్న కొద్ది రోజుల్లో నా రోగుల్లో చాలా గొప్ప ఇంప్రూవ్‌మెంట్ కన్పించింది. వారిలో ఒక్కసారే ఇంత మార్పెలా వచ్చిందని ప్రశ్నిస్తే జవాబివ్వగల శక్తి నా విజ్ఞానానికి లేదు. బహుశా ఆమెనుంచి ఒకరకమైన మాగ్నెటిక్ పవర్ లేదా అలాంటిదే మహాశక్తి వుద్భవిస్తూండి వుండాలనీ అందువల్లే ఆమె ఇక్కడ వున్నప్పుడు రోగుల్లో అంత మార్పు వచ్చి వుండొచ్చనీ నా అనుమానం. స్పర్శించకుండానే కళ్లతో వస్తువుల్ని కదిలించగలిగిన వాళ్లూ వూచల్ని వంచగలిగినవాళ్లూ వున్నప్పుడు ఇదిమాత్రం అసాధ్యం అనెందుకనాలి. కాదంటే ఇది అరుదుగా జరిగే అసాధ్యం. అంతే తప్ప అసంభవం కాదని నా నమ్మకం" అన్నారు డాక్టర్.

మురళి చనిపోయిన బెడ్‌ని మరెవరికీ ఇవ్వకుండా సందర్శకుల కోసం అట్టేపెట్టేశారు. బెడ్ మీద దీపాదేవీ మురళిల పెళ్లినాటి ఫొటోని కూడా వుంచారేమో... సందర్శకులకదో ఆకర్షణైపోయింది. ఆసుపత్రికొచ్చే రోగులు కూడా ముందా బెడ్‌ని సమీపించి నమస్కరిస్తున్నారు.

మురళి మరణానికి అసలు కారణాన్ని అన్వేషించడానికొచ్చిన దివ్య ఆ తతంగం చూసి 'ఔరా మూఢభక్తి!' అని ముక్కుమీద వేలుంచుకుంది.

బ్రతికుండగానే కాల్చేసి దేవతయ్యిందని చేతులు జోడిస్తూ చంకలు కొట్టుకుంటున్నారు.

పతియే ప్రత్యక్షదైవం అన్నారు. భర్తవున్న చోటే భార్య ఇల్లు అన్నారు.

అంటే పతి లేకపోతే ఆమెకి దేవుడూ ఇల్లూ కూడా వుండరన్నమాట.

మరోరకంగా చెప్పాలంటే భర్తవినా బ్రతుకు లేదు. భర్త చనిపోతే భార్యకి బ్రతికే హక్కులేదు. అంచేత చంపెయ్యాలి. చావనంటే చితిమంటల్లోకి త్రోసేసి సతిని చేసెయ్యాలి.

ఇదేనా మన శాస్త్రాలూ పురాణాలూ సూరిపోసే నీతి?

అవును... అది మగనీతి... అందుకే పతి





పోతే సతి 'సతి' అవ్వాలి. సతి మరణిస్తే పతి మళ్లీ పెళ్లికొడుకవ్వాలి.

ఇదెక్కడి న్యాయం? ఇదెక్కడి ధర్మం?

రాయినీ రప్పనీ చెట్టునీ చేమనీ పామునీ పుట్టనీ కూడా భక్తితో పూజిస్తాం. కాని ఆడదాన్ని హీనంగా పనికిరానిదిగా అప్రయోజనకరంగా చూస్తాం. సంపదలా దానమిస్తాం. జూదంలో ఒడ్డుతాం. అవసరమైతే అమ్మేస్తాం. ఇష్ట ముంటే ఆదరిస్తాం లేకుంటే హింసిస్తాం కాదూ కూడదనుకుంటే చంపేస్తాం.

ఓహ్... ఎంత గొప్ప నాగరికత.

విధవకి బ్రతికే అర్హత లేదని చంపేస్తాం. చచ్చేక దేవతయ్యిందని కొలుస్తాం.

ఆహా... ఎంత గొప్ప సంస్కృతి...

ఈ కుహనా నాగరికతనీ ఈ బూర్జువా సంస్కృతినీ పెంచి పోషిస్తున్న మతాలూ మత వాదులూ మితవాదులూ ఛాందసులూ కుహనా శాస్త్రాలూ మన మెదళ్లని పట్టుకుని వ్రేలాట్టం మానేవరకూ మనకి విముక్తి వుండ దుగాక వుండదు.

"ఏమిటలా స్థాణువులా చూస్తుండిపోయారు? మీకేమైనా అలౌకిక శబ్దాలు విన్పిస్తున్నాయా?" డాక్టర్ నిరంజన్ అడిగాడు దివ్యని.

ఉలిక్కిపడి ఆయన్ని చూసింది "ఎవరికైనా విన్పించాయా?"

"కొందరన్నారు..."

"నాకు అభాగ్య స్త్రీల ఆక్రందనలు విన్పిస్తున్నాయి"

"చిత్రమేనే మీరు...?"

"నా పేరు దివ్య. జర్నలిస్టుని. మిమ్మల్ని ఇంటర్వ్యూ చేద్దామని వచ్చాను"

"గుడ్... యూఆర్ వెల్‌కమ్"

డాక్టర్ రూమ్‌లోకెళ్లి కూర్చున్నారు.

"మురళి కడుపునొప్పితో చనిపోయారట. కేవలం కడుపునొప్పివల్ల మరణం సంభవిస్తుందంటారా?"

"మంచి ప్రశ్నే. కడుపునొప్పి అంటే మామూలు నొప్పి కాదు ఒక రకమెన అపెండిసైటిస్"

"ఆపరేషన్ చేశారా?"

"లేదు. చెయ్యాలని ఏర్పాట్లు చేస్తోంటే ఈలోగా పరిస్థితి చేయిదాటిపోయింది"

"అంతకుముందు నాలుగైదురోజుల్నుంచీ ఆసుపత్రిలో వున్నారుకదా. దేని గురించి వున్నట్టు- ఐ మీన్ అనారోగ్యం ఏమిటిట?"

"ఇది అని చెప్పటం కష్టం. గేస్ట్రిక్ ట్రబుల్ వుంది. లంగ్స్ ట్రబుల్ వుంది. అలాటివే చిన్న చిన్న ఇతర కంప్లైంట్స్..."

"అంటే పెళ్లికి ముందునుంచీ అతడి ఆరోగ్యం సరైనది కాదంటారు?"

"అలాగని నేనన్లేదే" డాక్టర్ కొంచెం కలవర పడటం కనిపెట్టిందామె.

"అంతా అంటున్నారు మరి. మీరు వారి ఫామిలీ డాక్టరనీ ఇదివరకు మీ దగ్గరకి చాలా సార్లొచ్చారనీ..." చీకట్లో బాణం వేసింది.

"అఫ్‌కోర్స్. వారికి నామీద గురెక్కువ. అందుకే ప్రతిదానికీ నా దగ్గరకే వస్తుంటారు"

"మురళి అనారోగ్యం గురించి నేనడిగిన వివరాలు చెప్పనేలేదు"

నవ్వేశాడాయన.

"అతణ్ణి నేనే చంపేసినట్టు ప్రాసిక్యూట్ చేస్తున్నారేమిటి?"

"నిజం తెలుసుకుందామని"

"మీకు మురళి ఎలా చనిపోయాడో కావాలా లేక దీపాసతి ఎలా అయ్యిందో కావాలా?"

"రెండూనూ..."

"అయితే మొదటి దానికోసం డెత్ సర్టిఫికెట్ చూడండి. రెండోదానికోసం దేవపురం వెళ్లండి. మరి శలవా పేషంట్లు వెయిట్ చేస్తున్నారు"

"ఆఖరి ప్రశ్న. దీపాదేవికి మానవాతీత శక్తులున్నట్లు డాక్టర్‌గా మీరు నమ్ముతున్నారా?"

"నేను డాక్టర్నేకాదు మనిషిని కూడా. నా అనుభవాన్ని బట్టి నేను గ్రహించిందేమంటే మిగతా అందర్లో లేనిశక్తి ఆమెలో వుందనే"

"అంత శక్తివంతురాలు భర్త ఆరోగ్యాన్నెందుకు బాగుచేసుకోలేకపోయింది? భర్తనెందుకు రక్షించుకోలేకపోయింది?"

"సారీ... కర్మ సిద్ధాంతకర్తల్నాప్రశ్న అడిగితే

బావుంటుంది''

''థ్యాంక్స్''

డాక్టర్ ప్రవర్తన ఊళ్లో ఆ ఆసుపత్రికున్న పేరుని బట్టీ చూస్తోంటే మురళి మరణం వెనుక ఏదో నిగూఢ రహస్యం వున్నట్టే అన్పించసాగింది దివ్యకి.

ఆసుపత్రినుంచి వస్తోన్న కథలూ, బెడ్‌పూజా ఆమె ఆలోచనకి ఊతమివ్వసాగింది.

నర్సుల్నీ, రోగుల్నీ కూడా ఇంటర్వ్యూ చేసింది. చాలామంది చెప్పిందే మళ్లీ చెప్పారామెకి. చెప్పగా చెప్పగా వాళ్లక్కూడా దీవలో ఏదో దైవశక్తి వున్నట్టే అన్పించసాగింది.

ఒక నర్సు మాత్రం మొక్కుబడిగా జవాబివ్వటం దివ్యని ఆకర్షించింది. మరి రెట్టించకుండా వచ్చేసి ఆసుపత్రిలో తోటివారి ద్వారా ఆమె ఎడ్రస్సు తెలుసుకుంది.

రాత్రి తొమ్మిదిగంటల ప్రాంతాన తన రూమ్ కొచ్చిన దివ్యని చూసి ఆశ్చర్యంలో మునిగిపోయింది సిస్టర్ ఎలిజబెత్.

''మీరు... ఇప్పుడు... ఇక్కడ...''

''రాకూడదా సిస్టర్?''

''అహ... అది కాదు. నాతో మీకేం పనా అని...''

''తీరిగ్గా మాట్లాడదామని- లోపలికి రావచ్చా?''

''రండి... రండి''

ఆమె చదువు గురించీ, పుట్టిపెరిగిన ప్రదేశాల గురించీ అడిగి తెలుసుకున్నాక ''సతి గురించి మీ అభిప్రాయం ఏమిటి?'' అనడిగింది దివ్య.

''చాలా దారుణమండీ. తలచుకుంటేనే ఒళ్లు గగుర్పొడుస్తుంది. ప్రాణం పోయగలశక్తి లేనివారికి ప్రాణం తీయగల హక్కు ఎక్కడిది చెప్పండి? భార్య భర్త కోసమేననీ, ఆమె పూలు పెట్టుకున్నా చక్కని చీరకట్టుకొన్నా అన్నీ భర్త సుఖంకోసమేననీ నా హిందూ ఫ్రెండ్స్ చెబుతోంటే చాలా తమాషాగా అన్పించేది చదువుకునే రోజుల్లో. లేకపోతే మీరే చెప్పండి. ఆడది తనని కట్టుకున్న మగాడికోసమేనా? అతడు తప్ప ఆమెకింకోలోకం లేదా వుండదా వుండకూడదా?''

''నా ప్రశ్నలకి మీ సమాధానం ఏమిటో చెప్పండి ముందు''

''భర్తకోసమూ, తన కోసమూ, తన పిల్లల కోసమూ కూడా జీవించే స్త్రీయే ఉత్తమురాలంటాను. ఆడది కేవలం పత్నియే కాదు తల్లీ, గృహిణీ కూడా. భర్త పనులతోపాటు పిల్లల పనులూ, ఇంటి బాధ్యతలూ కూడా ఆమె చూడాలికదా. పతి మరణిస్తే అతడు అసంపూర్తిగా వదిలేసిన పనుల్నీ బాధ్యతల్నీ నిర్వర్తించటం భార్య బాధ్యత. ఆ బాధ్యతలు తనకడ్డంకిగా లేకపోతే తన జీవితాన్ని వ్యర్థం చేసుకోకుండా మళ్లీ పెళ్లి చేసుకోవాలి. మనస్ఫూర్తిగా చిత్తశుద్ధితో చెబుతున్నానీమాట. భర్త పోయిన ఏ స్త్రీనైనా ప్రశ్నించండి. భయంకరమైన ఒంటరితనం గురించే మాట్లాడుతుంది. ఆమె లోలోపల చెప్పలేనంత ఒంటరితనం గూడు కట్టుకునుంటుంది. అంచేత పశుపక్ష్యాదుల్లాగానే మనుషులకు కూడా జంట అవసరమంటాను. ప్రభువు మనకి జీవితాన్ని ప్రసాదించింది పూలభరిత వృక్షంలా బతకమనిగాని మోడులా బతకమని కాదుకదా''

దివ్యచూపు గోడకి తగిలించిన ఫొటోమీద పడటం చూసి చెప్పింది ఎలిజబెత్. ''అది నా మొదటి భర్త ఫొటో. పెళ్లైన నాలుగేళ్లకి ట్రెయిన్ యాక్సిడెంట్లో మరణించారు. మళ్లీ పెళ్లి చేసుకున్నాను. నాకిప్పుడు ఇద్దరు పిల్లలు. అయామ్ వెరీ హేపీ. నా సంతోషం చూసి నా మొదటిభర్త ఆత్మ కూడా సంతోషిస్తుందనే అనుకుంటాను. చనిపోయాక కూడా తన కోసం మరో నిండుప్రాణిని బలితీసుకునేంత క్రూరుడూ, స్వార్థపరుడూ కాదని నా నమ్మకం. చనిపోయేముందు నీ చితిలోవేసి నీ భార్యని బూడిద చెయ్యమంటావా అని ప్రశ్నిస్తే ఏ మగాడూ ఒప్పుకోడని నా ప్రగాఢవిశ్వాసం''

''ఎంత గొప్ప సత్యం ఎంత చక్కగా చెప్పేరు''

''మీకు పెళ్లయ్యిందా?''

హఠాత్తుగా అడిగేసరికి విస్తుబోయింది దివ్య.

''ఎందుకలా అడిగారు?''





''మీలో ఏదో ఉద్వేగం తన్నుకొస్తుంటేనూ...''

దివ్యకళ్లని పల్చని కన్నీటి పొరలు కమ్మేశాయి.

''ఏమయ్యింది? ఆర్యూ ఓకే?''

''ఫైన్...''

''మరి...''

''చెబుతాను. మీక్కాకపోతే ఇంకెవరికి చెబుతాను సిస్టర్. నాకూ పెళ్లయ్యింది. కాని పెళ్లైన మూడు నెలలకే ప్రమాదవశాత్తూ ఆయన చనిపోయారు...''

''మైగాడ్''

''అతడు చనిపోయినప్పటికన్నా తర్వాతే ఎక్కువ బాధేసింది. ఎక్కువ దుఃఖం కలిగింది. మా ఆచారాలూ, ఛాందస నమ్మకాలూ నన్ను విధవనిచేసి మూలన కూర్చోబెట్టాలని చూశాయి. నా బ్రతుకును మొగ్గలోనే తుంచేశాయి. నేను ఎదురుతిరిగాను. అయినవాళ్లు కూడా శత్రువులయ్యారు. చుట్టుపక్కలవాళ్లు వేలెత్తిచూపారు. వెక్కిరించారు. అడుగడుగునా ముళ్లు పరిచారు.

ఆ పంజరంనుంచి ఆ ఇరుకు గహ్వారంలోంచి, ఆ చీకటికొట్టంలోంచి బయటపడ్డాను. విశాలప్రపంచంలో అడుగుపెట్టాను. పెళ్లైనంత మాత్రాన, భర్త చనిపోయినంతమాత్రాన నేను నేనుగాకపోనని, నా బ్రతుకు బ్రతుకు కాకపోదని ధైర్యంగా నిలబడ్డాను. జీవితాన్నే ఛాలెంజ్‌గా తీసుకుని జర్నలిజాన్ని వృత్తిగా ఎన్నుకున్నాను. ఆడవారి కథల్నీ వ్యధల్నీ వెలికితీసి కన్నీట్లో అగ్నిరవ్వలు రగిలించాలన్నది నా ధ్యేయం నా లక్ష్యం''

''భేష్. నీ లక్ష్యసాధనలో నేనూ ఒకచేయి అందిస్తాను దివ్యా! ఇంతవరకూ ఎవరికీ తెలీని పచ్చినిజం చెబుతున్నాను విను. నా పేరు బయటికి రానివ్వకూడదు సుమా''

''రానివ్వను. నా కంఠంలో ప్రాణంవున్నా లేకపోయినా సరే''

''మురళి అందరూ అనుకుంటున్నట్టు కడుపునొప్పితో చనిపోలేదు. టీబీతో చనిపోయాడు. పెళ్లికి ముందునుంచి టీబీ వుంది. పెళ్లి చేసుకోకూడదనలు. చేసుకున్నాడు. టీబీ ఎడ్వాన్స్‌డ్ స్టేజీలోకి మారిపోయింది. రక్తపు వాంతులవుతోంటే తీసుకొచ్చారు. సంగతి బయటికి పొక్కనివ్వకుండా డాక్టర్‌తో కలిసి జాగ్రత్త తీసుకొన్నారు. చనిపోయాక మరేదో కారణంవల్ల అని డెత్‌సర్టిఫికెట్ రాసిచ్చారు. మసిబూసి మారేడుకాయ చేసేశారు''

''అయినా నిజం నిప్పులాంటిదనీ, దానిని కట్టిన గుడ్డల్ని కాల్చేసి ఏదోరోజున బయటపడుతుందనీ అంటారందుకే. రోగాన్ని కప్పిపుచ్చి పెళ్లిచేశారన్న నింద రాకుండా 'పరాయిపిల్ల' ఆస్తిలో వాటాపంచుకుపోకుండా పైపెచ్చు ఆమె పేరుని అడ్డుపెట్టుకుని పేరునీ చందాలనీ చేజిక్కించుకుందామని దీపని సతిని చేశారు సిస్టర్. నిండుప్రాణానికి నిప్పుపెట్టేశారు. పచ్చని బ్రతుకుని బలితీసుకున్నారు. క్రూరులు, దుర్మార్గులు, రాక్షసులు...''

హిస్టీరియా పేషంటులా అంది దివ్య.



ముఖ్యమంత్రి నివాసంలో ముఖ్యమంత్రీ, మంత్రి మృత్యుంజయరావు సమావేశమయ్యారు.

''ఇంత చిన్న విషయానికి మీరిలా రాజీనామా చెయ్యడం బాగోలేదు. దయచేసి ఉపసంహరించుకోండి'' ముఖ్యమంత్రి అన్నారు.

''నేను దాన్ని చిన్న విషయంగా భావించడంలేదు''

''ఎప్పుడో ఎక్కడో అతిఅరుదుగా జరిగే సతి గురించి అటు మహిళాసంఘాలూ, ఇటు మత సంఘాలూ అనవసర రాద్ధాంతం చేస్తున్నాయి. మధ్యలో మీరు రాజీనామా చేసి అగ్నికి ఆజ్యం

పోస్తున్నారు. మన పార్టీ ప్రతిష్టకి తీవ్రమైన దెబ్బ కొడుతున్నారు''

"క్షమించండి. మన పార్టీని, మన బలాన్ని చెదిరిపోనివ్వకూడదన్నదే నా తాపత్రయం. ప్రభుత్వం చేసిన అరెస్టులకి ప్రజలెంతగా ఆవేశపడుతున్నారో మీకు తెలీదు''

''తాటాకు మంటలాంటిది ప్రజల ఆవేశం. అదెంత త్వరగా జ్వలిస్తుందో అంత త్వరగానూ చల్లారిపోతుంది. ఆ ఆవేశాన్ని మరింత ప్రోదిచేసి వారి దృష్టిలో విలన్స్ అవడం ఏ పార్టీకీ, ఏ ప్రభుత్వానికీ మంచిదికాదు. ఆవేశంలో వారు విచక్షణాజ్ఞానం కోల్పోకుండా మనమీది నమ్మకం సడలిపోకుండా చూసుకోవడం అత్యావసరం. కన్నీటితుడుపు చర్యలవల్ల వారి ఆవేశకావేషాల్ని చప్పగా చల్లార్చెయ్యొచ్చు. చక్కని కీర్తిని మూట గట్టేసుకోవచ్చు. సతి విషయం ఆ సూత్రానికి మినహాయింపు కాదు'' ముఖ్యమంత్రి అన్నారు.

''జనంలోని ఒక సెక్షన్‌ని తృప్తిపరచడానికి మరో సెక్షన్‌ని చేజేతులా దూరం చెయ్యడాన్ని నేను సహించలేను. పదవికి రాజీనామా ఇవ్వడంతోనే ఆగను. ఆమరణ నిరాహారదీక్ష చెయ్యడానిక్కూడా వెనుకాడను''

''మీ శక్తి నాకు తెలీదు. అందుకే ఇంతగా చెబుతున్నాను. ఉద్రేకపడకుండా ఆలోచించండి. మొదట్లో సతి మతసంబంధమైన చిన్నకర్మకాండగా నేనూ తోసిపుచ్చేశాను. కాని తర్వాత నా స్టేండ్ మార్చుకోవాల్సివచ్చింది. ప్రధాని కూడా ప్రథమంలో జోక్యం కల్పించుకోలేదు. కాని ఆలస్యంగానైనా సతిని ఖండిస్తూ ప్రకటన చెయ్యక తప్పలేదు. ఎంచేత? ప్రజాభిప్రాయానికి తలొగ్గి? కాదు ప్రజాగ్రహానికి భయపడా? కానేకాదు. మరి? మనం స్త్రీ జనవిరోధులం, తిరోగమనవాదులం అన్న చెడ్డపేరు తెచ్చుకోవడం ఇష్టంలేక. మన పార్టీకున్న అభివృద్ధికర ఇమేజ్‌కి భంగం కలిగించలేక''

''మీ మాటలు పిప్పరమెంట్లలా బాగానే వున్నాయి వినటానికి. కాని మీరు చేసిన పనేమిటి? సతికి బాధ్యులంటూ నాక్కావాల్సిన వాళ్లని అరెస్ట్ చేయించారు. నా కాళ్లు పట్టుకుని లాగేశారు''

''ఉద్రేకం వద్దు. శాంతంగా ఆలోచించండి. రోజూ టీవీలోనూ, పేపర్లలోనూ కొన్ని వార్తలు ప్రముఖంగా వస్తుంటాయి. ఫలానాచోట ఇన్ని కోట్ల విలువగల గంజాయినో, బ్రౌన్‌షుగర్నో స్వాధీనం చేసుకున్నారు పోలీసులు. ఇంకెక్కడో కోట్ల విలువగల బంగారు బిస్కట్లనీ, స్మగుల్డు గూడ్సునీ ప్రభుత్వం పట్టేసుకుంది. ఇలాటి వార్తలన్నమాట. కానాతర్వాత ఏమైందో ఆ సంఘవ్యతిరేకపనుల వెనుకనున్న పెద్ద మనుషులెవరో ఒక్కసారైనా చెబుతున్నామా? లేదు. ఎంచేత? ఆలోచించండి'' నవ్వేరాయన.

''తీరిగ్గా ఆలోచిస్తూ కూర్చునేంత ఓపిక లేదు. అవతల మావాళ్లు నామీద కత్తులు నూరుతున్నారు. నలుగుర్తో నారాయణా కులంతో గోవిందా అని ఊరికే అన్లేదు. దయచేసి వెంటనే రాజీనామా ఆమోదించండి. స్వేచ్ఛగా వెళ్లి మా వాళ్లతో చేతులు కలపనివ్వండి. అవసరమైతే ఆమరణనిరాహారదీక్ష చెయ్యనివ్వండి...''

ఇబ్బందిగా కదిలారు ముఖ్యమంత్రి.

''మీ కులం, బలం గురించి నాకు తెలీదా చెప్పండి. కాని మీరు నన్నర్థం చేసుకునే ప్రయత్నం చెయ్యటంలేదనే నాకు బాధగా వుంది. తప్పనిసరై అరెస్టు చేయించాను. అంతే. అంతకుమించి మరేచర్యా తీసుకోను. రేపో మాపో ఎలాగూ బెయిలుమీద బయటి కొచ్చేస్తారు. ఆ తర్వాత ఏమయ్యిందో కోర్టులో ఎలా నడుస్తుందో ఎవరిక్కావాలి?''

''మీ మాటల్ని నమ్మమంటారా''

''మీరు నమ్మటమేకాదు. మీ వాళ్లని కూడా నమ్మించమంటున్నాను. లోపాయికారీగా అన్ని రకాల సాయమూ అందివ్వండి. కాదనను. ఆ రకంగా మీ కులంవారి అభిమానిక్కూడా దూరమవ్వం...''

ఆలోచనలోపడ్డారు మృత్యుంజయరావు. ఆ ఆలోచన బాగానే అన్పించసాగింది. పైగా పాతికేళ్లు కాపురం చేసిన పెళ్లానికి తేలిగ్గా విడాకులిచ్చెయ్యొచ్చుగాని అయిదేళ్ళు ఏలిన పదవిని ఎవరు వదులుకోగలరు? పదవి లేని నాయకుడి బతుకు విధవకన్నా హీనంకదా.

''ఐడియా బాగానే ఉందనుకోండి. మరి




చుస్రీ ఉత్సవాన్ని జరగనిస్తారా? అది చెప్పండి ముందు. అది తమ మతవిశ్వాసాలకీ, గౌరవానికీ పరువుమర్యాదలకీ ఛాలెంజీగా భావిస్తున్నారు మావాళ్లు''

''చుస్రీ ఉత్సవాన్ని జరగనివ్వాలని డిమాండ్ చేస్తూ వచ్చేవారం ధర్మరక్షనసంఘంవారు ప్రదర్శన చెయ్యబోతున్నారుకదా. ఇక చుస్రీకి ఏర్పాట్లు చురుకుగా జరిగిపోతున్నాయనీ, రాష్ట్రం నలుమూలల్నుంచీ లక్షలాది జనం ఆ ఉత్సవంలో పాల్గొనవచ్చనీ గూఢచారి వర్గాలవారి భోగట్టా. ఇక ఆ ఉత్సవాన్నెందుకు నిరోధిస్తాం చెప్పండి?''

మృత్యుంజయరావు మొఖంలోకి వెలుగూ చిరునవ్వూ కూడా వచ్చేశాయి.

''మీరు మాట తప్పితే...?''

''ఆమరణ నిరాహారదీక్ష చేస్తానంటారు. అలాగే. కానొక్కసంగతి. సతిని ప్రధానీ, నేనూ కూడా ఖండించాం. చుస్రీ ఉత్సవాన్ని జరగనివ్వకుండా ప్రభుత్వాన్ని ఆదేశించమని కొన్ని మహిళాసంఘాలు హైకోర్టు నాశ్రయించాయి. కోర్టు కూడా రేపో మాపో ఆదేశించితీరుతుంది. పార్టీ ప్రయోజనాలకి భంగంకానివిధంగా తగిన చర్యలు తీసుకోమని ప్రధాని కేంద్ర ఉప హోంమంత్రిని పంపించారు. అంచేత...''

''అంచేత?''

''సీ ఆర్పీని పంపిస్తాం. అంతేతప్ప ఉత్సవానికేరకంగానూ భంగం కలిగించం''

''మీరాహామీ ఇస్తే రాజీనామాని ఉపసంహరించేసుకుంటాను''

''గుడ్. ఇప్పుడు నాకు నచ్చారు. మరొక్క సంగతి నీతిపరుడిగా, పరిపాలనాదక్షుడిగా మీకెంతో మంచి పేరుంది. ప్రధాని గుడ్‌లుక్స్‌లో కూడా వున్నారు. ఎంతో రాజకీయ భవిష్యత్తు వుంది. అలాటి మీరు సతిని బహిరంగంగా సమర్థించి చెడ్డపేరు తెచ్చుకోవటం మీకూ, పార్టీకీ కూడా శ్రేయస్కరం కాదని నా సలహా''

''ఇక తెరవెనుక వుంటాను. నమస్తే''

ముఖ్యమంత్రి వద్దనుండి పరమానందపడిపోతూ తిరిగి వచ్చిన మంత్రి మృత్యుంజయరావుని చూసి ఆయన అనుచరవర్గం విస్తుబోయింది.

తను ప్రధాని గుడ్‌లుక్స్‌లో వున్నానన్న మాట అమృతపుసోనల్లా విన్పించసాగిందాయన చెవిలో. ముఖ్యమంత్రి ఆమాట ముఖప్రీతికి అని వుండడు. తన పదవీ నిర్వహణ గురించి ప్రధాని ఎందర్నో ఎంక్వైరీ చేసిన సంగతి తనకి తెలుసు. అందువల్ల అదే నిజమైతే... అసమ్మతివాదుల బలం మరింత పెరిగితే... మధ్యేమార్గంగా ప్రధాని ముఖ్యమంత్రి కిరీటాన్ని తన తలమీద పెట్టొచ్చు.

ఓహ్! తన జాతకం చాలా గొప్పది.

సంబరంతో పొంగిపోతున్నారు.

''మంత్రిగారూ... ఆ సంతోషమేదో మాక్కూడా పంచకూడదూ'' ఓ ఎమ్మెల్యే అన్నాడు.

''అవశ్యం...ఇక మనపని పంచుకోవడమే నోయ్'' అన్నారు 'పదవిని' అన్న ముక్క మినహాయించి.

దాంతో అంతా అనేక రకాలుగా అర్థం చేసుకుని ఆనందపడిపోయి మంత్రిగార్ని పొగిడేశారు.

''రాజీనామా సంగతి...''

''అన్నీ సెటిలైపోయాయి. మన పదవికీ, మనవారికీ ఎలాంటి అడ్డూలేదు''

''ఎంత గొప్పమాట శలవిచ్చారు. ఇప్పుడే సంగతి అందరికీ తెలియజేస్తాం. మిమ్మల్ని అపార్థం చేసుకుని తూలనాడుతున్నవారికి మీరు మన కులస్థులకి శ్రీరామరక్షయని తెలియజేస్తాం...''

''తెలియచెయ్యండి... కాని నా పేరెక్కడా బయటికి రాకూడదు. ఏ పేపరూ నాకు వ్యతిరేకంగా రాయకూడదు. అసల్నాకు సతి సంఘటనతోగాని, అందుకు బాధ్యులైనవారితోగాని, చుస్రీ ఉత్సవంతోగాని సంబంధం లేనట్టుగా అంతా గోప్యంగా జరిగిపోవాలి...''

ఏదో గుర్తురాగా మధ్యలోనే ఆగిపోయారు మంత్రి.

తను సూరపరాజుని పరామర్శించడానికెళ్లినప్పుడు 'శుభోదయం' పత్రికావిలేఖరి తననీ, ఆయన్నీ కలిసి ఫొటో తీసిన సంగతి గుర్తొచ్చింది.

అదింతవరకూ పేపర్లో ప్రచురించకపో వటం తన అదృష్టం.

ఇకముందు కూడా ప్రచురించకుండా వుంటే మంచిది. లేకపోతే ప్రధాని దృష్టిలో తన విలువ పడిపోవచ్చు.

ఊహూ... అలా జరక్కూడదు. ఆ ఫొటో కారణంగా సూరప్పకీ, తనకీ, చున్రీకీ, తనకీ సంబంధం అంటగట్టకూడదు. ఎలాగైనాసరే ఆ ఫొటో ప్రచురణని నిలిపెయ్యాలి!

ఒక ఆంతరంగికుణ్ణి పిలిచి చెప్పేరు.

"దివ్య అనే శుభోదయం పత్రికావిలేఖరి దేవపురం వెళ్లినప్పుడు కొన్ని ఫొటోలు తీసింది. అవి చేజిక్కించుకోవాలి. అది సాధ్యంగాకపోతే ఆ ఫొటోల్నీ, వాటిని తీసినా మెనీ సమూలంగా..."

"అర్థమయ్యింది... మీరిహ ఆ సంగతి మర్చిపోండి"

★ ★ ★

మురళి మరణకారణం గురించీ ఆసుపత్రి లోని మూఢభక్తి గురించీ మేటర్ రాసిచ్చి ఎడిటర్ మహర్షి అభినందనలందుకుంది దివ్య.

"గో ఎహెడ్... మిగతా వివరాల్ని కూడా నువ్వు సాధించుకొస్తావన్న నమ్మకం నాకుంది" అంటూ వెన్నుతట్టారాయన.

ఆయన దగ్గర్నుంచి వస్తోంటే- "మీకోసం చైతన్య ఫోన్ చేశారు మధ్యాహ్నం" అని చెప్పే రు స్టాఫ్.

అతణ్ణి వెదుక్కుంటూ వెళ్లింది.

"హలో దివ్యా... ఏమిటీమధ్య బొత్తిగా నల్ల పూసైపోయావ్"

"పోనీ ఎర్రపూసై నీ వేలివుంగరపు రాయిగా మారిపోనా?"

"అంత అదృష్టమా?"

"అది అదృష్టమా?"

"కాదా? అనుకున్నప్పుడల్లా ముద్దు పెట్టుకో వచ్చు"

"ఛీపో...యూ సిల్లీ"

"అహహ చాలు చాలు సిగ్గులు. ఎంతవ రకూ వచ్చింది నీ పరిశోధన"

"ఓ కీలకం దొరికింది" అంటూ సతి గు రించి తను సేకరించిన విశేషాలన్నిటినీ చె ప్పింది. ఎలిజబెత్ వృత్తాంతం కూడా చె ప్పింది.

"యువతుల్లో అలాంటి చొరవా, అలాంటి ఆలోచన, అలాంటి శక్తి వుండాలి. అప్పుడిహ సతులకీ, వరకట్నపు సతులకీ మనదేశపు పటంమీద స్థానం వుండదు" ఎలిజబెత్‌ని అభినందిస్తూ అన్నాడు చైతన్య.

"రియల్లీ ఎ రేర్ అండ్ వండర్‌ఫుల్ పెర్స నాలిటీ"

"తదుపరి కార్యక్రమం ఏమిటి?"

"మళ్ళీ దేవపురం వెళ్లాలి. అటూ ఇటూ తిరగటంతోనే సరిపోతుంది. చున్రీ గొడవ తేలే లోగా అసలు కథని లాగుదామని చూస్తోంటే దారీతెన్నూ కన్పించటంలేదు. దేవపురం వాళ్లె వళ్లూ సహకరించటంలేదు. అక్కడి పోలీస్ డిపార్ట్‌మెంట్లో నీకు తెలిసినవారెవరైనా ఉన్నారా చైతన్యా?"

"లేరు కానీ... దేవపురంలో నా స్నేహితుడి చెల్లెలుంది. కానీ..."

ఎగిరిగంతేసిందామె. "అది చాలు. ఆమె ఎలాటిదైనా మానేజ్ చేసుకుంటాను. ఆమె ద్వారా దీప అత్తింటి ఆడవాళ్లని కలిసి కూపీ లాగుతాను"

"సరే... ఇదెందుకొచ్చిందోలే. ఆమెకోదారి చూపడానికి ప్రయత్నించానుగాని నా ఫ్రెండే కలిసి రాలేదు. ఏమో- నీ ప్రయత్నం ఫలించి నువ్వామెని మార్చగలవేమో చూద్దాం"

"అదేవిటి?"

"నానోట వినేకన్నా కళ్లారా చూస్తేనే మంచిది. ఆమె నరకకూపంనుంచి బయటవ డ్డానికి సిద్ధపడితే ఇక్కడి మహిళాసంఘాల ద్వారా ఆమెకో బతుకుతెరువు ఏర్పాటు చేస్తా మని హామీ ఇవ్వు" అంటూ ఆమె ఎడ్రస్ ఇచ్చాడు.

"చూస్తోంటే సతి ప్రభావం జనంమీద ఎక్కువగా పడుతున్నట్లుంది చైతన్యా"

"మంచికన్నా చెడు తేలిగ్గా, త్వరగా అలు





ముకుంటుంది''

''మా నాన్న ఏమన్నాడో తెలుసా? దీపాదేవి లాంటి మహాపతివ్రతని చూసి సిగ్గుపడమని నన్ను ఛీత్కరించారు? అసలేం జరిగిందో ఆమెకీ, ఆమె భర్తకీ మధ్య వున్న అనుబంధం ఎంత బలమైనదో ఎవరికీ తెలీదు. అయినా అందరి దృష్టిలో ఆమె మహాపతివ్రత'' శుష్క హాసం చేసింది దివ్య.

''ఈమధ్యే కథ చదివా?''

''అలాగా...కథ టూకీగా చెప్పవూ?''

''ఒక నాటకాలమ్మాయి గురించి నాటక సమాజంలోని మగాళ్లు హేళనగా మాట్లాడుకుంటారు. అది ఆమె చాటుగా వింటుంది. వారి కుసంస్కారానికి నొచ్చుకుని వారినోప్రశ్న వేస్తుంది. మీకు తెలిసిన నలుగురు పతివ్రతల పేర్లు చెప్పుమంటుంది''

''ఊఁ...''

''తడుముకోవాల్సిన అవసరం లేకుండా సీత, సావిత్రి, అనసూయ, అరుంధతి, దమయంతి, ద్రౌపది అంటూ ఏకరవు పెట్టేస్తారంతా. అప్పుడామేమంటుందో తెలుసా? మీకు తెలిసిన పతివ్రతల పేర్లు చెప్పమంటే మీరెరగని వాళ్ల గురించీ, ఎప్పుడూ చూడనివారి గురించీ చెబుతారేం? కథల ద్వారా వినడమే తప్ప వాళ్ల గురించి మీకేమీ ప్రత్యక్షజ్ఞానం లేదుకదా? అయినా వాళ్లని పతివ్రతలంటున్నారు. మీ కళ్లెదుట కన్పిస్తున్న మీ తల్లిగాని, భార్యగాని, చెల్లిగాని, కూతురుగాని మీకు పతివ్రతగా కన్పించటం లేదన్నమాట''

చప్పట్లు కొట్టింది దివ్య.

''మార్వలెస్... నిజంగా చేతులెత్తి నమస్కరించాలి ఆ రచయితకి''

''బాగా చెప్పావ్... అవును మీ నాన్నగార్నెప్పుడు కలుసుకున్నావ్? మన పెళ్లి గురించి చెప్పి మీ వాళ్లని ఒప్పించమన్నాను మీ అన్నయ్యతో. అందుకని మీ నాన్నగారు...''

''అయితే ఆ సంగతి నీ ద్వారానే వాళ్లకి తెలిసిందన్నమాట. వాళ్లొప్పుకుంటారనే భావిస్తున్నావా? నల్లరాళ్లు మారవు చైతన్యా!''

''రాళ్లు మారవు... కాని మనుషులు మారొచ్చు''

''మారి సీతని ఆదరిస్తే సంతోషమే మరి''

''ఏ సీతని?''

''మా వదిన సీత. నీకు చెప్పలేదుకదూ'' అంటూ ఆమె వ్యధంతా చెప్పింది.

''నువ్వు పరిస్థితిని తీసుకోవాల్సినంత సీరియస్‌గా తీసుకోలేదనుకుంటాను దివ్యా''

''ఎందుకలా అనుకుంటున్నావు?''

''మీ వాళ్ల గురించి నలుగురూ చెడుగా అనుకోవడం ఇష్టంలేక వారి పరువు బజార్నపడకుండా లోపాయికారిగా సర్దేసినట్టనిపిస్తోంది నాకు''

''నిజంగా నాకలాంటి అభిప్రాయం లేదు చైతన్యా! కాని తరచి చూస్తోంటే నాకూ అలాగే అనిపిస్తోంది. నాకు తెలీకుండానే మావారి కోసం తాపత్రయపడినట్టున్నాను''

''తప్పు వెంటనే ఒప్పేసుకోవటమే నీ గొప్పదనం దివ్యా'' అభిమానంగా ఆమెవంక చూస్తూ అన్నాడు. ''మాకు రిపోర్టు చెయ్యాల్సింది. కనీసం నాకు చెప్పివుంటే స్టేషన్కి పిలిచి ఓ డోస్ ఇచ్చేవాణ్ణి. లేదా రేపేదైనా జరక్కూడనిది జరిగితే దానికి తనే బాధ్యత వహిస్తానంటూ లెటర్ తీసుకునేవాణ్ణి. అదీ ఇదీ గాకపోతే ఇరుగుపొరుగువార్ని పిలిచి వారెదుట ఇంకెప్పుడూ ఆమెని బాధించనని హామీ తీసుకోవాల్సింది. కొందర్లో డోస్ ఎక్కువగా ఇస్తే తప్ప రియాక్షన్ రాదు''

''పాయింటే... దేవపురం వెళ్లొచ్చాక ఓ సారెళ్లి వదిన్ని కలిసి మాట్లాడదాం''

''ష్యూర్- ఆమె కూడా మారాలి మరి. సింక్ ఆర్ స్విమ్ అంటారు ఇంగ్లీషులో. విషమస్థితి వచ్చినప్పుడు మునగనన్నా మునగాలి. ఈదనన్నా ఈదాలి. అదో ఇదో తేల్చుకోమంటే మునిగిపోవడానికే నిర్ణయించుకుంటారు మనవాళ్లు. ఎదురీదాలన్న స్పృహే కలగదు వాళ్లకి''

''అది ఆడవాళ్ల తప్పుకాదు చైతన్యా. వాళ్లు పెరిగిన పరిసరాలలాంటివి. ఆడపిల్లకన్నా మగాడు గొప్పవాడని, ఆడపుట్టుక హీనమయ్యిందని, ఆడది అబలయితే మగాడు మగమహారాజని కథల ద్వారా, ఆచారాల ద్వారా, సామాజిక దృక్పథం ద్వారా నూరిపోసే విష




సంస్కృతిలో పుట్టి పెరిగిన ఆడది అంతకంటే ఏం చెయ్యగలదు చెప్పు?''

ఒక మహిళ రెండు దశాబ్దాలపాటు ఏకఛత్రాధిపత్యంగా ఏలిన దేశంలో స్త్రీకి ఆస్తిహక్కు లేదు. పురుషుడితో భుజం భుజం కలిపి పనిచెయ్యగల పరిస్థితి లేదు. పట్టపగలు కూడా ఒంటరిగా నిర్భయంగా నడవగలిగిన పరిస్థితి లేదు. ఆర్థిక స్వాతంత్ర్యం లేదు.

సాంఘిక సమానతలేదు, బ్రతుక్కి భద్రత లేదు. భవిష్యత్తుమీద ఆశలేదు. తండ్రిగాని భర్తగాని కొడుకుగాని ఇంట్లోంచి తరిమేస్తే పిచ్చిదో, భక్తురాలో, వేశ్యో అయి దేశాలుపట్టుకుపోవాల్సిందే తప్ప సుఖంగా స్వేచ్ఛగా బ్రతికే స్థితిలేదు. ఆడది ఏం చెయ్యగలదు చెప్పు? రక్తాన్ని పాలగా మార్చి పట్టగలదూ, హింసిస్తే కన్నీరు పెట్టుకోగలదూ తప్ప ఇంకేం చెయ్యగలదు?''

''ఏమీ చెయ్యలేదని చతికిలబడితే సాధించేదేమీ వుండదు. ఏమైనా చెయ్యగలమనుకుంటే ఆమెకి అడ్డువుండదు. ఆమె శక్తి అజేయం... అనమానం. మొన్నటి మహిళా ప్రదర్శనా ప్రభంజనాన్ని మరిచిపోతే ఎలా చెప్పు? సతికి వ్యతిరేకంగా, మానభంగాలకి వ్యతిరేకంగా, ఆడశిశువుల హత్యకి వ్యతిరేకంగా, సమాజ హీనదృష్టికి వ్యతిరేకంగా ఎలుగెత్తి గర్జిస్తోన్న మహిళా శక్తి గొంతు నొక్కగల శక్తి ఎవరికీ లేదుగాకలేదు''



దీపాదేవి సతి అవడం వెనుకనున్న కుట్రల్నీ కుతంత్రాల్నీ బట్టబయలు చెయ్యగలనన్న నమ్మకం పెరగ్గా రెట్టించిన వుత్సాహంతో దేవపురంలో అడుగుపెట్టింది దివ్య.

పండుగలా అలంకరించుకుంటున్న గ్రామాన్ని చూసి ముక్కుమీద వేలుంచుకుంది.

ప్రధాని ప్రథమంగా పెదవివిప్పి సతి మానవజాతికే కళంకమని వాక్రుచ్చారు.

దేశం నలుమూలల్లోనూ సతిని ఖండిస్తూ చున్రీని నిరోధించమని కోరుతూ మహిళా సంఘాలు ప్రదర్శనలు జరుపుతున్నాయి.

మేధావులూ రాజకీయనాయకులూ మధ్యయుగాలనాటి దురాచారం పునరుద్ధరింపబడకుండా చూడమని ప్రకటనలు చేస్తున్నారు.

దేశాన్ని 21వ శతాబ్దంలోకి తీసుకెళ్తానన్న ప్రధానిని మనదేశాన్ని12వ శతాబ్దంలోకి వెళ్లకుండా చూడవయ్యా అని పత్రికలు ఘోషిస్తున్నాయి.

సతికి సర్వత్రా నిరసన నినాదాలు ప్రతిధ్వనిస్తోంటే ఇక్కడ దేవపురం మిగతా దేశంతో సంబంధంలేనట్టు చున్రీ మహోత్సవానికి సంసిద్ధమవుతోంది.

రోడ్లప్రక్క దుకాణాలూ టెంట్లూ వెలుస్తున్నాయి. వూరివాళ్లంతా ఇళ్లకి వెల్లలు వేసుకుంటున్నారు. సతీ స్థలంలో స్మారక మందిరం నిర్మించడానికి ఏర్పాట్లు చురుకుగా జరుగుతున్నాయి. సతీ స్థలాన్ని దర్శించడానికి నిత్యం వేలాదిమంది జనం వస్తూనే వున్నారు. లక్షల్లో చందాలు వసూలవుతున్నాయి. ఎక్కడ చూసినా గుంపులు గుంపులుగా రాజపుత్ర యువకులు.

తను మొదటిసారి వచ్చినప్పుడు సతీ స్థలంలో ఎవరో అనుకున్న మాటలు గుర్తొచ్చాయి.

రక్తం పారినా సరే చున్రీ వుత్సవం జరిగి తీరుతుంది.

నిజంగా జరుగుతుందా? సతితో అప్రతిష్ఠపాలైన ప్రభుత్వం చున్రీ వుత్సవాన్ని జరగనిచ్చి తను మతవాదుల చేతుల్లో కీలుబొమ్మనని చాటుకోబోతోందా?

ప్రజాభిప్రాయం, ప్రభుత్వబలం, మతఛాందసవాదం - ఈ మూడిట్లలో గెలుపెవరిదో తెలుసుకోవడానికి చున్రీ నాటిదాకా ఆగక తప్పదనుకుంటూ కదిలింది.

చైతన్య ఇచ్చిన చిరునామా పట్టుకుని సుందరి ఇల్లు వెతుక్కుంటూ వెళ్ళింది దివ్య.

''ఎవరు కావాలి?'' ఓ పురుష కంఠం పరుషంగా ప్రశ్నించింది.

''లక్ష్మణమూర్తిగారిల్లు...''

''ఇదే ఏం?''

''ఆయన భార్య సుందరిని కలుసుకోవాలనొచ్చాను. సుందరి ఫ్రెండ్‌ని''

నుదురు చిట్లించి ''లోపలికెళ్లు'' అన్నాడు.

ఇతడేయుగపు మానవుడో అనుకుంటూ లోపలికెళ్లింది.

సుందరి అత్తగారు దివ్యనీ దివ్య చేతిలోని సూట్‌కేసునీ ఎగాదిగా చూసి "ఆ గదిలో కూర్చోమ్మా వస్తుంది" అంది.

గదిగోడలకి వ్రేలాడుతోన్న సుందరి పెళ్లి ఫొటోలు చూస్తూ కూర్చుంది దివ్య.

పెరట్లో అంట్లుతోముతోన్న సుందరితో అత్త గారంది- "ఎవత్తోవచ్చింది నీకోసం. యాకంగా పెట్టేబేడాతో దిగబడింది. నాల్రోజులు ఇంటి మీదపడి తింటుందా?"

వచ్చిన వారెవరై వుంటారో అర్థం కాలేదామె కి బదులివ్వలేదు.

ఆమె మౌనానికి పుండు మీద కారం చల్లిన ట్లు ఫీలయ్యింది అత్తగారు "అనవసరపు తద్ది నాన్ని మొయ్యలేక ఛస్తున్నాం. ఇంకా చుట్టాలు కూడా వచ్చి ఛస్తే ఎలా చావం? అమ్మోరల్లే వచ్చింది ఇంటికి. పిడుగులాంటి నా బిడ్డని పొట్టనెట్టుకుంది. ఈ ఇంటిని పీడలా పట్టు కుని వ్రేలాడుతోంది. చచ్చేదాకా భరించాలి కాబోల్లా దేవుడా!"

సుందరి కళ్లనుండి కన్నీళ్లు జలజలా రాలి పడ్డాయ్.

"బుడి బుడి దీర్ఘాలెందుకే తల్లీ. ఎవరైనా చూస్తే నిన్ను రాచిరంపాన పెట్టేస్తున్నామను కుంటారు. మహారాణిలా నిన్ను కూర్చోపెట్టి పోషిస్తున్నదిగాక మాటలు కూడా ఎక్కడ పడం?"

ఆడపిల్లగా ఎందుకు పుట్టానా అని నిశ్శ బ్దంగా రోదిస్తూండిపోయిందామె. అయినా పని ఆపలేదు. చేతిలోని పని వదిల్తే అత్తగారు సహించదు.

అంట్లుపని అయ్యేసరికి ఇన్ని బట్టలు తెచ్చి పడేసింది తోటికోడలు. అవన్నీ వుతికి ఆరవేసి గదివైపెళ్లబోతేంటే "వూరికే మేపగల శక్తిలే దు. చెప్పుల్లో కాళ్లుంచుకుంటే మంచిదని చె ప్పు" అన్నది అత్తగారు.

మౌనంగా తలాడించి గదిలోకెళ్లింది.

ఒకర్ని చూసి ఒకరు స్థాణువయ్యారు.

దివ్యని ఎరగదు సుందరి.

సుందరి పరిస్థితి గురించి తెలీదు దివ్యకి.

సుందరి వేషాన్ని చూసి షాక్ తిన్నది దివ్య.

తెల్లచీరా తెల్లరవికా ధరించింది. నుదుట బొట్టులేదు. చేతులకి గాజులూ కాళ్లకి మట్టెలూ లేవు. మొఖంలో కాంతిలేదు. కళ్లల్లో జీవంలే దు.

"సుందరీ!"

ఆమె ఎవరో తెలీకపోయినా వెళ్లి ఆమెని కావలించుకుని బావురుమంది సుందరి.

తేరుకోవడానికిద్దరికీ చాలా సమయమే పట్టింది.

"నేను మీ అన్నయ్య ఫ్రెండ్ చైతన్య వుడ్ బీని..."

"నిజంగా చాలా సంతోషం. నువ్వు చాలా అదృష్టవంతురాలివి వదినా"

"ఎందుకలా అంటున్నావు?"

"చైతన్య అన్నయ్య దేవుడు వదినా. మామ ధ్య రక్తసంబంధంలేకపోయినా రక్త సంబంధీ కులకన్నా ఎక్కువగా నా కోసం తపించాడు. నన్ను విధవని చెయ్యకుండా చూడాలనీ మళ్లీ పెళ్లి చెయ్యాలనీ ఎంతోఆరాటపడ్డాడు. కాని అన్నయ్య ఒప్పుకోలేదు..."

"ఏం? చెల్లెలి బాగు ఇష్టంలేదా?"

"చెల్లికన్నా ఆచారసాంప్రదాయాలిష్టం. నలుగుర్తో నారాయణా కులంతో గోవిందా అంటానన్నాడు. సాంప్రదాయాన్ని ధిక్కరించి వంశ గౌరవానికి మచ్చ తేలేనన్నాడు. నలుగు ర్లో నగుబాటు పాలవ్వలేనన్నాడు. చైతన్య ఎంతో చెప్పేడుగాని అన్నయ్య విన్పించుకోలే దు"

"ఈకాలంలో కూడా మూఢ సాంప్రదాయాల సంకెళ్లు త్రెంచుకోలేని చదువుకున్న యువకు లున్నారంటే ఎంత సిగ్గుచేటు. మీ ఇంట్లోనే కాదు మా ఇంట్లో కూడా వున్నారు. ఇలా ఎందరెందరున్నారో దేశంలో! తప్పు మారనివా ళ్లదో వాళ్లని మార్చలేని చదువులదో తెలీటం లేదు. పోనీ ఇక్కడ ఈ ఆరళ్లమధ్య నలిగిపో యేకన్నా పుట్టింట్లోనే వుండిపోలేకపోయావా. అక్కడైతే అంతో ఇంతో ఆదరణైనా లభించేది కదా!"





చిత్తరువులాటి ముఖానికి తేజస్సు నిచ్చే చిహ్నం!






వనితల ఘనత వృద్ధిచెంద -
భారతీయ సంస్కృతి మరింక
విస్తరించ....



ఐటెక్స్
పూర్ణిమా కుంకుం
మంగళదాయకమైన సౌభాగ్యపు చిహ్నం

అరవింద్ లాబరేటరీస్,
మద్రాసు 600 033

ఐటెక్స్ - 50 ఏళ్ళకు పైగా మీ విశ్వాసానికి మహత్తరమైన చిహ్నం

**SAY NO TO DRUGS**

Imageads 3087 Tel

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.

2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.

3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.

4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

✶ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

------------------------ కూపన్ ------------------------

**నవంబర్ చతుర నవల 'సతిమంటలు'**

సమీక్షకుని పేరు : ..............................................

చిరునామా : ..............................................

..............................................

..............................................

..............................................

"తల్లీ తండ్రీ లేరు. పెళ్ళయ్యాక కూడా నీ బరువు మేమెక్కడ మోయగలం అన్నారు అన్నా వదినెలు. కొనుక్కున్న తద్దినం అంటు న్నారు వీళ్ళు. మధ్యలో గానుగమరలోని చెరుకై పోయింది నా బ్రతుకు!"

"ఏదో చదివేరు కదా... ఏదో వుద్యోగం చూసుకోవాల్సింది..."

"కొద్దిగా చదివేను... అయినా వీళ్ళు గడపదా టనిస్తారా? వాళ్ళనని లాభం ఏమిట్లే అంతా తలరాత! నా గొడవకేంగాని మీరేం చేస్తున్నా రు?"

"జర్నలిస్టుని... దీవనతి గురించి వివరాలు సేకరిద్దామని వచ్చాను"

"ఆమె అదృష్టవంతురాలు... రోజా చచ్చేక న్నా ఒక్కసారే చనిపోయింది"

"సుందరీ..." అరిచింది దివ్య. "మీరేనా ఆ మాట అంటున్నది?"

"నేను కాదు నా అనుభవం. విధవగా నరకపు బ్రతుకు బ్రతుకుతూ ఎప్పుడో ఆత్మహ త్య చేసుకునేకన్నా ఇప్పుడే గౌరవప్రదంగా చావడం మేలు కాదంటారా?"

"మీరు చాలా ఘోరంగా మాట్లాడుతున్నా రు"

"నిజాలెప్పుడూ ఘాటుగానేవుంటాయి"

"నిజమే... వితంతువుల బ్రతుకెంత ఘో రంగా దయనీయంగా వుంటోందో కళ్ళారా చూ శాను మధుర బృందావనాల్లో... బంధువుల పీడన నుండి పారిపోయి ఆశ్రమాల వంచన చేరి మోక్షం కోసం అంటే మరణం కోసం ఎదురు చూస్తున్న నిర్భాగ్యులెందరో ఎంద రో..." దివ్య కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి.

బృందావనంలో చూసిన విధవల కన్నీటి జీవితాలు కళ్ళముందు కదిలాయి. ట్రాన్స్ లో వున్నట్టు చెప్పుకుపోసాగిందామె.

"వితంతువుల జీవితాల్ని పరిశీలిస్తే అవ న్నీ మూఢవిశ్వాసాలతో దోపిడితో క్రూరత్వంతో నిండివున్నాయన్న నిగూఢ సత్యం బయటప డుతుంది. అసలు విడో అన్న మాటకర్థం తెలుసా? 'విడుస్' అనే లాటిన్ పదంనుంచి వచ్చిందే విడో అనే ఇంగ్లీషు పదం. దీని అర్థం ఖాళీ అని. అంటే భర్తలేకపోతే అంతా ఖాళీ యేనన్నమాట. దాన్నే మన వాళ్ళు శూన్యం అన్నారు. కేవలం శూన్యమైనా బాగానేవుండు నేమో. కాని విధవత్వమంటే అంతులేని దారి ద్ర్యం. దరిలేని కష్టాలు. నిరంతర రాపిడి. వాటి నుండి తప్పించుకునే మార్గం లేక లెక్కలేనంతమంది కష్టాల్ని కన్నీటితో భరిస్తూ అయినవాళ్ళ దయాదాక్షిణ్యాల మీద ఆధారప డి బ్రతుకు నీడుస్తున్నారు. అలా కాని వాళ్ళు ఆత్మహత్యలకి తలపడుతున్నారు. లేదా ఇంట్లోంచి నెట్టబడి హరిద్వార్, ఋషీకేష్, కాశీ, బృందావనాలకెళ్లి మఠం నీడలో శాంతిని వెదుక్కుంటున్నారు. అర్ధాకలితో మాడుతున్నా రు. కొందరు బిచ్చగత్తెలగానో వుంపుడు గత్తెల గానో వంటగత్తెలగానో మారుతున్నారు. అయినా అక్కడ్నుంచి పారిపోలేరు. ఎందుకో తెలుసా? ఆ పుణ్యస్థలంలో చనిపోతే మోక్షం వస్తుందన్న నమ్మకం ఒకటైతే, ఆఖరి మజిలీ లాంటి ఆ స్థలాన్ని వదలి ఇంకెక్కడికీ వెళ్లలేని మరెక్కడా ఇంత చోటు దొరకని దయనీయ స్థితి మరో కారణం. అంచేత చావు కోసం నిరీక్షిస్తూవుంటారా అభాగ్యులు. అవును వాళ్ళు స్త్రీని మాతగా శక్తిగా పూజించే దేశంలోనే పుట్టా రు. అన్నట్టు మనదేశాన్ని కూడా భారత మాత అంటూ స్త్రీగా భావించి గౌరవిస్తాం. కాని వాళ్ళ గోడు ఎవరూ వినరు. ఏ ప్రభుత్వమూ వారికి పిసరంత చేయూతనివ్వదు"

"ఆ నరకపు బ్రతుకుల గురించి చెప్పి ఆ బ్రతుకుకావాలా సతి అవుతావా అని ప్రశ్నిస్తే నేనేమిటి మీరైనా చిరునవ్వుతో సతి అవుతారు"

విభ్రమం చెందింది దివ్య. ఎంత వచ్చి నిజం! ఎంత క్రూరమైన నిజం!!

ఒకమ్మాయి సతి అయ్యిందని గొంతు చించుకుంటున్న నాగరికుల్లారా! ఒక్కసారి కళ్ళు తెరచుకుని చూడండి. భర్త చనిపోయాక భార్యకి ఎలాంటి గౌరవం ఇస్తున్నారో ఎలాంటి బ్రతుకు నిస్తున్నారో ఎంత హీనంగా చూస్తున్నా రో ఒక్కసారి కళ్ళు చించుకుని చూడండి. అలాంటి బ్రతుకు బ్రతికి కుక్కచావు చావా లనా సతి కావొద్దంటున్నారు? నిజంగా మీరు మనుషులైతే మీలో చీమూ నెత్తురూ ప్రవ హిస్తోంటే మీరు నిజంగా నతియైన అబల కథ

వినదలిస్తే మొదట మీమీ ఇళ్లల్లో మీమీ వరినరాల్లో మీ రాష్ట్రంలో మీదేశంలో వున్న వితంతువుల పరిస్థితేమిటో చూడండి. వాళ్లు వివపు వరిస్థితులకోరల మధ్య నలిగి గిలగిల తన్నుకుంటూ చావకుండా చూడండి. మీరూ మనుమలే మీకూ బ్రతికే హక్కుందని చాటి చెప్పండి. వారికి చేయూత నివ్వండి. కొత్త బాటన నడిపించండి. దేశంలో ఎక్కడా ఎవరూ వితంతువుల్ని హీనంగా చూడమని సాంఘిక కట్టుబాట్ల మరకొయ్యలు తగిలించమని వితంతువు, విధవ అన్న వదాలని వదకోశం నుంచి చెరిపేస్తామని రాసివ్వండి. పుట్టిన ప్రతి వారికీ బ్రతికే హక్కు అర్హతా గిట్టే వరకూ వున్నాయని హామీ ఇవ్వండి!

అప్పుడు నమ్ముతాను మీరు నాగరికులని, మానవులని. అప్పుడు జై కొడతాను మానవుడు మహనీయుడని!

వుద్వేగంతో వూగిపోతున్న దివ్యని శాంతింప జేయడానికి చాలా టైము పట్టింది నుందరికి.

ఒక్కరోజులోనే నుందరి కథంతా అర్థమైపో యింది దివ్యకి.

నుందరి రంగు వస్త్రాలు ధరించరాదు. అద్దం వంక చూడకూడదు. వీధి గుమ్మందరి దావులకి వెళ్లకూడదు. మగాళ్ల కంటబడకూడదు. శుభకార్యాల వంక కన్నెత్తి చూడరాదు. వనిమనిషిలా ఇంట్లోని వనంతా చెయ్యాలి. కటిక నేలమీద పాతచాప వరుచుకుని పడుకోవాలి. చన్నీటి స్నానం చెయ్యాలి. ఇంట్లోని వాళ్లంతా అన్నం తినెయ్యగా మిగిలిందే తినాలి.

వంటి మీద ఇరవైమూడేళ్ళైనా లేని నుందరి ఇలా ఎన్నాళ్లు ఎన్నేళ్లు వడుండాలి?

గృహలక్ష్మిలా వచ్చిన ఇంట్లో గృహఖైదీ అయిన అభాగ్యురాలు నుందరి. ఇలాంటి నుందరులు ఎందరో ఇంకెందరో!!

'స్త్రీకి శరీరంవుంది- దానికి కనరత్తుకావాలి. ఆవిడకూ మెదడు వుంది- దానికి విజ్ఞానం కావాలి. ఆమెకూ గుండె మనన్సూ వున్నాయి- వాటికి అనుభవంకావాలి. అని ఎలుగెత్తి చాటిన ఓ చలం ఎక్కడున్నావయ్యా?

వితంతువుకి పునర్వివాహం చేసి తెలుగు నాట చరిత్ర నృష్టించిన వైతాళికా వీరేశలింగం ఇంకా మారని ఈనాటి కథలు చూడవయ్యా!

నతీ భీభత్సం చూసి చలించి నతీ నిరోధక చట్టం తేవడానికి కారకుడైన రాజారామమోహ నరాయ్! వితంతువుల నిర్భాగ్య జీవితాలకి మార్గం చూపవయ్యా

"ఏమిటంత తీవ్రంగా ఆలోచిస్తున్నావు దివ్యా. నీ వుద్యోగం దీక్ష పట్టుదలా చూస్తోంటే నాక్కూడా ఏదో చెయ్యాలన్పిస్తోంది"

నుందరి మాటలకి ఎగిరి గంతేసింది దివ్య.

"యస్... ఐ వాంటిట్. నీలోనూ నీలాటి అందర్లోనూ కదలిక రావాలి నుందరీ. ఎవరో వస్తారు ఏదో చేస్తారని ఎదురు చూడకుండా మనమే ఎదురెళ్దాం ఎదురీదుదాం"

"బాగానేవుంటుంది. కాని ఈ బంధాలని తెంచుకుని బయట పడగలనా?"

"ఎందుకంతలా అధైర్య పడతావు? మేమంతా లేమా? చైతన్య కూడా నిన్ను కన్విన్స్ చెయ్యమని చెప్పేడు. నీకు కొత్త జీవితాన్నివ్వడానికి మేమంతా చిత్తశుద్ధితో కృషి చేస్తాం. నీకు అండగానిలవడానికి మేమే కాదు మహిళా నంఘాలూ అభ్యుదయ కాములూ ఎందరో వున్నారు.

"లేరని కాదు కాని నన్ను విధవని చేసిన రోజున ఎంత ఏడ్చానో ఏమనుకున్నానో తెలుసా? ఆయన పోయిన వదమూడవ రోజున వుదయం చీకటితో డోలీలో నన్ను వూరి చివరి మడుగు దగ్గరికి తీసుకెళ్లారు. కొందరు విధవలు నా చేతులకు గాజులు తొడిగారు. నుదుట పెద్ద బొట్టు పెట్టారు. తలలో పూలు తురిమారు. ఆ తర్వాత గాజుల్ని ముక్కలు చేశారు. బొట్టు చెరిపేశారు. పూలు చింపేశారు. తెల్లగుడ్డ కప్పేశారు. ఇంటికి తీసుకొచ్చి మారుమూల గదిలో కూర్చోబెట్టారు. ఒక్కొక్కరూ తెరతొలగించినన్ను చూసి 'ఛూ' అంటూ వూశారు. అప్పుడనుకున్నాను 'ఛూ... ఈ తిరస్కారపు బతుకొద్దు ఛస్తాను' అని కాని చావలేకపోయాను. ఏదో ఆశ ఆశపెట్టింది..."

"అది తలచి ఇదవ్వొద్దు. అదో మూర్ఖపు ఆచారం. దాని నంకెళ్లని ఛేదించాలి మనం"

"మన తరమా? నేను మళ్లీ బొట్టూ కాటుకా




ధరించగలనా? కారు మబ్బు కమ్మితే వర్షం రావటం ఖాయం. విధవ కాటుక ధరిస్తే కుటుంబ నాశనం ఖాయం అని మేవారి సామెత..."

"ఆ సామెతల్నీ సాంప్రదాయాల్నీ ఆ బూజుభావాలనీ మన మెదడునుంచి తుడిచెయ్యాలి. స్పిరిట్‌తో శుద్ధి చేసుకోవాలి సుందరీ. అప్పుడే మనం వెనక్కి చూడటం వెనక్కి నడవటం మానెయ్యగలం. నన్ను చూడు. నేను బొట్టుకాటుకా రంగు దుస్తులూ అన్నీ ధరిస్తున్నానా లేదా? పెళ్లికాక ముందు నుంచీ ధరిస్తోన్న వీటిని మధ్యన వచ్చి మధ్యలోనే పోయిన వారి గురించెందుకు దూరమవ్వాలి చెప్పు?"

"అయితే నువ్వూ..."

"నేనూ నీలాటి దాన్నే... అందుకే నిన్నూ నాలా మారమంటున్నాను. ఒకరి చెప్పుక్రింద తేలులానో ఒకరింటి బానిసలానో పడివుండొద్దంటున్నాను. నీకాళ్ల మీద నీవు నిలబడ్డప్పుడు నువ్వెవర్నీ లెక్క చెయ్యక్కర్లేదు. ఎవరికీ భయపడక్కర్లేదు"

"కాని మగాళ్లు... ఇక్కడ బావగారి కామదృష్టినుంచే తప్పించుకోలేక సతమతమవుతున్న దాన్ని ఇక గడపదాటితే..."

"ఏం కాదు... మన భయాలు మనల్ని పిరికివాళ్లని చేస్తున్నాయి. మన పిరికితనం ఎదుటివారికి బలమవుతోంది"

"అదీ నిజమే.. ఏదో రోజున ఈ పంజరం నుంచి ఎగిరిపోతాను. వీళ్లు సంతోషిస్తార్లే నా బరువు తగ్గిందని!"

"ఎప్పుడో కాదు రేపే నాతో వచ్చెయ్యి. మహిళా సంఘపు ఆధ్వర్యంలోని వర్కింగ్ వుమెన్స్ హాస్టల్లో చేరుస్తాం. ఏదో వుద్యోగం చూపిస్తాం"

"నీ మేలు నిజంగా మర్చిపోలేను దివ్యా. నన్నీ నరకకూపం నుంచి రక్షించడానికి దేవతలా వచ్చావు"

★ ★ ★

రుచీపచీ లేని భోజనాన్ని సుందరితోబాటు తిన్నాననిపించిలేచింది దివ్య.

దివ్య సుందరి స్నేహితురాలు గనుక ఆమెని అతిథిగా చూడదలచలేదు ఇంట్లో వాళ్లు.

వంటిల్లు సర్ది సుందరివచ్చేసరికి రాత్రి పదిగంటలయ్యింది. అప్పటివరకూ మేలుకునే వుంది దివ్య.

"నిద్ర రావటం లేదా"

"వచ్చినవని అవ్వకుండా నిద్రెలా వస్తుంది?"

"అన్నట్టు మర్చేపోయాను. మీరెందుకొచ్చారో చెప్పనేలేదు"

"దీప గురించిన నిజాలు తెలుసుకుందామని. నీకు తెలిసిందంతా చెప్పవూ?"

"సతి అయ్యేవరకూ ఆమె గురించెవరికీ పెద్దగా తెలీదు. ఇక్కడున్నదే తక్కువకాలం. నేను చూడను కూడా లేదు. మురళికి ఏదో రోగమని మా అత్తగారెవర్తోనో అంటోంటే విన్నాను. అన్నట్టు రాజపుత్రులలో విధవకి భర్తపోయిన మొదటి పన్నెండు రోజులూ అన్నం పెట్టరు!"

"మైగాడ్! ఎంత రాక్షసం!"

"ఎక్కువగా విధవని కులక్షిణి అనో కులనాశని అనో మొగుణ్ని మ్రింగిన రాక్షసి అనో వేధిస్తారు"

"దీప తనంతట తను సతియయ్యిందా లేక మామగారి ప్రోత్సాహముందా?"

"అదేమో తెలీదుగాని ఆమె మామగారు చాలా గట్టి మనిషి అని విన్నాను"

"అత్తగారు?"

"ఆవిడమంచిదే పాపం... కొడుకూ కోడలూ పోయినప్పట్నుంచీ ఆమె ఆరోగ్యం బాగుండటం లేదుట. పరాగ్గా వుంటోందనీ పరాకు మాటలు మాట్లాడుతోందనీ చెప్పుకుంటున్నారు..."

"మనం ఆమెని కలిసి మాట్లాడదాం"

"ఎవ్వర్నీ ఆమె దగ్గరకి వెళ్లనివ్వటం లేదుట. మా అత్తగారు చెప్పారు"

"కోడల్ని బలవంతాన చితికెక్కించటంతో ఆమె మనస్సు చెదరివుంటుంది. పాపభీతి ఆవరించి వుంటుంది. అది తట్టుకోలేక అదేలా అయిపోయివుంటుంది. ఆమె ఎక్కడ

నిజాల్ని కలవరించేస్తుందేనని కట్టడిచేస్తున్నా రన్న మాట. అదీ తేలుద్దాంలే. అన్నట్టు దీవ తల్లిదండ్రులేమంటున్నారు?''

''కార్యక్రమం అయ్యాకే వారికి తెలియజేశా ర్ట. చాలా ఆలస్యంగా వచ్చారు''

''ఏమైనా గొడవ చేశారా? దీవని చంపేరనీ పోలీసు రిపోర్టు ఇస్తామనీ...''

''అలాటిదేం విన్లేదు మరి. వాళ్లూ వీళ్లూ సఖ్యంగానే వుంటున్నారట. చుస్రీ నాడు కుంకుమా గాజులూ తేవాల్సింది వాళ్లేకదా. ఆడంబరంగా తెస్తారట...''

''శ్మశానంలో ఏం జరిగిందో ఎలా తెలుస్తుంది సుందరీ?

చితి పొగలో డప్పుల మోతలో కత్తుల మెరుపుల్లో ఏం జరిగిందో ఎవరు చూసి వుంటారు?''

''మా మరిది చూశాడు ఫొటోలు కూడా తీశాడట''

''థాంక్‌గాడ్... ఎంత గొప్ప సంగతి చెప్పేవు పద అతణ్ని కలుసుకుందాం!''

''ఇంత రాత్రి వేళా? భలేదానివే. మా అత్తగారు చూస్తే ముందు నన్ను నరికిపోగులు పెడుతుంది. రేపు పొద్దుటే పరిచయం చేస్తాను''

''రేపటిదాకా ఆగాలా... ఈ వుద్వేగాన్ని అణచుకోవడం ఎలా? సరేలే... తీగదొరికింది డొంక కదలక ఏం చేస్తుంది మీ మరిదేం చేస్తాడు''

''ఫొటోగ్రాఫర్. ప్రక్కవూళ్లో స్టూడియోవుంది. చుస్రీవుత్సవం రోజున అమ్మటానికి దీవసతి ఫొటోలు ప్రింటు చేస్తూ యమబిజీగావున్నాడు''

''చకచకా అమ్ముడయ్యే ఆలోచనమరి!''

మర్నాటి ఉదయం పానకాలు కాఫీ త్రాగుతోంటే అతడి గదిలోకి దివ్యని తీసుకెళ్లి పరిచయం చేసి తప్పుకుంది సుందరి.

''మీరు మా వదినని చూట్టానికొచ్చారా సతీ స్థలం చూట్టానికొచ్చారా?''

''రెండూనూ... అది సరేగాని మీరు చక్కని ఫొటోగ్రాఫర్ అటకదా. మీ వదిన చాలా గొప్పగా చెప్పింది మీ నైపుణ్యం గురించి. నేనూ ఫొటోగ్రాఫర్నేలెండి. భుజాన కెమేరా తగిలించుకుని కంటికి నదురుగా కన్పించిందంతా తీసేసే ఫొటోగ్రాఫర్ని''

''ఏమైతేనేం ఫొటోగ్రాఫర్... మిమ్మల్ని కలిసినందుకు చాలా సంతోషంగావుంది మీదేం కెమేరా?''

''ఏదో డబ్బా కెమేరాలెండి... మీ నైపుణ్యం చూడాలనొస్తే నా గురించడగుతారేం... మీ ఫొటోల్ని మీ స్టూడియోనీ చూపించండి''

''ముఖ్యమైన ఫొటోలన్నీ ఇక్కడే వున్నాయిలెండి చూపిస్తానుండండి''

రకరకాల ఫొటోలు చూపించాడు. అందులో అధిక భాగం స్టూడియోలో తీసినవే. వాటినే గొప్పగా పొగిడేసింది దివ్య. యాంగిల్ బాగుందనీ లైటింగ్ బాగుందనీ ఎక్స్‌ప్రెషన్ బాగుందనీ ప్రింటు వెయ్యటం బావుందనీ ప్రశంసించేసరికి చెట్టెక్కేశాడా మానవుడు.

''సతి రోజున చాలా ఫొటోలు తీశార్ట''

''ష్... అది మీరడక్కూడదు నేను చెప్పకూడదు''

''కళకి రహస్యమేమిటండీ మీ పనితనం అవుట్డోర్లో ఎలా వుందో చూద్దామని గానీ...''

''అందుకడిగారా...'' అంటూ బీరువాలోని ఒక అరలోంచి కొన్ని ఫొటోలూ నెగిటివ్‌లూ బయటికి తీశాడు పానకాలు.

''తియ్యడానికి చాలా ఫొటోలు తీశానండీ... కాని దానవ్వ చాలా మట్టుకు నెగిటివ్‌లతో సహా పట్టుకుపోయాడు''

''అలాగా'' అంటూ పరీక్షగా చూసింది ఫొటోల్ని.

శవయాత్ర... అగ్రభాగాన నడుస్తోన్న దీవ... చితిస్థలం... జనం... చితాభస్మానికి పూజలు-

''ఏదో ఇంగ్లీషు సినిమా చూస్తున్నంత యాక్షన్, క్లారిటీ కన్పిస్తోందండీ చిత్రాల్లో''

వంకర్లు తిరిగిపోయాడతడు.

''అవునూ సతీ దహన దృశ్యాల్ని కూడా ఫొటో తీయకపోయారా?''

''అప్పుడెవర్నీ ఫొటో తియ్యనివ్వలేదండీ... కార్యక్రమం అంతా అయ్యాక ముఖ్యులంతా

వెళ్ళిపోయాక ఫొటోలు తీసుకోమన్నారు''

నీరు కారిపోయింది దివ్య.

''చితి- చితి మీదో శవం. శవం తలని ఒళ్లో పెట్టుకున్న పెళ్లికూతురు. చుట్టూ మంటలు ఓహ్ ఫొటో తీసివుంటే చాలా గొప్పగా వుండేది. అంతర్జాతీయ ఫొటోకాంపిటేషన్‌కి పంపితే మీకు గోల్డ్‌మెడల్ లభించేదనుకోండి. సువర్ణావకాశం చేజారగొట్టేసుకున్నారు''

అతడు కూడా బాధపడిపోయాక రహస్యంగా అన్నాడు ''ఎవరూ చూడకుండా చెట్టు మీదనుంచో ఫొటో తీశానండీ... దూరాన్నుంచి తియ్యడంతో స్పష్టంగా రాలేదు. కాని మీరెవరికీ చెప్పనని ఒట్టెయ్యాలి మరి...''

''ఛా...ఛా... ఎందుకు చెబుతానండి... మీ మీద ఒట్టు... మీ ప్రతిభ గురించి శుభోదయం పత్రికలో ప్రత్యేక వ్యాసం రాయిస్తాను''

''ఆ పత్రిక వాళ్లు మీకు తెలుసా?''

''తెలుసా అని నెమ్మదిగా అడుగుతారేమిటి? ఆ పత్రిక ఎడిటర్ మహర్షి మా బాబాయే''

''అరెరె... అలాగా'' అంటూ తుర్రుమని లోపలికి పరుగెత్తి కాఫీ తెచ్చిచ్చాడు.

''క్షమించాలి... మీరెవరో తెలీక సరైన మర్యాద చెయ్యలేకపోయాను''

''దానికేమిట్లెండి గాని ఫొటో చూపిస్తానన్నారు...''

''ష్... గట్టిగా అనకండి కొంపలు అంటుకుపోతాయి. మీర్నాకో చిన్న సాయం చేసిపెట్టాలి''

''మా సుందరి మరిదిగారుమీరు. మీకెందుకు చెయ్యను. ఏం చెయ్యాలో చెప్పండి''

''నేన్తీసిన ఫొటోలు చూశారు కదా... నేను మంచి ఫొటోగ్రాఫర్నని ఒప్పుకుంటున్నారు కదా...''

''నిస్సందేహంగా''

''మీ బాబాయిగార్తో చెప్పి పత్రికలో ఫొటోగ్రాఫర్ వుద్యోగం వేయించి పుణ్యం కట్టుకోరూ. స్టుడియోమీద నెలకి మూడ్నాలుగొందలన్నా మిగిలిచావటంలేదు. ఫొటోగ్రాఫర్ వుద్యోగమైతే రెండుమూడు వేలు జీతమిస్తారట కదా'' ఆశగా అడిగాడు.

''మూడువేలదాకా ఇస్తారు... పైన టీఏలూ అవీ బోల్డు వస్తాయి. కానీ...''

''కానీ ఏమిటి? ఎవరి చెయ్యి అయినా తడపాలంటే చెప్పండి తడిపేద్దాం''

''ఛాఛా... మా బాబాయి లంచం తింటాడనుకున్నారా?''

''అహహ... మీ బాబాయి కాదు ఇంకా ఎవరైనా...''

''ఇంకెవరికీ వుద్యోగాలేసే అధికారం లేదు. వుద్యోగాలెయ్యటమూ తీసెయ్యటమూ అంతా మా బాబాయి చేతిలోనే వుంది కానీ... మీకెలా చెప్పాలో తెలీటం లేదు''

''నేనేం అనుకోను, నిర్మొహమాటంగా చెప్పండి''

''మా బాబాయికి రికమండేషన్లంటే మా చెడ్డకోపం, చిరాకు. ప్రతిభ- ప్రతిభ కావాలంటారు. ప్రతిభ ఎక్కడ కన్పించినా వెదుక్కుంటూ వెళ్ళి పిలిచి వుద్యోగమిస్తారు. కోరినంత జీతమిస్తారు. మీరింతవరకూ మా బాబాయి కళ్ళల్లో పడకపోవటం విచారకరం''

''ఎలా పడతానండి ఈ మారుమూల పల్లెలో పాతుకుపోయిన వాణ్ణి!'' విచారంగా అన్నాడు.

''ఐడియా!'' చిటికేసింది.

''ఏమిటో చప్పున చెప్పండి''

''అవుడ్డోర్లో మీరు తీసిన ఫొటోలన్నీ తీసుకెళ్ళి చూపిస్తాను. ఇన్వెస్టిగేటివ్ ఫొటోగ్రాఫర్ అని పొగిడేస్తాను. దెబ్బకాయన చిత్తైపోతారు వెంటనే మీకు టెలిగ్రాం ఇస్తారు. తిరుగు టపాలో మీరొచ్చేసి వుద్యోగంలో చేరిపోండి''

''ట్రిక్ ఫొటోల స్పెషలిస్టుని కూడానండీ. చుస్త్రీ వుత్సవంలో అమ్మడానికి రకరకాల కలర్ ఫొటోలు ప్రింటు చేయిస్తున్నాను. ఒరిజినల్ ట్రిక్ నేను చేసిందే''

కొన్ని ఫొటోలు చూపించాడు పానకాలు.

చితిబొమ్మవేసి శవం తల దగ్గర మురళి మొఖాన్ని ఇంపోజ్ చేసి దీప పెళ్ళిలో కూర్చున్న ఫొటోని శవం తల పక్కనవుంచి తీసిన





ఫొటో అన్నిటికన్నా బాగుంది. దాన్ని చూసిన వాళ్ళు చితిమీద మురళి తలని దీప ఒళ్ళో పెట్టుకుని దహనమవుతున్నప్పుడు తీసిన ఫొటో అని భ్రమపడటం ఖాయం.

దీప, మురళీ దేవతలై ఎగిరిపోతున్నట్టూ, దీపానతి అవుతోంటే సతీమాత ఆశీర్వదిస్తున్నట్టూ రకరకాల ట్రిక్ ఫొటోలవన్నీ.

"ట్రిక్స్ చాలా తెలివిగా ట్రిక్ అన్పించకుండా తీశారు. దీప పెళ్ళి ఫొటోలవీ ఎక్కడ దొరికాయి?"

"దాసప్పగారిద్వారా కొన్ని,పెళ్ళి ఫొటోలు తీసిన టౌన్లోనిస్టూడియోనుంచి కొన్ని సేకరించాను"

"ఇవి కూడా ఒక్కో సెట్ ఇవ్వండి నాకు. మా బాబాయికి చూపిస్తాను. అవునుగాని పానకాలుగారూ ఈ ట్రిక్ ఫొటోలకి దాసప్ప అభ్యంతరపెట్టలేదా?"

"భలేవారే... బాగా ప్రోత్సహిస్తున్నారండీ. రేపు వుత్సవంలో వేలాది కాపీలు అమ్ముడవుతాయి చూస్తూండండి ప్రతి ఇంటా పూజా మందిరంలో వెలుస్తాయండీ నా ఈ ఫొటోలూ!" గర్వంగా అన్నాడు.

"ధన్యులండీ నిజంగా...రవివర్మ చిత్రాల తర్వాత మీ ఫొటోలకి ఆ ఘనత దక్కబోతోందన్నమాట"

"ఈ ఫొటోల అమ్మకంలో ఫొటో కాపీకి రూపాయి చొప్పున దానప్పగారికివ్వాలి. అది మా ఒప్పందం- ఎవరికీ చెప్పకండేం"

"ఛఛ...ఎందుకు చెబుతాను. మీరిన్ని చూపిస్తున్నారుగాని అసలు ఫొటో చూపించటం లేదు"

"చూపిస్తాను... గోడలకి చెవులుంటాయని భయం. ఏమాత్రం దానప్ప చెవినిబడ్డా నన్ను ప్రాణాల్తో బతకనివ్వరు"

"ఛా మీ మీదకి రానిస్తానా? మీ ఫొటోల్ని చూడగానే మీ శిష్యురాలైపోయాను. గురువుకి నామాలు పెట్టేరకం కాదండోయ్ నేనూ"

"అహహ- వూరికే అంటున్నానెండి. మీకంత కర్మేమిటి మీ బాబాయిగారు పెద్ద పత్రికకి ఎడిటరూ"

"అవునవును... మీరు కాస్త ఆ ఫొటో చూపించరూ?"

"చూపిస్తానుండండి ఒక్క క్షణం" గది బయటికెళ్ళి ఎవరూ దగ్గర్లో లేరని నిర్ధారణ చేసుకున్నాడు. తలుపులు దగ్గరకి వేసి బీరువాలోపలి సేఫ్టీ అరలోంచో కవరు బయటికి తీశాడు. ఆ కవరులో ఒక ఫొటో, దాని తాలూకు నెగిటివ్ మాత్రం వున్నాయి.

చెప్పలేనంత వుత్కంఠతో చూస్తోంది దివ్య.

ఆ ఫొటో ఎలాంటి రహస్యాన్ని బయటపెడుతుందో ఎలాంటి సత్యాన్ని ఆవిష్కరిస్తుందోనని ఆరాటంగా వుందామెకి.

కవర్లోంచి ఫొటోతీసి ఆమె కందించాడు పానకాలు.

చితిమంటలమధ్య చిక్కుకున్న దీప చేతులు చాస్తూ అరుస్తోంది. ఎవరివో చేతులు ఆమె భుజాల్ని నొక్కుతున్నట్టు అస్పష్టంగా కన్పిస్తోంది. చుట్టూ యువకులు తిరుగుతున్నందునా చితికి దగ్గర్లో ఎందరో దగ్గరి బంధువులు వుండటంవల్ల అంతకంటే మరేమీ కన్పించటం లేదు. ఫొటో దూరాన్నుంచి తీసినందున దృశ్యం క్లియర్గా లేదు.

అయినా అమానుషానికి అద్దం పట్టిందని చెప్పాలి. దీప నవ్వుతూ ఆహుతయ్యిందన్నది ఎంత పెద్ద అబద్ధమో రుజువు చెయ్యడానికి ప్రత్యక్ష సాక్ష్యం చాలు!

దివ్య రక్తం పొగలుగక్కసాగింది.

ఫొటోని తీసుకుని దాచేశాడు పానకాలు.

"ఎలా వచ్చిందంటారు? బాగాదూరమైపోయింది కదూ?"

"దూరమైనా దారుణకాండకి దగ్గరయ్యింది. మూఢత్వపు రాక్షసత్వపు నగ్నత్వాన్ని కళ్ళకి కట్టినట్టు చూపుతోంది. మిమ్మల్నెలా అభినందించాలో తెలీటంలేదు..."

"ఏం అభినందనలో ఏమో ఎప్పుడెవరికి తెలిసిపోతుందోనని హడలి ఛస్తున్నాననుకోండి. ఎవరూ చూడకుండా తగల బెట్టేద్దామని కూడా అనుకుంటున్నాను"

"అంతపని చెయ్యకండి. ఒక నగ్నసత్యాన్ని శాశ్వతంగా సమాధి చెయ్యకండి"

"చెప్పటం తేలికే. కాని బయట పడితే ఏం జరుగుతుందో తెలుసా? ఎందరికో వురిశిక్ష పడుతుంది. జనం దీప అత్తవార్ని తరిమి తరిమి కొడతారు. వాళ్ళేమో నన్నూ మా వాళ్ళనీ సజీవ సమాధిచేసేస్తారు"

"ఆ ఫొటో మీరే తీశారనెలా తెలుస్తుంది?"

"అవాళ ఫొటోలు తీసిన వాణ్ణి నేనొక్కణ్ణేనని దానప్పకి తెలుసు. బాబ్బాబు- మీకెంతైనా పుణ్యం వుంటుందిగాని ఈ ఫొటో చూసినట్టూ నా దగ్గరున్నట్టూ ఎవరికీ చెప్పకండి"

"అలాగే... ప్రామిస్ చేస్తున్నాను. ఎంతో విలువైన సమాచారం అందించిన మీకు అన్యాయం జరగకుండా చూడాల్సిన బాధ్యత నామీద వుంది. మిగతా ఫొటోల కాపీలివ్వడానికి అభ్యంతరం లేదనుకుంటాను- ఖరీదు ఇచ్చేస్తాను"

"భలేవారే... నాకు సాయంచెయ్యడానికి ఫొటోలు తీసుకెళ్తోంటే వాటి ఖరీదు వసూలు చేస్తానా. ఈ పానకాలింకా దిగజారిపోలేదండీ"

"సరదాగా అన్నాను... సీరియస్‌గా తీసుకోకండి"

"అలాగలాగేగాని నావుద్యోగం సంగతి..."

"నేను చూస్తానుగా" ఫొటోలు తీసుకుని కృతజ్ఞతలు తెలియజేసింది దివ్య.

అనంతరం సర్పంచ్ అనంతయ్యగారింటికెళ్ళింది. ఆయనద్వారా మిగతా వివరాలు తెలుస్తాయనెంతో ఆశించింది. ఆయన పొరుగూరు వెళ్ళారని తెలీటంతో నిరుత్సాహంగా తిరిగొచ్చేసింది.

ఆ మరునాటి రోజున ధర్మరక్షాసంఘం వారు రాజధానిలో ప్రదర్శన చేయబోతున్నారు. అంచేత త్వరగా ఇక్కడిపని ముగించుకుని రాజధానికి వెళ్ళి ఆ ప్రదర్శన కవర్ చెయ్యాలనుకుంది.

తనతోబాటు సుందరిని కూడా తీసుకెళ్ళిపోవాలని సంకల్పించింది.

"సుందరిని నాతోబాటు తీసుకెళ్ళాలనుకుంటున్నాను పిన్నిగారూ" అందామె అత్తగార్తో దివ్య.

"అదెళ్ళిపోతే ఇంటిపనెవరు చేస్తారూ" అనేసి నాలిక్కరుచుకుందావిడ.

"ఇప్పుడెందుకు లేమ్మా. తల చెడిన ఆడది. అక్కడికీ ఇక్కడికీ వెళ్ళటం మంచిదికాదు"

"ఏదో నాలుగు రోజులుండి రావటానిక్కాదు పిన్నిగారూ. ఏకంగా తీసుకెళ్ళిపోదామనుకుంటున్నాను"

"ఏవిటీ!" బుగ్గలు నొక్కుకుందావిడ.

"మీరూ, బాబాయిగారూ చల్లగా చూస్తున్నారనుకోండి. కాని మీరు బతికినన్నాళ్ళూ బతకరు కదా. మీ తర్వాత పాపం సుందరి బతుకేమవుతుందో ఆలోచించండి. దాన్ని మీలా ఎవరు ఆదరించగలరు చెప్పండి? అందుకని తన బతుకేదో తన బతుకు తెరువేదో చూసుకుంటే బావుంటుంది కదా. ఒకరి మీద ఆధారపడక్కర్లేకుండా మీకు చెడ్డపేరు తీసుకురాకుండా తన బతుకేదో తను బతుకుతుంది. తనేదో వుద్యోగంలో స్థిరపడ్డాక మీరూ బాబాయిగారూ కూడా వచ్చి సుందరితోబాటు వుండిపోదురుగాని..."

ఆవిడ వెంటనే మాట్లాడలేకపోయింది. కొన్ని క్షణాలయ్యాక అంది- "ఇది ఇంటి విషయం. మగాళ్ళు తేల్చాల్సిన విషయం. అందర్నీ పిలుస్తానుండమ్మా. నీనోట ఎందుకొచ్చిందో ఆ మాట. నీపుణ్యాన దానికో దారి ఏర్పడితే అంతేచాలు!"

గయ్యాళిగా కన్పించే ఆవిడ పైటచెంగుతో కళ్ళొత్తు కొంటోంటే అనుకుంది "ఆమెదీ ఆడ మనస్సే మరి!"

కొడుకులూ, కోడళ్ళూ, అత్తమామలూ సమావేశమై చర్చించారు.

ఎవరి దయాదాక్షిణ్యాలమీదా ఆధారపడకుండా బతుకుతెరువు చూసుకుంటానంటే వద్దనటం ఎందుకూ అంది అత్తగారు.

కుటుంబ పరువుకి భంగం కలగని విధంగా బతుకుతానని హామీ ఇస్తే ఫరవాలేదన్నారు మామగారు.

వయస్సులో వున్నది గనుక మొదట పుట్టింటికి పంపేసి అక్కడ్నుంచి తనిష్టమైన చోటికెళ్ళమంటే బావుంటుందంది పెద్దకోడలు.





ఇంట్లోంచి పంపించేది లేదుగాక లేదన్నాడు పెద్దకొడుకు.

కాలంమారిందనీ మారిన కాలంతోబాటు తామూ మారాలన్నాడు పానకాలు.

తర్జన భర్జనలు పడ్డాక అన్నారు మామగారు- "తిండిపెట్టలేక ఇంట్లోంచి తరిమేశారని బంధువులంటారేమోనని భయంగా వుందమ్మా. ఆమె పుట్టింటివారేమంటారో తెలీదు కదా"

"పుట్టింటివారు తీసుకుపోయారని చెప్పండి బాబాయిగారూ. ఇక పుట్టింటివారికి ఈ ఆలోచన ఇదివరకే వచ్చింది. మీరొప్పుకోరని అడగలేకపోయారు. ఇక మీ గౌరవమర్యాదల కేరకంగానూ భంగం కానివ్వకుండా సగర్వంగా నత్శీలంతో జీవిస్తుందని సుందరి తరఫున నేను మీకు హామీ ఇస్తున్నాను" దివ్య నచ్చచెప్పింది.

సుందరి బరువు తగ్గుతుందనే భావించారో లేక ఆమె భవిష్యత్తుకి అడ్డురావడం ఎందుకనుకున్నారో లేక పానకాలి వాదనకి లొంగారో లేక సుందరి దయనీయస్థితికి జాలిపడ్డారో-

ఏమైతేనేం ఎట్టకేలకి ఆ ఇంటినుంచి సుందరి వెళ్ళిపోవటానికంతా అంగీకరించారు.

సుందరి ఆనందానికవధుల్లేకపోయాయి.

ఆమె జీవితంలో సరికొత్త అధ్యాయం మొదలయ్యింది.

పంజరంలో బంధించబడిన ఓ పక్షి ఆ చెర తప్పించుకుని విశాలగగనంలోకి వుత్సాహంగా ఎగిరిపోయింది.

★ ★ ★

రాజధానిలో ధర్మరక్షా సంఘం ఆధ్వర్యంలో రాజపుత్ర యువకులూ సతీసమర్థకులూ మతాధిపతులూ కలిసి బహిరంగసభ ఏర్పాటుచేశారు. మత విషయాల్లో ప్రభుత్వ జోక్యాన్ని నిరసించటం సభ ప్రధానోద్దేశంగా ప్రకటించారు. అరెస్టు చేసిన వారి విడుదల, సతీ మందిర స్థాపనకి అనుమతి తమ డిమాండ్స్‌గా పేర్కొన్నారు.

సభకి దాదాపు యాభై అరవై వేల మంది జనం వచ్చారు. సుమారు అయిదు వందల మంది రాజపుత్ర యువకులు తలపాగాలూ కరవాలాలూ ధరించి చేసిన ప్రదర్శన ప్రత్యేకాకర్షణ అయ్యింది.

మఠాధిపతి శ్రీశ్రీశ్రీ శివాచార్యా సభకి అధ్యక్షత వహించారు. కొందరు రాజకీయ నాయకులు కూడా వక్తలుగా పాల్గొన్నారు.

సభలో చేసిన వుపన్యాసాలు వినేసరికి దివ్య తల గిర్రున తిరిగిందనే చెప్పాలి.

ఈ దేశంలో స్త్రీల గురించి బహిరంగంగా ఎవరూ అభివృద్ధి నిరోధకంగా మాట్లాడరని ఇన్నాళ్ళూ గర్వపడుతూండేదామె ఆ గర్వమంతా పటాపంచలైపోయింది!

వేదాల ప్రకారం ఒక వ్యక్తికి మూడున్నరకోట్ల వెంట్రుకలుంటే సతీ సహగమనం చేసిన స్త్రీ మూడున్నరవేల కోట్ల ఏండ్లు స్వర్గంలో సుఖంగా జీవిస్తుందని చెప్పారు శ్రీశ్రీశ్రీ శివాచార్య. ఎవరేం చేసినా తనలో సత్యంవున్న స్త్రీ సతీసహగమనంచేసి తీరుతుందని వాక్రుచ్చారు.

కామానికి లోబడకుండా ఇతరులకు సేవచేస్తూ బతకగలిగితే వితంతువుగా జీవించవచ్చుగాని కామాన్ని జయించలేని స్త్రీని భర్తయెడ అమిత ప్రేమ వున్న స్త్రీని సతి కావడానికనుమతించాలని విజ్ఞప్తి చేశారాయన. స్త్రీ పురుష శరీరాలు సమానం కానప్పుడు హక్కులూ ధర్మాలూ సమానంగా వుండాలనడం హాస్యాస్పదమన్నారు.

కొత్తగా చేసిన సతీ నిషేధచట్టాన్ని వుపసంహరించుకోవాలనీ అరెస్ట్ చేసిన దీవ బంధువుల్ని విడుదల చెయ్యాలనీ సతీ స్థలంలో మందిర నిర్మాణానికి అనుమతించాలనీ డిమాండ్ చేశారు.

"స్వచ్ఛందంగా జరిగే సతిలో తప్పులేదు. సతీసహగమనం ఆచారం కాదు ధర్మం. సతీసహగమనాన్ని వ్యతిరేకించే స్త్రీలంతా వ్యభిచారులే" అంటూ ముగించారు.

అట్టుడికిపోయింది దివ్య.

నిరసన ప్రదర్శనలనీ విమర్శనాస్త్రాలనీ తట్టుకోలేక హడావిడిగా చేసిన సతీ నిషేధ చట్టాన్ని వ్యతిరేకించి సతిని మహిమాన్వితం




చేస్తూ ప్రసంగిస్తున్న ఆయన్ని పోలీసు లెందుకు అరెస్టు చెయ్యరని విడ్డూరపడుతూ చుట్టూ చూసింది.

ఎందరో పోలీసు అధికారులూ కూడా వున్నా రక్కడ. కర్తవ్యాన్ని మరిచి శ్రద్ధగా ప్రసంగాలు వింటున్నారు వాళ్ళు!

మరెందుకీ చట్టం? ఆడవారి ఆగ్రహాన్ని శాంతింపజేయటానికి ప్రభుత్వం తగిలించు కున్న ప్రగతి శీలపు ముసుగా?

దివ్యని మరింత ఆశ్చర్యంతో వుక్కిరిబిక్కిరి చేసేలా ప్రసంగించారు మిగతా వక్తలుకూడా.

పతిశవంతోబాటు సజీవదహనం చేసే అగ్ని సతి యొక్క సత్‌నుంచి పుడుతుంది. ఇందులో ప్రభుత్వానికేరకంగానూ సంబంధం లేదు''

దీప తన అభీష్టానుసారం సతి అయ్యింది. ఆమె మామగాని బంధువులుగాని ఎలాంటి ఒత్తిడి తేలేదు. లక్షకొక్కరు మాత్రమే సతి కాగలరు. ఆమె తనంతటతాను భర్త చితిమీద కూర్చుంది. అది చమత్కారం. మహాత్యం. అలాంటివి అత్యంత అరుదుగా జరుగు తూంటాయి. కొందరామెకి మత్తుపదార్థాలు తినిపించారనీ చితిమీంచి నాన్నా నాన్నా అని ఏడ్చిందనీ అంటున్నారు. అది అబద్ధం- అధ ర్మం!

ప్రభుత్వం దమనశక్తితో చుస్రీని నిరోధించ రాదు. అలా చేస్తే లక్షలాది ప్రజల నమ్మకాలకి అఘాతం తగులుతుంది. రక్తపాతం జరుగు తుంది. అందుకు ప్రభుత్వమే బాధ్యత వహించాల్సివుంటుంది.

''పతి చితిమీద కూర్చుని స్వయంగా ఆత్మ దహనం చేసుకునే స్త్రీ సామాన్యురాలు కాదని మా పరిపూర్ణవిశ్వాసం. నిశ్చయంగా ఇందులో దైవశక్తి ఇమిడివుంది. సతీమాత ఆశీర్వచనం వుంది''

''సతి గురించి శాస్త్రాల్లో లేదనే వారికోసం 'సతి' ఎలా పుట్టిందో చెబుతున్నాను. సతి శివుడి భార్య. దక్షుడి కుమార్తె. అల్లుడైన శివుడ్ని యజ్ఞానికి పిలవనందున ఆత్మద హనం చేసుకుంది. ఇదే 'సతి' పుట్టుకకి నాంది. ఆ తర్వాతామె పార్వతిగా పుట్టింది''

''స్వచ్ఛంద సతి హిందూ స్త్రీ జన్మహక్కు. దాన్ని నిషేధించడమంటే ఆమె తన భర్తతో స్వర్గంతో అమర సుఖాలనుభవించేహక్కు లేకుండా చేయడమే'

''గత పద్నాలుగు ఏళ్ళలో సుమారు ఇరవై ఎనిమిది మంది సతులయ్యారని ఒక అనధి కారి అంచనా. అప్పుడెప్పుడూ నోరు మెదపని వాళ్ళు ఇవాళ ఎందుకు గొంతు చించుకుంటు న్నారో అర్థంకావట్లేదు. సతిని చట్టపరంగా నిషేధిస్తే బ్రిటీష్ ఇండియాలోని సైన్యం కూడా తిరుగుబాటు చెయ్యొచ్చని అప్పట్లో సతిని పకడ్బందీగా అమలుచేయలేకపోయా రు. 1805లో సతీసహగమననిషేధం అమలు చేస్తే హిందువులు మతవ్యవస్థపై దాడిచేసిన ట్లవుతుందని 'నిజామత్ అదాలత్' న్యాయ మూర్తులు పేర్కొన్నట్టు దాఖలాలున్నాయి''

''సతి రాజపుత్రుల గౌరవానికి సంబంధించిన విషయం వారికి గర్వకారణం. వీరోచితం... దాన్నెవరు నిర్మూలించగలరు?''

''సతికి చాలా పెద్ద చరిత్ర వుంది. శాస్త్రాల సమర్థనవుంది''

వుపన్యాస పరంపర వినేకొద్దీ దివ్యరక్తం సలసలకాగసాగింది.

శాస్త్రాలు! వేదాలు! పురాణాలు!

ఎవర్రాశారివి? ఎప్పుడు రాశారు? ఎవరి కోసం రాశారు?

అన్నీ శాస్త్రాల ప్రకారమే చేస్తున్నామా? నడు స్తున్నామా?

ఒకనాటి వర్ణవ్యవస్థ ఈనాడుందా? లేదే.

నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి అన్నారు మనుస్మృ తిలో. ఈనాడది వర్తిస్తుందా?

అంటరానితనానికి హారతి పట్టారొకప్పుడు. ఇప్పుడది నిషేధం కాదా?

పుత్రజననం పుత్రికా జననంకన్నా శ్రేష్ఠమనీ స్త్రీ బుద్ధి తుచ్ఛమైనదనీ ఆమెకి విద్య నేర్పరా దనీ వుంది రుగ్వేదంలో.

అదే రుగ్వేదంలో స్త్రీలని డబ్బులేక సంప దలా దానమివ్వొచ్చన్నారు. రథంమీద తీసుకె ళ్ళి స్త్రీలని పురోహితులకీ ప్రముఖులకీ ఇవ్వడం మంచి కార్యమనీ రాజు కూడా ఇదే చేస్తారనీ

# రచయితలకు సూచనలు



ప్రచురించే ప్రతి నవలకు రు. 2,000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర' లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్య పూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకో గల నవలలకు వేదిక 'చతుర'.

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. "చతుర"లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 350 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 35వేల పదాలకు తక్కువకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో వారివారి దస్తూరీని బట్టి, ఒక పేజీకి ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం నవల ఎన్ని పేజీలు ఉండాలనేది ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ **ఈ లెక్క ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.**

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు త్రిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెల చతురలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడు తుంది.

ఎడిటర్

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482

చెప్పేరు!

అథమతె అథమ అథమ అతినారి అని అరణ్యకాండలో పేర్కొన్నాడు తులసీదాసు.

స్త్రీల అశ్వసంభోగం గురించి యజుర్వేదంలో విస్తారంగా వర్ణించడమేగాక ఆ కర్మ కాండని మహిమాన్వితం చేశారుకూడా.

అవన్నీ అనాదికాలంలో విజ్ఞానం వికసించని రోజుల్లో మగాడు ఆహార సంపాదనకీ ఆడది గృహరక్షణకీ పరిమితమైన కాలంలో రాజు రుషి బలవంతులుగా విలసిల్లిన యుగంలో రాసిన రాతలు! చెప్పిన కథలు!

వాటన్నిటికీ ప్రాణప్రతిష్ఠ చేస్తామంటే మళ్ళీ సమాజాన్ని ఆటవిక దశలోకి తీసుకెళ్తామంటే సాధ్యమయ్యేవనేనా?

దేశకాల పరిస్థితులలో బాటు మానవుడూ మానవుడి ఆలోచనా దృక్పథాలూ మానవవికాసం విజ్ఞానం నాగరికతా మారుతూంటాయి.

అదో సజీవ స్రవంతి!

తప్పుల్నీ అనాచారాలనీ సవరించుకుంటూ ప్రగతిశీలమార్గాన మానవ కళ్యాణం లక్ష్యంగా సాగిపోతుంది. ఎందరు మూర్ఖంగా అడ్డుకున్నా అడ్డు తగిలినా ఈ వాహినిముందుకే మున్ముందుకే సాగిపోతుంది తప్ప వెనక్కి తిరగదు! వెనక్కెళ్ళదు!!

ఇది చరిత్ర రుజువు చేస్తున్న నిగ్గు తేల్చిన నిత్యసత్యం!



"ఆంటీ... ఆంటీ..." ఏడుస్తూ వచ్చింది బుజ్జి.

"చ్చొచ్చొ- ఏడుస్తున్నావేం బుజ్జీ. మమ్మీ కొట్టిందా? టోఫీ ఇస్తాన్లే వూరుకో" ఎత్తుకుంటూ అంది దివ్య.

"నాకేం వద్దు"

"నా మీద కోపం వచ్చిందా?"

తల అడ్డంగా వూపింది. కళ్ళు నులుపుకుంటూ సన్నగా ఏడవసాగింది.

"ఇంతగా ఏడ్చేస్తున్నావు. ఏమయ్యింది బుజ్జీ. మీ డాడీ తిట్టారా?"

"వుహూ..."

"మరెందుకమ్మా ఏడుస్తున్నావూ, నీ ఆంటీనికదా నాకు చెప్పవూ?"

"మరేమో... మరేమో... నాకు తమ్ముడు పుట్టడంట..."

"ఓ అదా సంగతి. ఎవరు చెప్పేరు?"

"డాక్టరమ్మ చెప్పింది..."

"ఎవరు? డాక్టరా?"

తలూపింది బుజ్జి. "మా మమ్మీ పొట్టలో బుల్లిబాబు లేడట. బుల్లిపాప వుందంట. అందుకనీ అందుకనీ..." గట్టిగా ఏడ్చేసింది.

"అందుకని? ఏమయ్యింది బుజ్జీ?"

"బుల్లి పాపని పొట్టలోంచి తీసి ఆసుపత్రిలో చంపేశారంట. మమ్మీ కూడా ఏడుస్తోంది."

కడుపులో చెయ్యిపెట్టి దేవినట్టన్పించింది.

మైగాడ్! అల్ట్రా సౌండ్ స్కాన్ సౌకర్యాలొచ్చేక స్త్రీ గర్భంలోవున్న బిడ్డ ఆడామగా అన్నది తేల్చి చెప్పడం తేలికైపోయింది. గర్భంలో వున్నది ఆడపిల్ల అని తెలిస్తే శిశుహత్యకి పాల్పడుతున్నారు ఢిల్లీ బొంబాయిలాంటి మహానగరాల్లో. ఆ రోగం ఇక్కడికీ ప్రాకిందన్న మాట!

"మాట్లాడవేం ఆంటీ. బుల్లి పాప మంచిది కాదా? ఆడపిల్లల్ని అలాగే చంపేస్తారా? నన్ను కూడా చంపేస్తారా?"

"తప్పమ్మా తప్పు. అంత మాటనొద్దు. నీకెంతో సుందర సువిశాల భవిష్యత్తుందమ్మా. భావిదేశ పౌరులూ నవ్యజగతి నిర్మాతలూ మీరేనమ్మా. ఈ సమాజాన్ని మార్చే వైతాళికులు మీరేనమ్మా మీరే..."

బుజ్జిని గుండెలకి హత్తుకుంటూ అంది దివ్య. చిన్నపిల్ల అయినా ఆమె నోట వచ్చిన వచ్చినిజాలకి తల్లడిల్లిపోతూ ఆ చిన్నారి మనో వేదన అర్థం చేసుకోడానికి ప్రయత్నించ సాగింది.

"దివ్యా కమాన్... క్విక్..." హడావిడిగా వచ్చాడు చైతన్య.

"ఏమయ్యింది?"

"నువ్వేదుకబోయిన తీగ నా కాలికి తగి లింది. అనంతయ్య ఈ వూరొచ్చారు?"

"ఏ అనంతయ్య?"

"దేవపురం సర్పంచ్. నే వెళ్ళిన పెళ్ళికే ఆయనా వచ్చారు. అంతా ఆయన్ని చుట్టు ముట్టేసి సతి గురించి వివరాలడుగుతోంటే ఆరా తీశాను. ఆయనెవరో తెలిసింది. ఆయ న్ని కలునుకోలేక పోయానన్న నీ మాటలూ గుర్తొచ్చాయి. అపాయింట్‌మెంట్ తీసుకునొ చ్చాను. లేకపోతే హొటల్ ఖాళీచేసి ఈ పాటికి వెళ్ళిపోయేవారే. పద త్వరగా..."

"నీకేం ఫర్లేదు బుజ్జీ- నేనున్నానుగా" ధై ర్యం చెప్పి బుజ్జిని పంపేసింది.

టేప్ రికార్డరూ కెమేరా తీసుకుని చైతన్య మోటారుసైకిలు ఎక్కింది దివ్య.

అయితే, మరో ఇద్దరు ఓ మోటారుసైకిలు మీద వారిననుసరిస్తున్నారని గమనించలేదిద్ద రూ.

దివ్యని అనంతయ్యకి పరిచయం చేసి "ఒకటి రెండు గంటల్లో వస్తాను- మాట్లాడు తుండండి" అని చెప్పి వెళ్ళిపోయాడు చైత న్య.

"మిమ్మల్ని కలిసి మాట్లాడదామని మీ ఇంటికి వెళ్ళేను. మీరు వూళ్ళో లేనందున కలునుకోలేకపోయాను"

మాట్లాడలేదాయన. దీర్ఘంగా ఆలోచిస్తూండి పోయారు.

కొన్ని రోజులక్రితం వరకూ మకుటంలేని మహారాజులా వెలిగిన ఆయనిప్పుడు కొడిగ ట్టిన దీపమైపోయారు దేవపురంలో. ఆయన్ని పలకరించే వారూ చూడవచ్చేవారూ కరువైపో యారు. ఒక్కమాటలో చెప్పాలంటే చేతిలో పదవివున్నా అనామకుడైపోయారు. ఆ స్థితి తప్పించుకోడానికి అక్కడికీ ఇక్కడికీ వెళ్తోంటే వెళ్ళిన ప్రతిచోటా జనం ఈగల్లా ముసిరేసి అడుగుతున్నారు సతి గురించి! అది మరీ బాధాకరంగా భరించలేనిదిగా వుందాయనకి.

సతి పుణ్యమా అని సూరపరాజు రాజకీ యంగానూ ఆర్థికంగానూ బలపడ్డాడనీ తను చావుదెబ్బతిన్నాననీ భావిస్తూ కృంగి పోసాగా రు.

"సతి మంచిదా కాదా అన్నది ఎవరిక్కా వాలి! జనం గొర్రెల మందల్లాటి వారు. ఎటు తోలితే అటు పోతారు. ఇక మతంమత్తు జల్లితే కన్నెత్తి కళ్ళెదుట వున్నది కూడా చూడరు. అందుకే కొందరు తెలివైన వాళ్ళు వారిని బాగా వుపయోగించుకుని తమ పబ్బం గడుపు కుంటున్నారు. అందలం ఎక్కాలని చూస్తున్నా రు"

"అందుకు తాజా వుదాహరణ సూరప రాజు" దివ్య అంది ఎగదోస్తూ.

"ఖచ్చితంగానూ. అతడి గురించి చాలా మందికి తెలీదు. పరమ పిసినిగొట్టు. పిల్లికి బిచ్చం వెయ్యని రకం. అంతులేని ఆస్తి వుంది. అయినా దాహంతో అలమటిస్తాడు. తను పదవి వెలగబెట్టిన కొన్నాళ్ళలో ప్రజల సొమ్ము ఎంత తిన్నాడో లెక్కలేదు. డబ్బు కోసం నానా గడ్డీ కరిచే మనిషి. ఎవరికీ తెలీదుగాని కేవలం కట్నం కోసమే మురళి పెళ్ళి చేశాడు. దీర్ఘరోగంతో తీసుకుంటున్న అతడెక్కువ కాలం బతకడని తెలిసి కూడా ఒక ఆడపిల్ల గొంతు కోయడానికి సిద్ధపడ్డాడు. అలాటి వాడు కోడ ల్నెందుకు బతకనిస్తాడు చెప్పు?

ఆమె బతికి వుంటే ఆస్తిలో నగం వాటా ఆమెకి ఇవ్వాల్సివస్తుంది. పట్టుమని పదిరోజు లుకూడా కాపురం చెయ్యని పిల్ల నగం నంపద పట్టుకుని పుట్టింటికి వెళ్ళిపోవచ్చు. ఆ రకంగా నగం ఆస్తి అన్యాక్రాంతమవటం ఖాయం. ఆమె బతికి లేకపోతే ఆస్తి అంతా చిన్న కొడుక్కి దక్కుతుంది. నంపదలో చీలికా తరు గూ వుండదు. పోయిన కొడుకు ఎలాగూ తిరిగి రాడు. అంచేత వున్న కొడుక్కెందుకు అన్యాయం చేయాలనుకున్నాడు. బావమర్దితో కలిసి కుట్రపన్నాడు. కోడల్ని నతిని చేసేశా డు. నగం ఆస్తి మిగిలిపోయింది. చందాలు





కుప్ప తెప్పలుగా వచ్చి పడుతున్నాయి. సతీ మాత మామగారిగా పేరూ పలుకుబడీ పెరుగుతున్నాయి!''

''బాగా చెప్పేరు. మీరు చెప్పిందిముమ్మాటికీ నిజం. మీరెంతో అనుభవజ్ఞులు. ఎన్నో చూసినవారు. రకరకాల ఆటుపోటులకి తట్టుకున్న వారు. చక్కని తర్కజ్ఞానం కూడా వుందని విన్నాను. అందుకే మీ అభిప్రాయాలు తెలుసుకుందామనొచ్చాను...'' అంటూ పొగి డేసింది.

''సంతోషమేకాని నిజం చేదుగా వుంటుంది. ఆ చేదు మీ పాఠకులకి మ్రింగుడువడదు. వాళ్లక్కావాల్సింది రసాత్మక కథలూ మహాత్మ్యాలూ!''

''మా పాఠకుల్ని తక్కువగా అంచనా వెయ్యొద్దు. సతి గురించి నిర్ణయం ఎలా జరిగిందో దీపని ఎలా ఒప్పించారో శ్మశానంలో ఏం జరిగిందో మీకు తెలిసిందంతా చెప్పండి''

''సూరవరాజు కొడుకు చనిపోయాడని తెలిసి వెళ్లి ఓదార్చి వచ్చేశాను. మిగతా కార్యక్రమాల గురించి ప్రత్యక్షంగా నాకేమీ తెలీదు. అయినా అక్కడున్న వాళ్లూ చూసిన వాళ్లూ నాకు చెప్పింది మీకు చెబుతాను. నమ్మటమా మానటమా అన్నది మీ ఇష్టం...''

''చెప్పండి...'' టేప్ రికార్డర్ ఆన్‌చేసింది దివ్య.

అనంతయ్య చెబుతోంటే ఆమె కళ్ల ముందంతా దృశ్యరూపంలో కనబడసాగింది.

దీపాదేవి సతి అవడానికి నిశ్చయించుకుందని తెలిసి క్షణాల్లో వూరంతా తరలి వచ్చేసింది. కార్యక్రమం గురించి కులపెద్దలు సోమయాజులుగార్తో చర్చించారు. వెంటనే సుమారు పాతిక ముప్పై మంది రాజపుత్ర యువకులు తలపాగాలూ కరవాలాలూ ధరించి కార్యరంగంలో కురికారు.

తననేదో అద్భుత శక్తి ఆవరించినట్టూ తనేదో గొప్పకార్యం చెయ్యనున్నట్టూ ఫీలవుతూ పెళ్లినాటి పట్టువస్త్రాలూ నగలూ ధరించింది దీపాదేవి. అంతా వంగివంగి పాదాభివందనం చేస్తోంటే తనకేవేవో గొప్ప శక్తులు వచ్చినట్టు అనుభూతి ఫీలవుతూ ఆశీర్వదించిందందరీ్ని సామాన్యుల కెవరికీ సాధ్యంకాని మహత్కార్యం మహాయజ్ఞం చేయనున్నట్లుగా వుంది. వంటి మీద స్పృహ లేనట్టుగావుంది.

పెరటి త్రోవన పెండ్లి యాత్రని తలపించేలా కదిలింది శవయాత్ర.

త్వరత్వరగా కార్యం కానిమ్మనీ పోలీసులు రావొచ్చనీ దాసప్పా తదితరులు తొందరపెట్టసాగారు. గ్రామ పొలిమేరలో పూజ చేసింది. మెల్ల మెల్లగా ఆమె బింకం సడలిపోసాగింది. భయం బెదురూ మొఖంలో చోటుచేసుకోసాగాయి.

చితి స్థలాన్ని సమీపిస్తోంటే ఆమె కళ్లు చెమర్చాయి. కాళ్లు వణికాయి.

నడుస్తూ నడుస్తూనే ముందుకి తూలిపడిపోయింది దీప.

సూరవరాజూ, దాసప్పా, సోమయాజులూ తదితర ముఖ్యులు ఆమె చుట్టూ మూగారు. భూదేవికి సాష్టాంగ నమస్కారం చేస్తోందని జనానికి చెప్పేరు.

ఆమెని లేవనెత్తి చితి దగ్గరకి నడిపించుకెళ్లారు. సతీమాతనీ దీపపాతివ్రత్య శక్తినీ ఆమె చెవిలో స్తుతించసాగారు సోమయాజులు.

మంత్రబద్ధమైనట్టు-
ఇంద్ర జాలంలో చిక్కుకున్నట్టు-
మానసిక భ్రమకి లోనైనట్టు-
అచేతనావస్థలో వున్నట్టు-
చితి చుట్టూ ప్రదక్షిణ చేసి చితి ఎక్కింది దీప.

అల్లంత దూరాన నిలబడ్డ జనం సతీమాతకీజై... మహా సతిదీపకీ జై అని జయజయ ధ్వానాలు చేస్తోంటే-

రాజపుత్ర యువకులు కరవాలాలు ధరించి చితి చుట్టూ తిరుగుతోంటే డప్పులు మ్రోగాయి.
నగారాలు మ్రోగాయి
శంఖాలు మ్రోగాయి.

గాయత్రీ మంత్రం ఉచ్ఛస్వరంతో పఠించసాగారు సోమయాజులుగారు

చితికి నిప్పంటించాడు మురళి తమ్ముడు రాంబాబు.

మంటలు వువ్వెత్తున లేచాయి.

ఛెళ్లున వీపు మీద చరిచినట్టు వులిక్కిపడి

ఇహానికొచ్చింది దీప. కళ్లముందు అగ్ని శిఖలు నాలికలు జాపుతూ కన్పించాయి. కఠిన వాస్తవం వాస్తవరూపంలో ప్రత్యక్షమయ్యింది.

భయం ఆమె అణువణువునీ ఒక్కసారే ఆక్రమించగా భయభ్రాంతయై కెవ్వుమని అరుస్తూ చితిమీంచి లేవబోయింది. కొన్ని బల మైన హస్తాలు ఆమెని లేవనివ్వలేదు.

సరిగ్గా అప్పుడొకరు నల్లమందులాంటి పదార్థాన్ని ఆమె నోట్లో కుక్కి నోరు మూసేశారు.

సోమయాజులుగారు ఖంగుతిని అదేమి టంటే ఆయన్ని వెనక్కిలాగి హెచ్చరించారు సూరపరాజు. ఇంతదాకా వచ్చాక వెనకడుగేస్తే జనం పిచ్చికుక్కల్ని తరిమినట్టు తరిమి మరీ చంపుతారని హెచ్చరించాడు చెవిలో దాసప్ప. మిగతావాళ్లు మిన్నకుండిపోయారు.

అక్కడేదో తతంగం జరుగుతోందనుకుంటు న్నారు తప్ప అసలు సంగతి తెలీదు జనానికి. తెలిసే అవకాశం ఏమాత్రం లేదు కూడా.

దీప కళ్లనుండి నీళ్లు ధారలు కట్టాయ్... ''నాన్నా... నాన్నా... రక్షించండి నాన్నా... అయ్యో కాలిపోతోంది... అబ్బా... అమ్మా... మంటలు...'' అని ఏడుస్తూ కేకలుపెట్టింది. అలా ఏడుస్తూనే ముందుకి విరుచుకుపడిపో యింది.

డప్పుల మోతల్లో ఎవరికీ ఏమీ విన్పించలే దు.

ఆమె ముందుకి పడిపోవటం ఆలస్యం దాసప్ప సైగచేశాడు. నేతి డబ్బాలతో సిద్ధంగా వున్న వాళ్లంతా ముందుకొచ్చి నేతిని చితిలో పోసి నమస్కరించారు.

వేయి నాల్కలు జాపుతూ ప్రజ్వరిల్లాయి మంటలు. ఒక్కసారే అన్ని వైపుల్నుంచీ శవంతోబాటు దీపని కూడా చుట్టేశాయి.

నగారా మోతలూ శంఖనాదాలూ మంత్రోచ్ఛ రణలూ సతి నినాదాలూ ప్రతిధ్వనించాయి.

పదినిమిషాల్లో అంతా అయిపోయింది.

దీపాదేవి భర్త శవంతోబాటు గుప్పెడు బూ డిదైపోయింది.

దీప సతీమాత అయ్యింది, అమరురాల య్యింది, దేవతయ్యిందని అరవసాగారు పిచ్చి జనం.

''కాదు కాదు అవి మంటలు కాదు. పిశా చాల వికటాట్టహాసాలు. మూఢమతపు విష జ్వాలా కీలలు. ఆడదాన్ని బానిస చేసే మృ త్యుకేళీ క్రీడలు. పురుషాధిక్య భుగభుగల్లో మాడి శలభాలైనఅతివపెట్టినఆఖరికేకలు!''

కుతకుత వుడికిపోతున్న దివ్య మనస్సులో రగిలిన జ్వాలల నెవరు ఆర్పుతారు?

కేవలం మతమూ భక్తీ నమ్మకాలూ ఎవర్నీ తమంతతాము దహనం చేసుకునేట్లు చెయ్య లేవని గ్రహించి మత్తు మందు సాయంతో క్రూరంగా చంపేశారు!

దీనికి మతమూ మతవాదులూ మఠాధిప తులూ ఇచ్చే సమాధానమేమిటి?

సోమయాజులుగారూ! మీ జవాబేమిటి?

''నమ్మకాలని అమ్ముకుని బ్రతికే మనిషి మీకేం సమాధానమిస్తారు?''

అనంతయ్యతో ఏకీభవించిందామె. ఆయన కి కృతజ్ఞతలు చెప్పి బయటికొచ్చింది.

''చాలా చీకటిపడిందే'' అనుకుంది. చైత న్య కోసం చుట్టూ చూసిందిగాని అతడి జాడలే దు. వస్తానన్నవాడెందుకు రాలేదో అనుకుంది.

మనసంతా అశాంతిగా అల్లకల్లోలంగా వుండటంతో అతడి కోసం నిరీక్షించలేకపో యింది.

రిక్షా పిలిచి ఎక్కింది దివ్య.

మంత్రి మృత్యుంజయరావు మనుషులు ఆ రిక్షాని అనుసరించారు.

★ ★ ★

రిక్షా నిర్మానుష్య ప్రదేశాన్ని సమీపించిందో లేదో దుండగుల మోటారు సైకిలు ముందుకొ చ్చి ఆగింది.

రిక్షావాడూ దివ్యా కూడా అదిరిపడి చూశా రు.

''రిక్షాని రోడ్డు ప్రక్కన ఆపు''

''ఎందుకు?''

''చెప్పింది చెయ్యి బే''

''ఏమిటీ దౌర్జన్యం?'' రిక్షా దిగుతూ అంది దివ్య.





"దౌర్జన్యం మాకూ ఇష్టం కాదు. మంచిగా వ్యవహారం సెటిలైపోతే మా దారిన మేం పోతాం, నీ దారిన నువ్వు పోవచ్చు."

"మీకేం కావాలి? డబ్బా?" పర్సు తీస్తూ అంది.

"అలాంటి చిల్లర పనులకోసం రాలేదు"

"మరింకేం కావాలి"

"ప్రాణాలు కాదులే!" నవ్వేడొకడు.

"ఫొటోలు కావాలి. మంత్రి మృత్యుంజయ రావుగార్ని దేవపురంలో నువ్వు తీసిన ఫొటోలు కావాలి"

"మంత్రిగారి ఫొటోల కోసం నా దగ్గరకి రావాలా?"

"అతి తెలివికి పోవద్దు. సూరపరాజుగార్తో మంత్రిగారు కలిసుండగా తీసిన ఫొటోలు మర్యాదగా ఇచ్చెయ్యి. లేకపోతే నువ్వన్నావే దౌర్జన్యం అని అది చెయ్యాల్సొస్తుంది"

"ఎప్పుడో తీసిన ఆ ఫొటోలు ఇప్పుడు నాదగ్గరెక్కడున్నాయనుకుంటున్నారు?"

"మరెక్కడున్నాయి?" చురకత్తిని కంఠం మీద పెట్టి గర్జించాడు.

"పత్రికాఫీసులో... అయినా అవి మీ కెందుకు?"

"అది మాకు తెలీదు. ఆ ఫొటోలు నెగిటివ్ లతో సహా మాక్కావాలంతే" అని ఒకడంటే, "మంత్రిగారి పరువు వాటితో ముడిపడి వుంది" అన్నాడు రెండోవాడు.

సంగతి అర్థమైపోయింది దివ్యకి. ఆ ఫొటోల వల్ల మంత్రిగారు సతిని సమర్థిస్తున్నా రన్న అపప్రథ రాకుండా వీళ్లని పంపేరన్న మాట!

"చెప్పవేం.. రేపు వాటిని తెచ్చివ్వాలి"

"మీరు మా పత్రిక చూడరా?" హఠాత్తుగా ఏదో గుర్తురాగా అంది.

"ఊహు... దానికీ దీనికీ సంబంధం ఏమిటి?"

"ఆ ఫొటోలు ఇవాళ్టి మా పత్రికలో ప్రింట య్యాయి"

"ఆ!"

దుండగులిద్దరూ మొఖామొఖాలు చూసు కున్నారు.

"అబద్ధం..." అరిచాడొకడు.

"అలా ఏ హొటల్లోకో వెళ్లి పేపర్ తిరగేసి చూడు. తీసిన ఫొటోల్ని ఎక్కువకాలం మాద గ్గర దాచుకోం"

సందిగ్ధంలో పడిపోయారిద్దరూ.

ఫొటోలు తీసుకోమనీ ఇవ్వనంటే చంపమనీ ఆదేశించారు. కాని పరిస్థితి తిరగబడింది.

"ఏం చేద్దాంరా?"

రెండో వాడు బుర్ర గోక్కున్నాడు.

దూరాన మోటారు సైకిలొస్తూ కన్పించింది. దుండగులు ప్రక్కకి తప్పుకున్నారు.

మోటారు సైకిలు ఆగింది. ఇన్స్పెక్టర్ చైత న్యని చూసి కాళ్లకి బుద్ధి చెప్పేరు వాళ్లు.

"సమయానికొచ్చావ్" దివ్య అంది.

"వాళ్లెవళ్లు?"

"రౌడీలు"

"నిన్నేం చెయ్యలేదు కదా?"

"వాళ్ల మొఖం! తేలిగ్గా బుట్టలో పడ్డారు. ఒక ఆలోచనకి కారకులైనందుకు అభి నందించాలి కూడా"

"అదేమిటి?"

"మంత్రి మృత్యుంజయరావు దేవపురం వెళ్లినట్టుగాని, సతిని బలవరిచనట్టుగాని ఎలాంటి ఆధారాలూ వుండకుండా జాగ్రత్త పడుతున్నారు. అంటే అధికార పార్టీలో సతీ సమర్థకులకి చుక్కెదురయ్యిందన్న మాట. సతిని సమర్థిస్తే పార్టీ ఇమేజ్ దెబ్బతినొచ్చని పైనుంచి వత్తిడి వచ్చివుంటుంది. ఇక చుస్రీవు త్సవాన్ని నిరోధిస్తారేమో చూద్దాం"

"రెండు వైపులా పదునున్న కత్తిలాంటివి రాజకీయాలు. వాళ్లకి సతి సమర్థకుల ఓట్లూ కావాలి, వ్యతిరేకుల ఓట్లూ కావాలి. అంచేత గోడమీది పిల్లిలా నాటకమాడతారు చూడు"

"అదే జరిగితే సభ్య ప్రపంచంలో మన దేశం సిగ్గుతో చితికిపోవాలి!"

★ ★ ★

చుస్రీ వుత్సవానికి ఇంకొక్క రోజే వ్యవధి వుంది.





ఆ వుత్సవం జరగనీయరాదని ఓ మహిళా సంఘం హైకోర్టులో రిట్ పిటిషన్ దాఖలు చేసింది. పిటిషన్ పరిశీలించిన మీదట చుస్రీ వుత్సవం జరక్కుండా తగినచర్య తీసుకోవాల్సిందిగా రాష్ట్రప్రభుత్వాన్ని ఆదేశించింది హైకోర్టు.

ఏది ఏమైనాసరే వుత్సవాన్ని జయప్రదం చెయ్యడానికి కంకణం కట్టుకున్నది ధర్మరక్షా సంఘం. ఉత్సవానిక్కావాల్సిన ఏర్పాట్లన్నీ చకచకా సాగిపోతున్నాయి. అరెస్ట్ చేయబడ్డ సూరపరాజు, సోమయాజులు, రాంబాబులని బెయిలు మీద విడుదల చెయ్యడంతో వారి వుత్సాహం మరింత పుంజుకుంది. రాష్ట్రంలోని రాజపుత్రయువకులెందరో దేవపురం రాసాగారు. చుస్రీ తమ గౌరవ పౌరుషాలకి సవాల్‌గా భావిస్తున్నారు వాళ్లు. వాళ్లని ఎక్కేస్తున్నారు అవకాశవాద నాయకులు.

దేవపురంలో ఎన్నో రకాల దుకాణాలు వెలిశాయప్పుడే.

సతీ స్థలాన్ని దర్శిస్తోన్న జన సంఖ్య గంట గంటకీ అధికమవుతోంది.

వివిధ పోలీసుబలగాలు దేవపురం చుట్టూ సమీకృతమవసాగాయి.

ఈ నేపథ్యంలో మర్నాడేం జరగనున్నదీ దివ్య వూహకందటంలేదు.

అవాళే బెయిలు మీద విడుదలైవచ్చిన సోమయాజులుగార్ని కలుసుకోవడానికెళ్లింది దివ్య.

దీప సజీవదహనం గురించీ చితిమీంచి ఆమె పెట్టిన కేకల గురించీ ఆమె చేత తినిపించిన మత్తుపదార్థం గురించీ మర్నాటి వుత్సవం గురించీ ఎన్నెన్నో ప్రశ్నల బాణాలని సంధించాలనుకుంది.

ఆయనెవర్తోనూ మాట్లాడటని చెప్పేరు అక్కడ ప్రోగైన పురోహితులు. హతాశురాలవ్వాలేదామె.

అదే మతమిచ్చే సమాధానమనుకుని గిరుక్కున వెనుదిరిగింది.

ఇంతవరకూ తను సేకరించిన సమాచారాన్నంతా సరిచూసుకుంటోంటే దీప పుట్టింటివారిని కలుసుకోలేదన్న సంగతి బయటపడింది.

మురళి చనిపోయాడనికాని దీప సతి కానున్నదనిగాని వారికి తెలియజేయలేదు. కార్యక్రమమంతా అయిపోయాక గాని వారికి వార్త సందించలేదు.

అంత హడావిడిగా గప్‌చిప్‌గా కార్యక్రమం ముగించినందుకు దాని వెనకేదో కుట్రో కుతంత్రమో వుందని దీప కన్నవాళ్లు అనుమానించారా లేదా? వార్త విన్న వెంటనే వారెలా రియాక్ట్ అయ్యారు? పోలీస్ రిపోర్టిచ్చారా లేదా?

స్వయంగా వాళ్లని కలిసి సమాధానాలు రాబడితే మంచిదని బయల్దేరింది దివ్య.

దేవపురానికి సమారు ముప్పై కిలోమీటర్ల దూరంలోవున్న చిన్న టౌన్లో పుట్టిపెరిగింది దీప. ఆమె తండ్రీ అన్నలూ అక్కడేదో వ్యాపారంచేసుకుంటున్నారు. ఆమె వివాహం కూడా అక్కడే చాలా అట్టహాసంగా జరిగింది.

ఆ ఇంట్లో చిందులేస్తోన్న పండుగ వాతావరణం చూసి ముక్కున వేలేసుకుంది దివ్య. చాలామంది బంధుమిత్రులు పెళ్లికొచ్చినట్టుగా వచ్చివున్నారు.

అతి కష్టం మీద దీప అక్కగారితో మూడు నిమిషాలు మాట్లాడగలిగింది దివ్య.

"రేపటి వుత్సవంలో మీరు పాల్గొనబోతున్నారా?"

"ఎందుకు పాల్గొనం? మేం వెళ్లకుండా కార్యక్రమం ఎలా పూర్తవుతుంది. మా అన్నయ్యలు ఎర్రపట్టు చీరనూ గాజుల్నీ పసుపు కుంకుమల్నీ బాజాభజంత్రీలతో తీసుకెళ్తారు. మేమూ మా బంధువులూ ఆ కార్యక్రమంలో పాల్గొని తరిస్తాం"

"మీ చెల్లెలికి భక్తీ మత విశ్వాసాలూ ఎక్కువా?"

"ఎక్కువే"

"మరి పెళ్లిలో సనాతన పెళ్లికూతుర్లాగాక ఆధునిక పెళ్లి కూతుర్లా మోడర్న్‌గా అలంకరించుకుందేం?"

"దానికి ఫాషన్ అంటే ఇష్టం"

"ఆమె సజీవంగా దహనమైనందుకు మీకు బాధగాలేదా?"



"బాధగానూ వుంది. సంతోషంగానూ వుంది. కోటికొక్కరు మాత్రమే సతీమాత అనుగ్రహానికి పాత్రులవుతారు. ఆ అనుగ్రహం దక్కిన నా చెల్లెలు ధన్యురాలు. ఆమె నిత్య సుమంగళి. తారాచంద్రులున్నంత కాలం అలాగే వుంటుంది. అంత గొప్ప అదృష్టానికి నోచుకోవటం దేవుడిచ్చిన గొప్పవరం. పూర్వజన్మ సుకృతం"

పిమ్మట దీప తండ్రిని కలిసింది దివ్య.

"ఈ వూరు దేవపురానికి గంట ప్రయాణంలోవుంది. అయినా మీ అల్లుడి మృతి గురించిగాని మీ కూతురి సతి గురించిగాని మీకు తెలియజేయలేదు. అందుకు మీకు బాధగా కోపంగా లేదా? ఏదో దురుద్దేశ్యం వుందని మీరు భావించటం లేదా?"

"లేదు"

ఆశ్చర్యపోవటం దివ్య వంతయ్యింది.



"అదేం? మీకు ఆఖరి చూపు కూడా దక్కకుండా అల్లారుముద్దుగా పెంచిన మీ అమ్మాయిని అగ్నిలోకి త్రోసి సజీవంగా దహనం చేసినందుకు మీ వియ్యాలవారి మీద మీకేమీ కోపం లేదా?"

"లేదు... ఏంచేతంటే అందుకుతగిన కారణం వుందని నమ్మేం గనుక"

"ఏవిటో ఆ కారణాలు?"

"మీకు గుర్తుందో లేదో మా అమ్మాయి సతి యయ్యింది భాద్రపదమాసం ఏకాదశీ శుక్రవారం రోజున. ఆ శుభఘడియలు జారకుండానే ఆమె సతి అవడం శ్రేయస్కరం. స్వర్గప్రాప్తికి మార్గం సుగమం అవుతుంది కూడా. అందుకే దైవజ్ఞుల్లాంటి పురోహితులు లగ్నం నిశ్చయించారు. ఆ ప్రకారం కర్మకాండ యావత్తూ నిర్విఘ్నంగా జరిగిపోయింది. సతీదీప మా ఇంట జన్మనెత్తడం పూర్వజన్మ సుకృతం. ఆమె వల్ల మా ఏడు తరాల వారి పాపాలన్నీ ప్రక్షాళితమైపోయాయి" కళ్ళొత్తుకున్నారాయన.

"మీరు మనస్ఫూర్తిగా ఆ మాటలు చెబుతున్నారా? మీ పాపాల ప్రక్షాళనానికి కనిపెంచి పెద్దచేసిన కూతుర్ని బలిపశువుని చేశారని మీ మనస్సు మిమ్మల్ని నిలదీయటం లేదూ? నిజం చెప్పండి. మీ రక్తంమాంసాలు పంచుకు పుట్టిన మీ అమ్మాయి అన్యాయంగా దారుణంగా చంపబడిందన్న బాధ మీ గుండెల్ని తొలచడం లేదూ? చిత్రవధకి లోనై నరకయాతననుభవిస్తూ 'నాన్నా... నాన్నా' అని అరుస్తూ అసువులు బాసిన మీ అమ్మాయి ఆర్తనాదాలు మీ మెదడులో ప్రతిధ్వనించడం లేదూ?"

కళ్ళు మూసుకుని మౌనంగా వుండిపోయారు. కొన్నిక్షణాలు అనంతరం కళ్ళు తుడుచుకుంటూ అన్నారు "దుఃఖం బాధ ఎందుకుండవమ్మా? దీప నాబిడ్డ. బిడ్డ అకాలమరణం ఏ తల్లిదండ్రుల్ని కలచివెయ్యదు? కాని గతంగతః అన్నారు. జరిగిందేదో జరిగిపోయింది. అదంతా తవ్వుకోవడం వల్ల మా అమ్మాయి బ్రతికి రాదు కదా. లేనిపోని అనుమానాలు పెంచుకుని రాద్ధాంతాలు చేసి మా కుటుంబ పరువుని మంటకలవగల శక్తి మాకు లేదు. సాటి కులస్తుల మధ్య నవ్వుల పాలవ్వగల గుండె నిబ్బరం మాకులేదు"

"అలా అని రేపు మీ వాళ్ళెవరైనా సతి అవుతానంటే అనుమతిస్తారా?"

"వూహు... అనుమతించను. అసలలాటివి ఎప్పుడో ఎక్కడో చాలా అరుదుగా జరుగుతూంటాయి. కొందర్ని అమరుల్ని చేస్తూంటాయి. అంతా భగవదేచ్ఛ!"

"సతీస్థలంలో స్మారకమందిర నిర్మాణానికి లక్షల్లో విరాళాలొచ్చినట్టు వార్త. ప్రభుత్వం మందిర నిర్మాణానికి అనుమతించకపోతే ఆ సొమ్మేంచేస్తారు? సతీదీప స్మారక ట్రస్టులో మీరూ సభ్యులేకదా!"

"ఆ సంగతి గురించి ఇప్పుడేమీ చెప్పలేను. సమాజోపయోగార్థం చక్కని ప్రయోజనాత్మక కార్యక్రమాలు చేబట్టగలమని మాత్రం చెప్పగలను"

"మీ అబ్బాయిల్లో ఒకరు దీపని అమానుషంగా హత్యచేశారని పోలీసు రిపోర్టివ్వ ప్రయత్నించాట్టకదా. అందుకు మీరూ మీ బంధువులూ అడ్డుపడి అతన్ని దూరప్రదేశాలకి పంపించారని చెప్పుకుంటున్నారంతా"

"దాని గురించి నాకు తెలీదు. దీపంటే మా చిన్నవాడికెంతో ప్రేమ. అంచేతామె మరణానికి బాగా కృంగిపోయాడు. దూరంగావుంటే త్వరగా తేరుకుంటాడని పంపించాం తప్ప మరేమీకాదు"

"నమ్మమంటారు?"

"అది మీ ఇష్టం"

"రేపటి చున్రీ వుత్సవం జయప్రదమవుతుందంటారా?"

"ఎందుక్కాదు? సుమంగళిగా చనిపోయినప్పుడు పదమూడో రోజున చేసే మతసంబంధిత కర్మకాండ చున్రీ. పుట్టింటివారు గాజులూ పసుపుకుంకాలూ తీసుకెళ్ళి ముత్తైదువలకి పంచటం మా ఆచారం. దాన్నెవరైనా ఎందుకు వ్యతిరేకించాలి?"

"మీకు తెలును... అది సహజసిద్ధ మరణంకాదు. అది మామూలు కర్మకాండకూడా కాదు. కేవలం సతిని మహిమాన్వితం చెయ్యడానికే చున్రీ వుత్సవం ప్రధానంగా వుద్దేశింప



బడింది. అందుకే అన్ని ఏర్పాట్లూ అట్టహాసాలూ చందాలూ స్మారక మందిరాలూ! కాదంటారా? కాదనగలరా? గుండెలమీద చెయ్యి వేసుకుని చెప్పండి? కులాన్నీ మతాన్నీ క్షణ కాలం మర్చిపోయి ఒక ఆడపిల్ల తండ్రిగా జవాబు చెప్పండి. నా స్థానంలో మీ దీపాదేవి కూర్చుని అడుగుతోందనుకుని సమాధానమివ్వండి''

ఆయనకళ్లు సజలమయ్యాయి.

లేచి ఆమె తలనిమిరి అక్కడ నుంచి వెళ్లిపోయారు మౌనంగా.



దేవపురంలో ఏం జరుగుతోందోనని దేశమంతా వూపిరి బిగబట్టి వార్తల కోసం ఎదురుచూస్తోంది. ఇక్కడ దేవపురంలో నేల ఈనినట్టు జనం జనసముద్రం!

లక్షలాది జనం. చిన్నా పెద్దా ఆడామగా అంతా అన్ని కులాలవారూ అన్ని మతాలవారూ తండోపతండాలుగా వచ్చారు. ఎందరో విధవలు కూడా రావటం విశేషం. అక్కడ జరిగేది లోకానికి తెలియబరచాలని దేశం నలుమూలల్నుంచీ ఎందరో దేశవిదేశీ పత్రికా విలేఖర్లొచ్చారు.

పోలీసులు కూడా వేల సంఖ్యలో వచ్చారు. కాని వూరి బయటేవుండిపోయారు. దేవపురానికి అయిదు కిలోమీటర్ల దూరంలోనే బస్సుల్నీ ఇతర వాహనాలనీ నిలిపేశారు.

దాంతో జనం జైజై నినాదాలు చేస్తూ కాలినడకన దేవపురంలో ప్రవేశిస్తున్నారు. కొందరు నాయకులు మాత్రం కార్లలోనే వెళ్లేరు.

సతీస్థల ప్రాంతంలో ఇసుకవేస్తే రాలనంత జనం.

సతీకీర్తనలక్కడ ప్రతిధ్వనిస్తోంటే దరిదాపుల్లో ఒక్క పోలీసూ లేరు!

దీప దహనమైన చోట చిన్న మంటపం నిర్మించి పెళ్లిమంటపంలా అలంకరించారు.

దీప తోబుట్టువులు బాజాభజంత్రీలతో చున్రీ తీసుకొచ్చారు.

ఆ ప్రదేశంలో త్రిశూలం గుచ్చారు. పాలూ గంగాజలం పోసి అభిషేకం చేశారు. బొట్లు పెట్టి బంగారు బోర్డరుగల ఎర్రచీర (చున్రీ) చుట్టారు. నిత్య సుమంగళికది నివాళియని వారి నమ్మకం.

సోమయాజులుగారు ఉచ్చస్వరంతో మంత్రాలు పఠించారు. జన సందోహాన్ని చూసేసరికి ఆయనకెక్కడలేని వుత్సాహమూ వచ్చేసింది. తన అరెస్టు భగవంతుడు పెట్టిన పరీక్ష అనుకుంటున్నారు.

శంఖాలు వూదారు.

డప్పులు మ్రోగాయి.

జయజయ నినాదాలు ప్రతిధ్వనించాయి.

దర్శనార్థం జనం త్రోసుకొచ్చారు.

చందాలు వర్షమై కురిశాయి.

కనీసం మూడు లక్షల మంది జనం వుత్సవంలో పాల్గొన్నారనీ సుమారు ముప్పై లక్షల రూపాయలు వసూలయ్యాయనీ చూసినవారన్నారు.

దేవపురం జాతకం మారిపోయింది.

అదో పుణ్యస్థలమైపోయింది. వరదలా వచ్చిపడుతోన్న యాత్రీకుల పుణ్యమా అని వూరివారి ఆర్థికస్థితి బాగుబడింది. వ్యాపారాలు మూడు పువ్వులూ మూడు వందల కాయలుగా విలసిల్లుతున్నాయి.

చున్రీ నాడు ఎన్ని గాజులూ ఎన్ని పసుపు కుంకాల పొట్లాలూ అమ్ముడయ్యాయో లెక్కేలేదు.

పానకాలు బిజినెస్ గొప్పగా సాగింది.

దీపాదేవి భర్త తలని ఒడిలో పెట్టుకుని చితి మీద కూర్చునున్నట్లు ట్రిక్‌తో తీసిన ఫొటోని బ్రిస్క్‌గా అమ్మేడు. ఏడు రూపాయలు కూడా

చెయ్యని కాపీని పదిహేనుకీ ఇరవైకీ అమ్మేరు. కనీసం యాభై వేల కాపీలు అమ్ముడయ్యాయి.

చుక్రీ వుత్సవం జయప్రదంగా ముగిసిందని ప్రకటించింది ధర్మరక్షా సంఘం. ప్రభుత్వ మౌనం వెనుక మంత్రి మృత్యుంజయ రావులాంటి నాయకుల హస్తం వుందని వారికి తెలును. ఈ రకంగా తమ కులస్తులంతా ఏకమైనందుకు చంకలు కొట్టుకున్నారు ఆ కుల నాయకులు. రాజధానిలో తాము చేసిన ప్రదర్శనకి ప్రభుత్వం భయపడిందని రొమ్ము విరుచుకున్నారు మతవాదులు.

ఎలాంటి గొడవలూ ఘర్షణలూ లేకుండా శాంతియుతంగా ముగిసినందుకు పొంగిపోయింది ప్రభుత్వం. పోలీసులు చాలా నిగ్రహంతో వ్యవహరించారనీ లేకపోతే రక్తం ఏరులై పారేదనీ తమని తాము పొగుడుకున్నారు.

కేంద్రప్రభుత్వంవుంది. రాష్ట్రప్రభుత్వం వుంది. లక్షలాది సైన్యంవుంది. అంతులేని పోలీసుబలగముంది. సాయుధ సామగ్రికి మితేలేదు. చేతిలో చట్టముంది. ఆపైన కోర్టు ఆదేశముంది. దాని వెనుక జాగృత జనపు మద్దతు వుంది. నాగరికతా చిహ్నముంది. మానవతా జెండావుంది.

అయినా ఆ వుత్సవం ఆహాఓహో అన్నట్టుగా జరిగింది.

మతవాదులు విజృంభించి సతిని మహిమాన్వితం చేస్తోంటే గుడ్లప్పగించి చూస్తూండిపోయింది ప్రభుత్వం.

ఇది ప్రజాప్రభుత్వం ఇది నాగరిక దేశం.

దేశాన్ని తల్లిగా కొలుస్తాం పూజిస్తాం భారత మాతా! నీ కూతుళ్లని సజీవదహనం చేసేసి వారు దేవతలయ్యారని పూజిస్తాం కూడా.

మమ్మల్ని చూసి కన్నీరు పెట్టుకోకు మాతా! కన్నీటిని వ్యర్థం చెయ్యకు!

మేం కళ్లున్న అంధులం! చెవులున్న బధిరులం! మెదడున్న మూర్ఖులం! పిటీ అజ్!

అనుకుంది దివ్య అదంతా చూస్తూ.

★ ★ ★

"కంగ్రాట్యులేషన్స్ దివ్యా. సతి గురించి చాలా దారుణాలు వెలికితీస్తూ చక్కని సెన్సేషనల్ న్యూస్ అందించావ్" ఎడిటర్ మహర్షి అభినందించారు దివ్యని.

"బట్ అయామ్ నాట్ హేపీ సార్"

"వై?"

"వార్త ప్రచురించినంత మాత్రాన స్త్రీల పరిస్థితి ముఖ్యంగా వితంతువుల దౌర్భాగ్య స్థితి మారిపోదు సార్! వారి పునరావాసానికీ పునర్వివాహానికీ చేయూతనివ్వాలి. ఏర్పాట్లు చెయ్యాలి. నవ్వుతూ బ్రతికే హక్కు అందరికీ వుందని చాటి చెప్పాలి. పతి చనిపోతే పత్ని బ్రతుకు తెల్లారినట్లు కాదనీ అతడు అసంపూర్తిగా వదిలిన పనుల్నీ బాధ్యతల్నీ నెరవేర్చాల్సిన ధర్మం ఆమె మీదవుందని చెప్పాలి. పతికోసం బ్రతికే స్త్రీయే వుత్తమురాలన్న తాత మామ్మల మాటల్ని తుడిచేసి పతికోసమూ తనకోసమూ కూడా జీవించే స్త్రీయే వుత్తమురాలని నూరిపొయ్యాలి. ఆమె కేవలం పత్నియేకాదని తల్లి గృహిణి కూడానని చెప్పాలి. పిల్లల బాధ్యతలూ ఇంటి బాధ్యతలూ కూడా నెరవేర్చి పరివారపు బండిని సరైన బాట వెంట నడపాల్సిన గురుతరమైన బాధ్యత ఆమె భుజస్కంధాల మీద వుందని చెప్పాలి. భర్తపోయినంత మాత్రాన పువ్వులకీ నవ్వులకీ దూరం కానక్కర్లేదని మళ్లీ పెళ్లి చేసుకుని కొత్త ఇంటిని నిర్మించుకోవచ్చని చెప్పాలి. స్త్రీయైనా పురుషుడైనా తమ జీవితాలని సద్వినియోగం చేసుకోవడంలోనే వారికి మోక్షం ఇమిడి వుందని విడమర్చి చెప్పాలి" ఆవేశంగా అంది దివ్య.

"పాయింటే... కాని అవి కన్నీటి తుడుపు చర్యలవల్ల సాధ్యంకాదు. సమాజంలో వ్యవస్థలో ఆలోచనా దృక్పథంలో సమూలమైన మార్పురావాలి. సతికైనా వరకట్నపు మృతికైనా ముఖ్య కారణం ఆస్తి. ఆస్తి పంపకాల్లో ఆర్థిక కేంద్రీకరణలో మార్పు రావాలి. ఐక్యరాజ్యసమితి రిపోర్టు ప్రకారం ప్రపంచ శ్రమలో మూడింట రెండు వంతులు స్త్రీలే చేస్తున్నారు. ప్రపంచ ఆదాయంలో పదింట ఒకవంతు వారే ఆర్జిస్తున్నారు. కాని ప్రపంచ ఆస్తిలో ఎన్నో వంతు ఆస్తిని కలిగివున్నారో తెలుసా? నూరింట ఒక్క వంతు మాత్రమే.

ఈ ఆర్థిక వ్యత్యాసమే స్త్రీని సాంఘిక దురాగతాలకీ, అసమానత్వానికీ దోపిడికీ ఎరచే

స్తోంది. వ్యభిచారం, మానభంగం సతి, అవమానం, హీన స్థానం, వరకట్నపు చావులు -ఇవన్నీ కూడా ఆర్థిక విలువల్లోంచి వచ్చినవే. ఆర్థికబలం వల్ల వేళ్లూనిన పురుషాధిక్యత లోంచి పుట్టినవే. రూపాలలో క్రియలలో పేర్లలో తేడా వుండొచ్చుగాని స్త్రీని అణచివుంచే మౌలిక ప్రాతిపదిక ఆస్తి -ఆర్థికం!''

''అవును సార్... ఆడపిల్ల పుట్టుక అశుభమని ఏడుస్తారు. కారణం? ఐశ్వర్యంలో కొంత భాగం కొల్లగొట్టుకుని మరో ఇంటికి పోతుందని. అందుకే సెక్స్ నిర్ణయ పరీక్షల ద్వారా పుట్టే బిడ్డ ఆడో మగో ముందే తెలుసుకుంటున్నారు. ఆడపిల్ల అయితే కన్ను తెరవక ముందే మూయించేస్తున్నారు. ఒక్క బొంబాయిలోనే యాభైవేల ఫిమేల్‌ఫాయిటిసైడ్ కేసులు రిపోర్టు చెయ్యబడ్డాయంటే ఆడ శిశు హత్యలు ఎంత విస్తృత రూపం ధరిస్తున్నాయో చూడండి. ఆ గండంగడిచి ఎలావోలా పుట్టి పెరిగి అత్తవారింటికెళ్తే అత్తవారేం చేస్తున్నారు? కట్నదాహంతో చిత్రవధలు చేస్తున్నారు. సజీవదహనాలు చేస్తున్నారు. దేశంలో 1985లో 990 వరకట్నపు చావులు రికార్డుకెక్కితే 1986లో 1319 ఎక్కాయి. ఆంధ్రాలో 1985లో 13 అయితే 1986లో 79, 1987లో జులై నెల వరకూ 166 కేసులూ నమోదయ్యాయి.

అత్తిల్లూ పుట్టిల్లూ గాక గడపదాటితే రక్షణే లేదు ఆడదానికి. రేపులూ గాంగ్ రేప్‌లూ అవమానాలూ అపహరణలూ!

ఉద్యోగార్థులై బ్రిటన్ వెళ్లే భారతీయస్త్రీలు కన్యాత్వ పరీక్షలు చేయించుకోవాలన్నది బ్రిటన్. నిన్నగాకమొన్న కాకినాడ వైద్య కళాశాల ప్రిన్సిపాల్ విద్యార్థినులు నెలకొకసారి గర్భధారణ పరీక్షలు చేయించుకోవాలని ఆదేశించారు. త్రిపురలో అస్సాం రైఫిల్ దళంవారు గిరిజన యువతుల్ని గాంగ్ రేప్ చేశారని మొన్నటి పేపర్లోని వార్త! ఇక ఆడవాళ్లని రక్షించేదెవరు సార్?''

''ఎవరో వచ్చి రక్షించాలనెందుకాలోచిస్తున్నావు? ఏ మహానుభావుడో జన్మిస్తాడనీ, మరెవరో దూత వచ్చి రక్షిస్తారనీ, రక్షించాలనీ ఎప్పుడూ ఆలోచించకు దివ్యా. ముందు నువ్వూ నీలాంటి స్త్రీలూ అబలలమన్న హీనభావంలోంచి బయటపడాలి. అప్పుడే స్త్రీ శక్తి యుక్తులేమిటో ఎంతటివో తెలిసొస్తాయి. రెండు దశాబ్దాలపాటు సువిశాల దేశాన్ని పరిపాలించిన ఇందిరాజీ స్త్రీయనీ, వితంతువనీ మర్చిపోతే ఎలా? ఆమెకంత శక్తి ఎలా వచ్చింది? ఆత్మవిశ్వాసం, దీక్ష, పట్టుదల, తార్కికవిజ్ఞానం, సంఘటితపర్చగల శక్తి, చొరవ, పోరాట పటిమ! ఈ సంగతెప్పుడో గ్రహించారు గనుకే స్త్రీని ప్రకృతిగానే కాదు శక్తి స్వరూపిణిగా అభివర్ణించారు అభినందించారు ఆరాధించారు''

''పురుషులైవుండి కూడా స్త్రీ పక్షపాతం వహిస్తూ ఎంత చక్కగా విడమర్చిచెప్పేరు!''

మహర్షి నవ్వుతూ ఏదో అనబోయారుగాని ఇంతలో ఫోను మ్రోగింది. రిసీవర్ అందుకున్నారు.

''దివ్యా? ఇక్కడేవుంది... నీకే ఫోన్...''

కంపిస్తోన్న చేతుల్తో రిసీవర్ అందుకుంది. ఎంతో ప్రమాదమొస్తే తప్ప ఎడిటర్‌గారి ఫోన్‌ని ఇతరులకోసం వుపయోగించరు. అలాటిది... లైన్లో చైతన్య.

''చాలా దారుణం జరిగిపోయింది దివ్యా. గుండె చిక్కబట్టుకోవాలి.''

''ఎవరికి? ఏం జరిగింది?''

''సీత... సీత చనిపోయింది! స్టౌ అంటుకుని ప్రమాదవశాత్తూ...''

''నో... నో...''

ఆమె అరుపు ప్రతిధ్వనించిందా గదిలో.

★ ★ ★

పట్నంలోని మహిళా సంఘాలన్నీ రామారావు ఇంటిమీదకి దండెత్తి వచ్చాయి. మహిళలంతా కోపోద్రిక్తులై కొంగుబిగించి మరీ వచ్చారు.

ప్రమాదవశాత్తూ చీరకి స్టౌ అంటుకుని సీత చనిపోయిందని నలుగుర్నీ నమ్మించి గుట్టుచప్పుడు కాకుండా దహనక్రియలు ముగించేద్దామని చూస్తోన్న రామారావూ మహంకాళీ అంజనేయులూ పోలీసు ఫోర్సుతో వచ్చిన చైతన్యని చూసి ఖంగుతిన్నారు. అతడికెవరు తెలియజే




శారో అర్థంకాక కలవరపడ్డారు.

అతన్ని లోబరుచుకోవడానికి అన్ని రకాల ఎరలూ చూపారు. దివ్యతో అతడి పెళ్లికి అడ్డు చెప్పమంటూ మావాడివి మా ఇంటల్లుడివని వీపు నిమిరారు. కాని అతడేమీ విన్పించుకోలేదు. డ్యూటీ ఫస్ట్ అని భీష్మించేసరికి కాళ్లమీద పడిపోయారు.

వారిని గొంగళిపురుగుల్ని దులిపినట్టుదులిపేశాడతను. ఈలోగా దివ్యకీ ఆమె ద్వారా మహిళా సంఘాలకీ తెలిసేలా చేశాడా వార్తని. కదనరంగాన కురికినట్లుగా కదిలి వచ్చేశారంతా.

వారిని చూసి అంతవరకూ సానుభూతి కురిపించిన మిత్రులు కూడా చల్లగా జారుకున్నారు.

త్రోసుకొస్తోన్న జన సందోహాన్ని చూస్తోంటే దుష్టత్రయం గుండెలు బేజారెత్తిపోయి, ప్రాణభయంతో ఏడవసాగారు.

చైతన్య కేకలేసేసరికి దిష్టిబొమ్మల్లా నిలబడిపోయారు నోట్లో గుడ్డకుక్కుకుని.

వారి మధ్య ఓ మాంసపు ముద్ద.

జనంలోంచి ఎక్కుపెట్టి విడిచిన బాణంలా దూసుకొచ్చింది దివ్య.

"అమ్మా! నాన్నా! అన్నయ్యా! ఎంతపని చేశారు. మీరు నావాళ్లని చెప్పుకుంటేనే పంచ మహా పాపాలూ చుట్టుకునేంత దారుణానికి తలపడ్డారు. అయ్యో... వదినా... వీళ్లేదో హామీ ఇస్తే కల్లబొల్లి మాటలు చెబితే ఆదరిస్తారని నమ్మి మోసబోయాం. వీళ్ల నంగనాచి కబుర్లు నమ్మినందుకు ప్రాణాలకే ముప్పు వచ్చింది వదినా... వీళ్లు మనుషులుకాదు రాక్షసులు కట్నపు సొమ్ముకోసం ఆర్థికదాహం తీర్చుకోవడం కోసం గృహలక్ష్ముల్ని కాల్చి చంపే పిశాచాలు! వీళ్లని బ్రతకనివ్వకూడదు. చంపండి... నరకండి... బహిరంగంగావురి తియ్యండి..."

మహిళాజనం రెచ్చిపోయారు. ఆగ్రహోద్రేకాలతో పాలోమంటూ ముందుకి త్రోసుకొచ్చారు.

చైతన్య తన బలగంతో అడ్డుకోకపోతే ఆ ముగ్గురూ ఏమయ్యేవారో వూహించటం కష్టం.

"చైతన్యా! వాళ్ల నాపకు... ఆపకు... ఈ దుష్టుల్ని రక్షించకు. వాళ్ల కోపాగ్నిలో వీళ్లని భస్మం కానివ్వు. ఇలాంటివారికి బ్రతికే హక్కులేదు చైతన్యా..."

"వుద్రేక పడకు దివ్యా... వీళ్లని శిక్షించడానికి చట్టముంది"

"పచ్చని బ్రతుకులో నిప్పులు పోసి చంపిన ఈ కిరాతకుల చేతులకి బేడీలు వెయ్యి చైతన్యా... ఈడ్చుకుంటూ రోడ్లంట తీసుకుపో... నడిబజార్లో బహిరంగంగా వురి తీయించు..."

"ప్లీజ్! నిన్ను నువ్వు కంట్రోలు చేసుకో దివ్యా" అంటూ ఆమెని బయటికి తీసుకొచ్చేశాడు బలవంతాన.

అతడి పట్టు వదిలించుకుని జనాన్నుద్దేశించి అంది -

"కంట్రోల్ చేసుకునే శక్తి పోయింది మాకు. కన్నతీపి అంటే ఏమిటో కడుపు కోతంటే ఏమిటో తెలిసిన వీళ్లు మరో తల్లి కన్న బిడ్డని కానులకోసం ఖూనీ చేసేశారు. స్త్రీకి స్త్రీయే శత్రువని వూరికే అనలేదు. కట్నం కోసం కోడళ్లని హత్య చేసేవారిలో అత్తావుంది. ఆడబడుచూవుంది. అంచేత దోషం పురుషులదా స్త్రీలదా అని తర్కిస్తూ కూర్చోవద్దు. అసలు దోషం అసలు లోపం సమాజంలో వుంది. సమాజపు ఆర్థిక వ్యవస్థలో వుంది. దాన్ని మార్చే వరకూ మన సమస్యలు పరిష్కరింపబడవు. మనకి విముక్తి లభించదు. సతిమంటల భుగభుగల్నుంచీ, వరకట్నపు చిత్రవధల హాహాకారాల్నుంచీ, అవమానాగ్ని పరీక్షల విష నాల్కల్నుంచీ, పురుషదాస్య శృంఖలాల కర్ణ కఠోర శబ్దాల్నుంచీ, మనం విముక్తం కావాలి. మనం మనుషులమనీ, మనకీ చీమూ నెత్తురూ బాధ భయం వున్నాయని చాటి చెప్పాలి. సమాజంలో మన స్థానాన్ని చేజిక్కించుకోవాలి. అర్ధాంగి, అర్ధనారీశ్వరి అంటే సరిపోదని ఆచరణలో దాన్ని ఋజువుచేసుకోమని డిమాండ్ చెయ్యాలి. పురుషుడితో సమాన ప్రతిపత్తి కల్పించాలని పోరాడాలి. అందుకు మొదటి స్టెప్‌గా మనమంతా సంఘటిత శక్తిగా రూపొందాలి. బానిస బంధనాల్ని త్రెంచుకుని నిజమైన స్వాతంత్ర్యం సాధించుకోవాలి. ఇంకా చూస్తారేం? ఎత్తండి చేతులు. బిగించండి పిడికిళ్లు..." ఆగ్రహంతో కంపించిపోతోంది దివ్య.






## "నాకు ప్రమోషన్ వద్దు మొర్రో..."

బొంబాయిలోని యూనియన్‌బాంక్ ఆఫ్ ఇండియా - నారిమన్ పాయింట్ బ్రాంచిలో టైపిస్టుగా పనిచేస్తున్న చంద్రకాంత్‌భిడే సామాన్యుడుకాడు. సుమారు ఇరవై నాలుగేళ్ల సర్వీసు గల ఈ సీనియర్ టైపిస్టు టైపు మిషన్‌తో అద్భుతాలు చేయగలడు. చిరునవ్వుచిందించే గాంధీనుంచి గంభీరంగా ఉండే సర్దార్ పటేల్



వరకూ ఎవరి బొమ్మనైనాసరే అవలీలగా తన టైప్‌మిషన్ సాయంతో చిత్రించగలడతను. కేవలం నాలుగే నాలుగు ఇంగ్లీష్ అక్షరాలతో ఒక పెద్ద ఆర్మీ బెటాలియన్‌ను మన కళ్ల ముందుంచగలడు. అలాగే 'ప్లస్' గుర్తుతో సునీల్‌గవాస్కర్‌నైనా, కార్టూనిస్టు మిరాండానైనా ప్రత్యక్షంచేయగలడు.

నిముషానికి 90 మాటల వేగంతో టైపు చేయగల చంద్రకాంత్ చిత్రలేఖనాన్ని అభ్యసించాలని చిన్నతనంనుంచీ ఉవ్విళ్లూరాడు. కాని అతని పేదరికం, రోగిష్టి శరీరం అందుకు అడ్డుతగిలాయి. పైగా కుటుంబాన్ని పోషించే భారం కూడా అతని భుజస్కంధాలపై పడింది. అందువలన టైపు, షార్టుహాండ్ అభ్యసించి బొంబాయి యూనివర్శిటీలో 18వ ఏటనే టైపిస్టుగా చేరాడు. ఆ తర్వాత అతనికి యూనియన్ బాంక్‌లో ఉద్యోగం దొరికింది.

"నువ్వు చప్రాసి పనిచేసినా అందులో నీ ప్రత్యేకత, పనిపైన శ్రద్ధ కనబరచాలి. అప్పుడే నీకు పేరొస్తుంది" అనేవాడు చంద్రకాంత్ తండ్రి. ఆ ప్రేరణతో తన వృత్తిని, అభిరుచిని కలబోసి టైపు మిషన్‌తోనే చిత్రాలు చిత్రించడం సాధనచేశాడతను. అవిశ్రాంతంగా, అకుంఠిత దీక్షతో అతను చేసిన సాధన వృథాపోలేదు. అచిరకాలంలోనే ఆ కళలో అతను నిష్ణాతుడైపోయాడు.

బొమ్మల పనిలో పడి అతడు తన టైపింగ్ పనిని అశ్రద్ధ చేశాడనుకుంటే మనం పప్పులో కాలేసినట్లే. అతను తన పనినెప్పుడూ పెండింగ్ పెట్టేవాడుకాదు. పైగా సరదాగా రికార్డుకీపింగ్ వర్కు కూడా చేపట్టి అందరి మెప్పూ పొందాడు. వాళ్ల బ్రాంచిలో ఏ ఫైలు ఎక్కడ ఉందో, ఎందులో ఏ వివరం ఉందో అతనికి కంఠోపాఠమే. ఒకరకంగా చెప్పాలంటే రికార్డుల విషయంలో అతను కంప్యూటరే. అతని పనితనానికి మెచ్చి మహారాష్ట్ర రాష్ట్రప్రభుత్వం 1985లో 'ఉత్తమ ఉద్యోగి' అవార్డునిచ్చి సత్కరించింది.

గమ్మత్తేమంటే - తన చిత్రకళ కుంటుపడుతుందనే ఉద్దేశంతో ప్రమోషన్ ఇస్తానని పై అధికారులు చెబుతున్నా వద్దని తిరస్కరిస్తున్నాడు చంద్రకాంత్‌భిడే.




## బాడీబిల్డర్ తాతయ్య

కలకత్తాలోని 'స్టూడియో-డి ఫిజిక్' వ్యాయామ శాలలో అడుగుపెట్టినవారికి ఆశ్చర్యంతో నోట మాట రాదట. 77 ఏళ్ల ముసలాయన అక్కడ కుర్రాళ్లతో సమంగా, వేగంగా కదులుతూ చకా చకా వ్యాయామం చేస్తూ కన్పించడమే అందుకు కారణం. సాధారణంగా ఆ వయస్సులో చాలామంది మంచం దిగలేనిస్థితిలో ఉంటున్నప్పటికీ ఈయనగారు మాత్రం మెలి తిరిగిన కండరాలతో మంచి బాడీబిల్డర్లా దర్శనమిస్తుంటాడు.

నిజానికి ఆయన్ను చూసినవారెవ్వరూ ఆయనకు అంత వయస్సు ఉందంటే నమ్మలేరు. కసరత్తులతో కండలు తిరిగిన శరీరం ఆయన వయస్సును కప్పిపుచ్చుతుంది. అదీగాక ఆయన కొంచెం పొట్టిగా ఉండడంవల్ల ఇంకా యువకుడిలాగే కన్పిస్తుంటాడు. ఆయన పేరు మనోహర్. 1941లో ఎయిర్‌ఫోర్సులో ఫిజికల్ ట్రెయినర్‌గా పనిచేశాడాయన. ఆదినుంచి వ్యాయామంపట్ల మక్కువ కలిగిన మనోహర్‌కు ఆ ఉద్యోగం ద్వారా ఆ విద్యలో మరెన్నో టెక్నిక్కులు తెలిశాయి. ఆ తర్వాత అతనెన్నో వెయిట్‌లిఫ్టింగ్ పోటీల్లో పాల్గొని ఎన్నెన్నో బహుమతులు చేజిక్కించుకున్నాడు.

1951లో అతను లండన్‌లో జరిగిన పోటీలలో 'మిస్టర్ యూనివర్స్' టైటిల్‌ని గెల్చుకున్నాడు. పొట్టివాడవడంవల్ల లండన్ ప్రజలు అతన్ని ముద్దుగా 'పాకెట్ హెర్క్యులస్' అని పిలిచేవాళ్లు. ఆ తర్వాత 1955, 1960లలో కూడా అదే పోటీలో అతను తృతీయస్థానాన్ని దక్కించుకోగలిగాడు. ఇంగ్లాండ్‌లో అతను కొన్నాళ్లపాటు బ్రిటీష్ రైల్వేస్‌లో ఫిజికల్ ఫిట్‌నెస్ ఇన్‌స్ట్రక్టర్‌గా పనిచేశాడు. భారతదేశానికి తిరిగి వచ్చాక ఒక సర్కస్ కంపెనీలో చేరి 17 ఏళ్లు పనిచేశాడు. అప్పటికి అతనికి 64 ఏళ్లు నిండాయి. ఉద్యోగంనుంచి రిటైరైనప్పటికీ దేహదారుఢ్యంగానీ, ఉత్సాహంగానీ అతనిలో తరిగిపోలేదు. ఇప్పటికీ వ్యాయామశాలలో రోజుకు అయిదుగంటలపాటు ఎక్సర్‌సైజులు చేయగలుగుతున్నాడితను. కుర్రాళ్లతో పోటీపడి మరీ బరువులెత్తుతున్నాడు. అతని ముఖంలో



ఎక్కడా అలసట అన్నదే కన్పించదు. దీనికి కారణం ఏమని అడిగితే- ''వ్యాయామమే నా ఉత్సాహానికీ, ఆరోగ్యానికి కారణం'' అంటాడతను.

## కక్షసాధింపు!

పాశవికంగా తమను చెరచిన మగమహారాజులపై పగబట్టి ప్రతీకారం తీర్చుకున్న అమ్మాయిల కథలు కోకొల్లలు. అలాంటి సిన్మాలూ మనమెన్నో చూశాం. అయితే మార్లాహెన్సన్ కథ దీనికి పూర్తిగా భిన్నంగా ఉంది. తన కోరిక తీర్చలేదన్న కక్షతో ఓ యువకుడ్ని గూండాలతో కొట్టించి అతన్ని సంసారానికి పనికిరాకుండా చేసిందా మహాతల్లి.

న్యూయార్క్‌కి చెందిన 24 ఏళ్ల మార్లా గొప్ప అందగత్తె. మోడలింగ్ వృత్తిని చేపట్టిన ఆ అమ్మడు మరోవంక ఖరీదైన కాల్‌గరల్‌గా కూడా పనిచేసి రెండు చేతులా గడించింది.

విటులతో పొందే శారీరక సుఖాలు సరిపో నందువల్లో మరే కారణంగానో ఆమె తన పర్సనల్ మేకప్‌మాన్ జాకోబ్‌ను వలలో వేసుకోడానికి ఎంతగానో ప్రయత్నించింది. రకరకాలుగా కవ్వించింది. అయినా అతడు లొంగలేదు. తనంటే ప్రాణం పెట్టే తన ప్రియురాలికి అన్యాయం చేయలేనని నిష్కర్షగా చెప్పేశాడతను.

అంతే! మార్లాకు ఎక్కడలేని కోపం వచ్చేసింది. తన మోచేతిక్రింది నీళ్లుతాగే అప్టాల్ మేకప్‌మాన్‌గాడు తన మాట కాదంటాడా? గొప్పగొప్ప వాళ్లకే తేలికగా దొరకని తన అందచందాల్ని కోరి ఇస్తాను రమ్మంటే తిరస్కరిస్తాడా వీడు? అని లోలోనే కుతకుతలాడిపోయిందామె. వెంటనే ప్రతీకారం తీర్చుకోవడంకోసం ఇద్దరు గూండాల్ని జాకబ్‌పైకి ఉసిగొల్పింది. ఆ ఇద్దరూ జాకబ్‌ని వెంటాడి చితగ్గొట్టడమేకాక, అతని పురుషాంగంపై యాసిడ్ పోసి కాల్చేశారు. ఆ రకంగా తనకు దక్కని సుఖాన్ని మరో యువతికీ దక్కకుండా చేసి పగతీర్చుకుంది మార్లా.



యజమానురాలు చేసిన పనికి కుపితుడయ్యాడు జాకబ్. ఆమెకు తగిన గుణపాఠం చెప్పేందుకు సమయంకోసం ఎదురుచూస్తూ ఎప్పటిలాగే డ్యూటీకి వస్తున్నాడతను. అతను ఎదురుచూసిన అవకాశం రానే వచ్చింది.

ఆరోజు...

1989 ఏప్రిల్ 6 మోడలింగ్‌కి బయలుదేరుతున్న మార్లాకు ఎప్పటిలాగే మేకప్ చేసి వెళ్లిపోయాడు జాకబ్. అయితే షూటింగ్ స్పాట్‌కి చేరుకునే సరికి ముఖం కాలిపోతున్నట్లుగా బాధ మొదలవడంతో లబలబలాడసాగిందామె. అందరూ చూస్తుండగానే కొన్ని క్షణాలలోనే ఆమె ముఖం నల్లగా కమిలిపోయి వికృతంగా తయారైంది. ఒకప్పుడు లక్షలు కురిపించిన ఆమె వదనం ప్రస్తుతం కోట్లు గుమ్మరించినా బాగుపడదని తేల్చిచెప్పేశారు డాక్టర్లు.

ఇదంతా జాకబే చేశాడనీ, హానికరమైన రసాయనాల్ని మేకప్ సొల్యూషన్లలో కలిపి పూయడంవల్లే తన ముఖం కాలిపోయిందనీ కోర్టుకెక్కింది మార్లా. కోర్టు తీర్పు మాత్రం ఇంకారాలేదు.

## అల్మరాలో ప్రియుడు

ఇటలీకి చెందిన నలభైఏళ్ల ఫ్లోరిటా అందరిలా ఆషామాషీ గృహిణి కాదు. తన భర్తగారైన జోపెట్రినో కన్నుగప్పి, ప్రియుడ్ని నరాసరి తెచ్చి తన ఇంట్లోనే పెట్టుకున్నదా వనితాశిరోమణి.

ఆమె ప్రియుడు జాకో కేవలం మూడు అడుగుల పదకొండు అంగుళాల ఎత్తుగల మరుగుజ్జు కావడం ఆమెకో వరమైకూర్చుంది. ఆ కారణంగానే 200 మైళ్లదూరంలోనున్న అతగాడ్ని ఎవరికీ తెలియకుండా రప్పించి, రహస్యంగా తన పడకగది అల్మరాలో దాచేసింది. మొగుడు బయటకు వెళ్లడంతోనే జాకోని బయటకు పిలిచేదామె. ఆ తర్వాత యిద్దరూ హాయిగా ప్రణయకార్యకలాపాలలో మునిగిపోయేవారు. సాయంత్రం పెట్రినో వచ్చేముందే జాకో గప్‌చిప్‌గా లేచి అల్మరాలోకి పోయి కూర్చునేవాడు. అతని అన్నపానీయాల విషయం మర్చిపోకుండా ఫ్లోరిటా ఆ అల్మరాలో పెట్టేది. హాయిగా తినడం, ఆనక ప్రియురాలితో కాలక్షేపం చేయడం మినహా మరో ధ్యాస లేకుండా రెండు నెలల కాలాన్ని గడిపేశాడు జాకో.

అయితే రంకు, బొంకు ఎంతో కాలం సాగవని మన పెద్దలు ఊరికే అనలేదుగదా? ఓ





అర్ధరాత్రి భార్య గాఢనిద్రలో ఉండగా దుప్పటి కోసమని అల్మరా తెరిచాడు పెట్రినో. అంతే! అతని గుండె ఆగినంతపనైంది. ఓ పొట్టి బుడంకాయగాడు కాలుమీద కాలువేసుకొని అతని దుప్పటిమీద దర్జాగా నిద్రపోతూ కన్పించాడు. ఇంకేముంది? తీగ కదిలిస్తే డొంకమొత్తం కదిలిపోయింది. విషయాలన్నీ



ఒకదాని తర్వాత ఒకటి బయటపడ్డాయి.

మరుగుజ్జు జాకో తన ప్రియురాలి దగ్గరికి వచ్చేటప్పుడు తన వ్యాపార వ్యవహారాలన్నీ తన అన్నగారికి అప్పగించివచ్చాడట. అంతేకాదు అవసరమైతే ఫ్లోరిటాను పెళ్లాడేందుకు వీలుగా తన భార్యకి అప్పటికే విడాకులిచ్చేసి సర్వసన్నద్ధుడై వచ్చాడట. అతని సంసిద్ధత చూసి ఫ్లోరిటా కూడా తన 18 ఏళ్ల కాపరాన్ని విడిచిపెట్టి జాకోతో వివాహానికి సిద్ధమైపోయింది.

"పొట్టివాడైతేనేం? జాకో నాకు పరిపూర్ణ సుఖం అందించాడు. అలాంటి ప్రేమాస్పదుడైన వ్యక్తితో వివాహం అంటే నాకెంతో సంతోషంగా ఉంది. శారీరక సుఖం విషయంలో అతను ఏ మగవాడికీ తీసిపోడు" అని నిస్సంకోచంగా చెబుతోంది ఫ్లోరిటా.

## కురులగోపురం

"జుట్టు ఉన్న అమ్మ ఎన్ని కొప్పులైనా పెడుతుంది" అన్నది ఒక తెలుగు సామెత. అయితే నాన్సీ విషయంవేరు. సరిపడా కేశ సంపద లేకపోయినా మందులు మాకులు వాడి, దాన్ని విపరీతంగా పెంచుకొని తాననుకొన్న హెయిర్ స్టైయిల్ని తీర్చిదిద్దుకొంది. ఇంతకీ ఆమె ఎలాంటి కొప్పు పెట్టిందనుకున్నారు? గుడిగోపురంలాంటి కొప్పు. అవును... అది కూడా మధుర మీనాక్షి దేవాలయ గోపురాన్ని తలపించేలాంటి కొప్పు...

అమెరికాకు చెందిన రంగస్థల నటి నాన్సీ 1987లో భారతదేశాన్ని ఓసారి సందర్శించింది. ఆ సందర్భంలో దక్షిణాదిలోని ప్ర



ముఖ దేవాలయాలన్నింటినీ చూస్తూ వచ్చి మధుర మీనాక్షిని కూడా దర్శనం చేసుకొంది. చూసీ చూడ్డం తోటే ఆ గుడి గోపురం ఆమెను ఆకట్టుకొంది. అప్పటికప్పుడే ఆ గోపురం స్టైల్లో తన కురుల్ని తీర్చిదిద్దుకోవాలని ఆమె నిర్ణయించుకుంది. అందుకు సరిపడా జుట్టులేనందున మందులు కృత్రిమ నూనెలు వాడి జుట్టును ఏపుగా పెంచుకొంది. ఆ తర్వాత భారతదేశన్నుంచి రికాబీ అనే హెయిర్ డ్రెస్సర్‌ని పిలిపించి తనకు కావల్సిన రీతిలో అంటే గోపురం స్టైల్లో తన జుట్టును డిజైన్ చేయమని కోరింది. అందుకోసం వందల సంఖ్యలో మీనాక్షి దేవాలయం తాలూకు ఫొటోల్ని తెప్పించి రికాబీ ముందు పోసిందామె.

ఆ ఫొటోల్ని ఆధారంగా చేసుకొని దాదాపు నాలుగు నెలలపాటు శ్రమించి ఆమెకు కావాల్సిన రీతిలో గోపురం కొప్పును తీర్చిదిద్దింది రికాబీ. 10 అడుగుల ఎత్తుతో 23 కిలోల

బరువుగల ఆ కురులగోపురానికి చుట్టూ అగరొత్తులు వెలిగించి గుడి వాతావరణాన్ని సంతరించిపెట్టిందా గడుసైన హెయిర్‌డ్రెస్సర్. ఆ వింత కొప్పుతో నాన్సీ పది రోజులపాటు అమెరికాలోని వివిధ ప్రాంతాలు తిరిగి అందరి మన్ననల్ని పొందింది. తను కోరుకున్న పంథాలో తన హెయిర్ స్టైయిల్ని రూపొందించినందుకుగాను రికాబీకి అక్షరాలా లక్షాపాతికవేల రూపాయల్ని ముట్టచెప్పింది నాన్సీ. దీన్ని చూసి రేపు మరో అమ్మాయి చార్మినార్ స్టైయిల్లో తన హెయిర్ స్టైయిల్ని మార్చుకున్నా ఆశ్చర్యంలేదు ఏమంటారు?

## కథల్లేని హీరో

జేమ్సుబాండ్ సిన్మాలు ఒకప్పుడు డజన్ల సంఖ్యలో వచ్చి కోట్లాది ప్రేక్షకుల్ని ఉర్రూతలూగించాయి. రోగర్‌మూర్, సీన్‌కానరీ వంటి నటులు జేమ్సుబాండ్ పాత్రకు ప్రాణం పోసి ప్రేక్షక హృదయాలలో సుస్థిర స్థానాన్ని ఏర్పరచుకు



న్నారు. ఆయా సిన్మాలలో జేమ్సుబాండ్‌కి చేతకానిది, అతీతమైనది ఏదీ ఉండదు. ఆకాశంలో ప్రయాణించే కార్లు, నీటిమీద తేలియాడే విమానాలు, డిమ్కం డిమ్కం ఫైట్లు, ధన్ ధనా రివాల్వర్ చప్పుళ్లు... వీటన్నింటి మధ్యా జేమ్సుబాండ్‌గారి రొమాన్సులు ప్రేక్షకుల్ని బ్రహ్మాండంగా అలరించేవి. ఇప్పటికీ ఆలనాటి సీన్‌కానరీ, రోగర్‌మూర్‌ల చిత్రాలు వచ్చాయంటే చాలు థియేటర్లు జనంతో కిటకిటలాడిపోతాయి.

అదలా వుంచితే, ఆమధ్య మరో కొత్త జేమ్సుబాండ్ పుట్టుకొచ్చాడు. టిమోతీడాల్టన్ అనే ఆ మహాశయుడు 'ది లివింగ్ డేలైట్స్' అనే సిన్మాలో జేమ్సుబాండ్‌గా సరికొత్త అవతారం ఎత్తాడు. 43 ఏళ్ల వయస్సుగల డాల్టన్ గత పాతికేళ్లుగా సినీరంగంలోనే ఉంటూ విభిన్నమైన పాత్రలు ధరించాడు. అప్పటికే జేమ్సుబాండ్‌గా లబ్ధప్రతిష్టులైన హీరోల్ని అనుకరించకుండా తనదైన శైలిలో 'ది లివింగ్ డేలైట్స్'లో బ్రహ్మాండంగా నటించి చాలా మందిని ఆకట్టుకున్నాడతను.

"జేమ్సుబాండ్ కారెక్టర్ సూపర్‌మాన్ లాంటిది కాదు. మెజీషియన్ అంతకంటే కాదు. కాకపోతే గొప్ప మేధస్సుతో శత్రువుల ఎత్తుల్ని చిత్తుచేసి విజయాల్ని అందిపుచ్చుకుంటుంటాడు. అసలు ఈ పాత్రకు రూపకల్పన చేసిన రచయిత ఇయాన్ ఫ్లెమింగ్ నవలల్ని విపరీతంగా చదివి ఆ పాత్రను క్షుణ్ణంగా అర్థం చేసుకోబట్టే ఆ చిత్రంలో అంత బాగా నటించగలిగాను. పాత్రపట్ల నాకు స్పష్టమైన అవగాహన ఉండబట్టే 'ది లివింగ్ డేలైట్స్' సూపర్‌హిట్ అయింది. ఆ పాత్రకు మిగిలిన జేమ్సుబాండ్ హీరోలకన్నా నేనే చక్కటి న్యాయం చేశానని నా నమ్మకం" అంటాడు డాల్టన్.

'ది లివింగ్ డేలైట్స్'లో నటించినందుకు డాల్టన్ కోటి రూపాయలపైనే పారితోషికం పుచ్చుకున్నాడు. చిక్కొక్కడ వచ్చిందంటే- ఇయాన్ ఫ్లెమింగ్ రాసిన జేమ్సుబాండ్ నవలలన్నీ సిన్మాలుగా ఎప్పుడో వచ్చేశాయి. సరికొత్త నవలలు రాయడానికి ఇయాన్‌ఫ్లెమింగ్ ఇప్పుడు లేడు. మరి ఈ కొత్త జేమ్సుబాండ్‌తో సిన్మాలు తీయాలంటే నవలలెక్కడున్నాయని నిర్మాతలు జుట్టు పీక్కుంటున్నారు. అయితే వీళ్లంతా ఇయాన్‌ఫ్లెమింగ్‌లాగే డిటెక్టివ్ నవలలు రాసే జాన్‌గార్డినర్ వెంటపడతారని మనం భావించవచ్చు.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428. Office address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 476685, Visakhapatnam 52211, Tirupati 5291, Anantapur 22977.

